THE LARGEST CIRCULATED TELUGU WEEKLY



# స్వాతి

సపరివార పత్రిక

FOUNDER PROPRIETOR EDITOR : VEMURI BALARAM



పాఠక దేవుళ్ళకు నమస్కారం

ఎడిటర్

వేమూరి బలరామ్

ESTABLISHED 1984 | సంపుటి 34 | 22.12.2017 | సంచిక 25

అనిల్ బిల్డింగ్స్ సూర్యారావుపేట పోస్ట్ బాక్స్ 339 విజయవాడ 520 002

Know thy self that is the real knowledge

సీరియల్స్



కథలు





ముఖచిత్రం : భూమిపడ్నేకర్
Courtesy : FEMINA
Photography : FARROKH CHOTHIA

స్పెషల్ ఫీచర్స్



శీర్షికలు



## శాంతికి మార్గం

ప్రేమస్వరూపులారా! మీరు నూతనమయిన, పవిత్రమైన భావాలను పెంచుకోండి. త్యాగం, ప్రేమ, సత్యం- ఈ మూడింటినీ పెంచుకుంటే మీరు ధన్యులవుతారు.సమాజంలో మీ తోటి వ్యక్తిని ప్రేమించండి. అతనితో మంచిగా మాట్లాడండి. అతనికి ఏమైనా సహాయం కావలసివస్తే చేయండి. ఇంతకంటే గొప్ప సాధన మరొకటి లేదు.

ఈ ప్రపంచంలో మీరు బతికినంత కాలం త్యాగంతో మీ జీవితాన్ని ధన్యం చేసుకోండి. 'త్యాగే నైకే అమృతత్వ మానశుః' త్యాగంద్వారానే మీకు శాశ్వతమైన ఆనందం లభిస్తుంది.

త్యాగం చేయని మానవునికి ఎక్కడికి పోయినా శాంతి లభించదు. 'శాంతి శ్శాంతి శ్శాంతిః' అని శాంతికోసం అన్ని దేశాలవారూ ప్రార్థిస్తూనేవున్నారు. కాని శాంతి లభిస్తున్నదా? లేదు.

మీలోనే వున్న భగవంతుని విస్మరించి భగవంతుడు ఎక్కడో బయట వున్నాడనే భావంతో ఆరాధన సల్పితే మీకు శాంతి ఏ రీతిగా లభిస్తుంది?! ప్రేమస్వరూపులారా! ఏది జరిగినా మన మంచి కోసమే అని విశ్వసించండి.

మీకు ఏదైనా కష్టం వచ్చిందంటే, ఇదెక్కడినుండి వచ్చిందని మీరు వెతకనక్కర్లేదు. అది మీ నుండి వచ్చిందే. మీరు ఇతరులను గౌరవించినప్పుడు ఆ గౌరవమే మిమ్మల్ని కాపాడుతుంది.

మీరు ఇతరులను అవమానిస్తే, ఆ అవమానమే మిమ్మల్ని శిక్షిస్తుంది.సుఖంగాని, దుఃఖంగాని మీకు మీరు సంపాదించుకున్నదే. కనుక మీకు ఏ బాధ కలిగినా ఇతరులపై నిందవేయకండి. ఎవ్వరినీ దూషించకండి. అందరినీ ప్రేమించండి. అందరూ భగవంతుని బిడ్డలేనని విశ్వసించండి.

-భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

చందాను www.swatipublications.com వెబ్‌సైట్ ద్వారా చెల్లించవచ్చు
E-mail: advtswati@gmail.com swativja@eth.net

విడిప్రతి ₹20 12 నెలలకు ₹1076
విదేశాలకు సంవత్సరచందా (ఎయిర్ మెయిల్) ₹6666 (100 డాలర్లు)

Editor : VEMURI BALARAM Swati Publications Anil Buildings Suryaraopet Vijayawada 520 002 Printed and Published by the owner VEMURI BALARAM
Printed at Anil Swati Press Autonagar Vijayawada Cover at Kala Jyothi Process Pvt.Ltd., Hyderabad
Tel.: (0866) 243 1862 243 4017 Advt. 243 1233 Mktg. 243 3938 Fax: 0866-243 0433



సాక్షి

## 8.12.2017

పరుల మెప్పుకోసం కాక తమ స్థితి గతులకు లోబడి బతికేవారి బతుకు మొదట కాకున్నా చివరకు ఆనందడోలి కల్లో ఊరేగుతుంది. ఇదే సందేశం 'చిన్నచూపు' కథ అందిస్తున్నది.

'అనిల్', 'ఫర్ U' శీర్షికలు చాలా అద్భుతంగా వుంటున్నాయి.

'ఈ శీర్షిక మీదే' ఒక మలయ మారుతం. 'బి హ్యాపీ' ఫన్నీగా ఉంది.

పి.నరసయ్య హైదరాబాద్

'అపరాధభావము శిలలా మనకు భారంగా మారకూడదనుకుంటే తప్పు ఒప్పుకోవడం ఉత్తమ మార్గం' అన్న జగ్గీ వాసుదేవ్ హితోపదేశం ఆచరణీయం.

'2034' కథ చాలా బాగుంది.

యు.చిట్టిబాబు న్యూపాల్వంచ

'అనిల్'విభిన్నరీతిలో ఆకట్టుకుంది. 'సత్యాన్వేషణ' శీర్షికలో 'నీ కర్తవ్యాన్ని చెయ్యి, ఫలితాన్ని దేవుడు ఇచ్చి తీరుతాడు' అని ఉదహరించింది. ఇది ఆచరణీయంగా ఉంది.

'చిన్న'చూపు' కథ హృద్యంగా సాగింది. 'కదిలే బొమ్మల కబుర్లు' ఇంట్రెస్టింగ్‌గా ఉన్నాయి.

ఎన్.ఎస్.చంద్రబోస్ విశాఖపట్నం

సద్గురు జగ్గీ వాసుదేవ్‌గారి ప్రవచానుసారం- చేసిన తప్పును ధైర్యంగా ఎదుర్కోవాలనీ,అలా ఒప్పుకుంటేశత్రువుల్నికూడా మిత్రులుగా మార్చగల బలాన్నిస్తుందనీ మాకవగతమైంది.

ఎ.వి.సోమయాజులు కాకినాడ

మనిషి పెరిగేకొద్దీ మనసు, శరీరం బిరుసెక్కి చేసింది తప్పు అని తెలిసినా ఒప్పుకోలేని అహంకారంవల్లనే అనర్థాలు జరుగుతాయన్న సద్గురు జగ్గీ వాసుదేవ్‌గారి భాషణం శిరోధార్యం.

'ఆత్రేయ మధురగీతాలు' అలరిస్తున్నాయి. చాలా బాగున్నాయి.

ఎమ్.కృష్ణ కాకినాడ

'మనిషిలో మనిషి', 'అఆఇఈ', 'వసంతసేనా చారుదత్తం', 'జై భారత్' సీరియల్స్‌లోని వస్తువైవిధ్యం మా మనసుల్ని దోచుకుంటోంది.

వచ్చేవారం స్పెషల్

స్టార్ టీమ్

'ఖజానా', '2034', 'చిన్నచూపు' కథలు చాలా బాగున్నాయి.

'చివరిరోజుల్లో...' శీర్షిక బాగుంది.

బి.సోనాలి సూర్యారావుపేట

'మనిషిలో మనిషి' సీరియల్ చాలా ఇంట్రెస్టింగ్‌గా వుంది.

'జై భారత్', 'అఆ ఇఈ', 'వసంత సేనా చారుదత్తం' సీరియల్స్ చాలా ఆసక్తికరంగా సాగుతున్నాయి.

'ఖజానా', '2034', 'చిన్న'చూపు' కథలు చాలా బాగున్నాయి.

'చివరిరోజుల్లో...' శీర్షిక బాగుంది.

టి.బసవరాజు కర్ణాటక

# ఇది మంచి సమయం



**14.12.2017 నుండి 18.12.2017 వరకు శ్రీ హేవళంబి నామ సంవత్సరం, దక్షిణాయనం, హేమంతఋతువు, మార్గశిరమాసం, కృష్ణపక్షం. 19.12.2017 నుండి పుష్యమాసం, శుక్లపక్షం.**

### 14.12.2017 గురువారం

తిథి: ద్వాదశి తె. 5.08 వరకు
నక్షత్రం: స్వాతి రా. 11.04 వరకు
వర్జ్యం: లేదు
దుర్ముహూర్తం : ప. 10.03 నుండి 10.47 వరకు. మ. 2.29 నుండి 3.13 వరకు
రాహుకాలం: మ. 1.17 నుండి 2.40 వరకు
మంచి సమయం: ప. 11.30 నుండి 12.00 వరకు
సూర్యోదయం: 6.26కి
సూర్యాస్తమయం: 5.30కి

### 15.12.2017 శుక్రవారం

తిథి: త్రయోదశి పూర్తి
నక్షత్రం: విశాఖ రా. 1.30 వరకు
వర్జ్యం: ఉ. 5.14-7.00 వరకు
దుర్ముహూర్తం : ప. 8.32-9.17 వరకు. మ. 12.14-12.59 వరకు
రాహుకాలం:ప. 10.32 నుండి 11.55 వరకు
మంచి సమయం: ప. 10.30 నుండి 11.20 వరకు
సూర్యోదయం: 6.26కి
సూర్యాస్తమయం: 5.30కి

### 16.12.2017 శనివారం

తిథి: త్రయోదశి ఉ. 7.11 వరకు
నక్షత్రం: అనూరాధ తె. 4.12 వరకు
వర్జ్యం:ఉ. 5.57 నుండి 7.44 వరకు
దుర్ముహూర్తం: ఉ. 6.18 నుండి 7.48 వరకు
రాహుకాలం: ప. 9.10-10.33 వరకు
మంచి సమయం: ప. 10.30 నుండి 11.20 వరకు
సూర్యోదయం: 6.27కి
సూర్యాస్తమయం: 5.31కి

### 17.12.2017 ఆదివారం

తిథి: చతుర్దశి ప. 9.30 వరకు
నక్షత్రం: జ్యేష్ఠ పూర్తి
వర్జ్యం:ప.10.30 నుండి 12.18 వరకు
దుర్ముహూర్తం: సా. 3.57 నుండి 4.41 వరకు
రాహుకాలం: సా. 4.03 నుండి 5.26 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 6.28కి
సూర్యాస్తమయం: 5.31కి

### 18.12.2017 సోమవారం

తిథి: అమావాస్య ప. 12.00 వరకు
నక్షత్రం: జ్యేష్ఠ ఉ. 7.07 వరకు
వర్జ్యం:సా.4.08 నుండి 5.56 వరకు
దుర్ముహూర్తం : మ. 12.15-12.59 వరకు. మ. 2.29-3.13 వరకు
రాహుకాలం: ఉ. 7.43-9.06 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 6.28కి
సూర్యాస్తమయం: 5.31కి

### 19.12.2017 మంగళవారం

తిథి: పుష్య శుద్ధ పాడ్యమి మ. 2.39 వరకు
నక్షత్రం:మూల ప. 10.09 వరకు
వర్జ్యం:ప.8.21 నుండి 10.09 వరకు. రా. 8.59 నుండి 10.47 వరకు
దుర్ముహూర్తం:ప. 8.33 నుండి 9.18 వరకు. రా. 10.36-11.21 వరకు
రాహుకాలం: మ. 2.40 నుండి 4.04 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 6.28కి
సూర్యాస్తమయం: 5.31కి

### 20.12.2017 బుధవారం

తిథి : విదియ సా. 5.21 వరకు
నక్షత్రం:పూర్వాషాఢ మ. 1.15 వరకు
వర్జ్యం : రా. 10.16-12.04 వరకు
దుర్ముహూర్తం : ప. 11.32 నుండి 12.16 వరకు
రాహుకాలం: ప.11.54-1.17 వరకు
మంచి సమయం: ఉ. 5.30 నుండి 6.20 వరకు
సూర్యోదయం: 6.29కి
సూర్యాస్తమయం: 5.32కి



Courtesy : ABHIYAAN

# ఒక చిన్నమాట

డాక్టర్ జె.భాగ్యలక్ష్మి
E-mail: jbhagyalakshmi43@yahoo.in



తెలుగు వెలుగుతున్నది. పతాక శీర్షికలతో భాసిస్తున్నది. భావనాత్మకంగా మనసులు కలుపుతున్నది. మందహాసాలు విరియిస్తున్నది. హృదయాలను స్పృశిస్తున్నది.

పాఠశాలల్లో, విద్యాసంస్థలలో, నిత్యజీవన విధానంలో కనుమరుగు అవుతున్న తెలుగు గురించి కొన్నేళ్ళుగా భాషాతప్త హృదయాలు బాధపడుతూ వెయ్యివిధాల దీనిని ప్రభుత్వ దృష్టికి తీసుకురావాలని ప్రయత్నించటం జరిగింది.

మూలిగేనక్కమీద తాటిపండుపడినట్లు మునిసిపల్ స్కూళ్ళల్లో కూడా ప్రాథమిక స్థాయినుండి ఆంగ్లమాధ్యమమే అనగానే అందరూ ఆందోళన చెందారు. తెలుగు రాష్ట్రంలోనే తెలుగు పూజ్యమైతే దాని మనుగడ ఎక్కడ వెతుక్కోవాలి? ఎన్ని ఆశలతో, ఎంత ఆత్మగౌరవాన్ని ప్రోదిచేసుకుంటూ తెలుగు వాళ్ళు ముందుకు పోవాలనుకున్నారు!

అధికార భాష లేదు, బోధనా భాష కాదు, బహిరంగ ప్రదేశాలలో. సార్వజనీక స్థలాలలో తెలుగు ఫలకాలు లేవు అని వాపోతున్న బృందాలు పలు విధాల ప్రభుత్వదృష్టిని ఆకర్షించాలని చూశాయి. నిరసనలు, నినాదాలు, నివేదనలు అయ్యాయి.

స్పందన ఎక్కడ, ప్రత్యుత్తరం ఎక్కడ, హామీ ఎక్కడ అని నిరాశ చెందుతున్న సమయంలో హఠాత్తుగా ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలో ముఖ్యమంత్రి వరాల జల్లులు కురిపించేశారు.

"తెలుగుదేశం పార్టీపేరులోనే తెలుగు ఉంది. మాతృభాషపరిరక్షణకు ప్రభుత్వం కట్టుబడి ఉంది" అన్నారు. అంతేనా? కార్యాచరణ విశదీకరించారు.

"మాతృభాషకు పూర్వ వైభవం తెచ్చేందుకు,మన సంస్కృతి పరిరక్షణకు ఆరు విధానాలు అవలంబించబోతున్నాం. రాష్ట్ర సచివాలయంనుండి గ్రామ సచివాలయం వరకు తెలుగులోనే ఉత్తరప్రత్యుత్తరాలు కొనసాగేలా చూస్తాము. రాష్ట్రంలోని ప్రతి పాఠశాలలోనూ తెలుగు తప్పనిసరి చేస్తాం. న్యాయపాలన, కోర్టుల తీర్పులను సైతం తెలుగులో వెలువరించేలా హైకోర్టుతో చర్చిస్తాం" ఆన్‌లైన్‌లో ఈ-తెలుగు బోధన, అంతర్జాలంలో తెలుగు సాహిత్యం, ఆన్‌లైన్ కోర్సులువంటివి ప్రారంభిస్తామని చెప్పారు.

తెలుగు సాహిత్య, సంగీత, సాంస్కృతిక, గ్రామీణ సాంకేతిక, జానపద, చరిత్రకు సంబంధించి ఆరు అకాడమీలు ఏర్పాటుచేస్తామన్నారు. రెండేళ్ళకొక్కసారి ప్రపంచ తెలుగు మహాసభలు నిర్వహించే అభిప్రాయమున్నట్టు వెల్లడించారు.

రెండు తెలుగు రాష్ట్రాల్లోనూ అదృశ్యమవుతున్న తెలుగు గురించి ఆందోళన చెందుతున్న తెలుగు ప్రజలకు ప్రభుత్వాల తరపున హామీలు లభించాయి. అన్నీ మంచి శకునములనే ఆశాభావం మెదిలింది.

ఒక భాష గురించి ఇంత తాపత్రయమెందుకు, ఏ భాషయితేనేం భావప్రసరణకు, కాలంలో ఎన్ని మార్పులు రాలేదు, ఎన్ని భాషలు పుట్టలేదు, ఎన్ని భాషలు గిట్టలేదని ఆధునికంగా, ప్రగతిశీలకంగా ఆలోచిస్తున్నామనుకునేవారందరూ అడిగే ప్రశ్నలే.

భాష అనేది కేవలం ఒక పరికరం కాదు. మాట పదిమందికీ గట్టిగా వినపడాలంటే ఒక మైకు చాలు అన్న ధోరణిలో భావాలు తెలియజెప్పటానికి ఒక భాష చాలనలేం. మానవుని మనస్తత్వం చిత్రమయినది. ఎన్ని విశ్లేషణలు జరిగినా అది అతీతంగానే ఉంటుంది. అందుకే మనిషికీ, భాషకూ అవినాభావ సంబంధం. ఒక భాష ఉద్భవించాలంటే ఎన్ని శతాబ్దాల పరిణామం జరిగివుంటుంది?

అసలు మానవభాషలు ఎప్పుడు పుట్టాయో, ఎలా పుట్టాయో ఇప్పటివరకు తేల్చి చెప్పగలిగినవారు లేరు. అతిపురాతనమైన భాషల్లో సంస్కృతం ఉంది. తమిళంకూడా ఉంది. రాతపూర్వకంగా సుమేరియన్ భాష క్రీస్తుపూర్వం మూడువేల ఏళ్ళకు ముందే రూపొందిందంటారు.

ఏది ఏమైనా భాషలు పుట్టటం, గిట్టటం తథ్యమే. ఒక భాష మాట్లాడే వ్యక్తి ఒకరైనా మిగలనప్పుడు ఆ భాష మరణిస్తుంది.ఆ భాష మరణిస్తే దాని చరిత్ర, సంస్కృతి, నాగరికత అన్నీ మరణిస్తాయి.

మానవాళికోసం, మానవ నాగరికతకోసం,చరిత్రకోసం భాషను పరిరక్షించుకోవలసిన అవసరం అందరికీ ఉంటుంది. భాషల్లో మాతృభాష ఎందుకు ముఖ్యమవుతుంది అంటే అమ్మ, భాష రెండూ అక్కడ మిళితమై మనల్ని పోషించినందున అని చెప్పాం.

మహాభారతంలో అభిమన్యుడి కథ మనకు తెలుసు. అమ్మ కడుపులో ఉండగానే 'పద్మవ్యూహం' గురించి దానిని ఛేదించే మార్గంగురించి నేర్చుకున్నాడు. కథ సగంలోనే ఆగిపోయినందున బయటపడే మార్గం నేర్చుకోలేదు. ఇది గొప్ప కల్పన కావచ్చు.

కాని బిడ్డ పుట్టకముందే తల్లి కడుపులో ఉన్నప్పుడు చుట్టూ నిత్యమూ వినపడే శబ్దాలు ఆ బిడ్డ పెరుగుదలలో ప్రముఖ పాత్ర వహిస్తాయని విజ్ఞాన శాస్త్రమూ చెపుతుంది. తన చుట్టూ ఉన్న ప్రపంచాన్ని అర్థంచేసుకోవటం, భావాలు అర్థంచేసుకోవటం, నైపుణ్యాలు అలవరచుకోవటం ఒక బిడ్డ మొట్టమొదట నేర్చుకునే భాషతోనే మొదలవుతుంది.

విదేశాలలో ఉన్న తెలుగువారే భాషపట్ల,సంస్కృతి పట్ల ఎక్కువ శ్రద్ధ చూపుతారని తరచూ వింటుంటాం. ఈ మాట ఇతర రాష్ట్రాలలో నివసించే తెలుగు వారికీ వర్తిస్తుంది. మాతృభాషకు ఎంత దూరమైతే అంతగా ఆ మాట వినాలని, ఆ సంస్కృతికి దగ్గరవ్వాలని తపన ఎక్కువవుతుంది.

అటువంటిచోట ఒక తెలుగు కార్యక్రమమో,నాటకమో, నాట్యమో, చివరకు సినిమా అయినా సరే (ఇప్పుడు టీ.వీలున్నాయి) ఎన్ని మైళ్ళయినా పయనించి వెళ్తారు. ఎందుకని? ఒక తపన. ఒక తీయని పిలుపు. మధురమైన జ్ఞాపకం.

దేనికైనా దూరమయితేగాని దాని విలువ తెలిసిరాదేమో! మనిషి కేవలం రొట్టెతోనే జీవించలేడనే ఆంగ్ల సామెత ఒకటి ఉంది.

అదే విధంగా ఒక భాష నేర్చుకోవటం కేవలం ఉపాధికే అనే భావన పోవాలి. తర్కానికి అందని తర్కం హృదయానికి ఉందని అంటారు. అదే మాతృభాషకూ వర్తిస్తుంది. మన అమ్మను ప్రేమించాలంటే ఇతర అమ్మలను ద్వేషించనవసరం లేదు. ఇది భాషకూ అన్వయించుకోవాలి.

# త్వరితగతి మోకాలు మార్పిడి



**డా॥ నీలం వెంకట రమణారెడ్డి**
MS, MCh Ortho (UK)
కన్సల్‌టెంట్ జాయింట్ రీప్లేస్‌మెంట్ సర్జన్
**స్టార్ హాస్పిటల్స్, రోడ్ నెం.10,**
**బంజారహిల్స్, హైదరాబాద్.**

పూర్తి మోకాలు మార్పిడి అనేది తీవ్రమైన మోకాలు కీలు క్షీణత ఉన్న సందర్భాలలో చేయబడే శస్త్రచికిత్స. కీళ్ళ వ్యాధి, గాయం లేదా సాధారణ క్షీణతతో పాటుగా అనేక కారణాల చేత మోకాళ్ళు బలహీనమవుతాయి. మోకాలు మార్పిడి అనేది చాలా కాలం బెడ్ రెస్ట్ (విశ్రాంతి) మరియు దీర్ఘకాల ఫిజియోథెరపీ అవసరం అయ్యే చాలా బాధాకరమైన శస్త్రచికిత్స అనే అపోహ ఉంది.

త్వరితగతి మోకాలు మార్పిడి అనేది మోకాలు మార్పిడి యొక్క అన్ని అంశాలను ఒక సరళమైన, సూటిగా ఉండే మరియు అర్థం చేసుకోవడానికి సులభంగా ఉండే ఒక ప్రయాణంగా అనుసంధానిస్తుంది. శస్త్రచికిత్సకు ముందర వ్యాయామాల నుండి శస్త్రచికిత్స, పునరావాసం మరియు మార్పిడి అనంతర కదలిక వరకు ఈ కార్యక్రమం యొక్క పూర్తి సంరక్షణ మరియు సౌకర్యంపై కేంద్రీకృతమై ఉంటుంది.

ఒకవేళ మీకు మోకాలు మార్పిడి అవసరమయితే, మీ యొక్క వయస్సు మరియు సాధారణ ఆరోగ్యం ఆధారంగా మీకు త్వరిత-గతి శస్త్రచికిత్స అనుకూలంగా ఉండవచ్చు. సాధారణంగా ఐదు నుండి ఏడు రోజుల సమయం పట్టగా, మోకా-లు మార్పిడిల యొక్క విప్లవాత్మకమైన క్రొత్త పద్ధతి కారణంగా మా రోగులలో కొంతమంది వారి యొక్క ఆపరేషన్ తరువాత కేవలం 48 గంటలలోనే ఆసుపత్రి విడిచి వెళ్ళారు.



త్వరితగతి కార్యక్రమం కొరకు శ్రద్ధ, అంకింత భావం, క్రమశిక్షణ అవసరం - ఎందుకంటే మీరు సాధారణ రోగల కంటే ముందుగా ఇంటికి తిరిగి వెళతారు మరియు మీకు సౌకర్యవంతంగా ఉండే విధంగా మీకు మీ ఇంటివద్దనే ఒక భౌతిక చికిత్సకుని ద్వారా భౌతిక చికిత్స మరియు పునరుద్ధరణ నిర్వహించబడతాయి. రోగులను త్వరగా ఇంటికి పంపవలసిన అవసరం ఏమిటి? చాలా సరళంగా చెప్పాలంటే, రోగులు ఎంత త్వరగా ఇంటికి వెళితే వారికి అంత మన:శాంతిగా ఉంటుంది. వారికి త్వరగా నయమవుతుంది మరియు వారు ఎంతో ఆరోగ్యవంతంగా ఉంటారు.

**త్వరితగతి మోకాలు మార్పిడి వలన ప్రయోజనాలు:**

- శస్త్రచికిత్సకు ముందు జరిగే కౌన్సిలింగ్ కారణంగా రోగులకు విధానం మరియు ప్రక్రియ గురించి పూర్తి అవగాహన ఉంటుంది.
- నరాల నిరోధం, మోకాలులోకి ఇంజెక్షన్ మరియు క్రయోథెరపీ (శీతల వైద్యం)లను కలిగి ఉండే బహుళ నమూనా నొప్పి నిర్వహణా నియమావళి కారణంగా త్వరగా కోలుకుంటారు మరియు నొప్పి తక్కువగా ఉంటుంది.
- ఐసియులో ఉండవలసిన అవసరం లేదు కావున శస్త్రచికిత్స జరిగిన 2 గంటల తరువాత రోగులు గదికి చేరుకుంటారు మరియు కుటుంబంతో కలిసి అలస్యంగా భోజనం చేస్తారు. ఐసియులో ఉండడం గురించి ఆందోళన చెందే రోగులకు ఇది ఒక పెద్ద ఉపశమనం.
- రోగులు ఐసియుకు వెళ్ళరు మరియు సాంప్రదాయ మోకాలు మార్పిడి రోగల కంటే త్వరగా ఇంటికి పంపబడతారు కావున ఆసుపత్రిలో ఉండడం కారణంగా వచ్చే అంటువ్యాధుల ప్రమాదం కూడా తగ్గుతుంది.
- శస్త్రచికిత్స జరిగిన రోజు మధ్యాహ్నం నుండే ఫిజియోథెరపీ ప్రారంభించబడుతుంది. శస్త్రచికిత్స జరిగిన 24 గంటల లోగా రోగులను నిలుచోబెట్టడం మరియు నడిపించడం జరుగుతుంది.
- త్వరితగతి మోకాలు మార్పిడి కనీస తీవ్రత విధానం (మినిమల్లీ ఇన్వేసీవ్ అప్రోచ్ (ఎమ్ఐఎస్))ను ఉపయోగించి నిర్వహించబడుతుంది. పెద్ద గాటు (8 నుండి 12 అంగుళాలు) మరియు కండరాలు మరియు కండరాల స్నాయువుల యొక్క గణనీయమైన అంతరాయం అవసరమయ్యే సాంప్రదాయ పూర్తి మోకాలు మార్పిడికి భిన్నంగా ఇది చిన్న గాటును కలిగి ఉంటుంది. ఎమ్ఐఎస్ మోకాలు మార్పిడి 3 నుండి 4 అంగుళాల అతి చిన్న గాటుతో నిర్వహించబడుతుంది.
- త్వరితగతి మోకాలు మార్పిడి అనేది క్రింద పేర్కొనబడిన అనేక కారణాల చేత ఒక పెద్ద ముందడుగుగా పరిగణించబడుతుంది. అందులో కొన్ని: తక్కువ కాలం పాటు ఆసుపత్రిలో ఉండడం, త్వరగా కొలుకొవడం, తక్కువ నొప్పి మరియు చాలా తక్కువ మచ్చలు.

మరిన్ని సలహాలు మరియు సూచనల కొరకు సంప్రదించండి




**STAR HOSPITALS**
Road No.10, Banjara Hills, Hyderabad
www.starhospitals.in
Ph: 70970 60006
email: info@starhospitals.in


Courtesy : WOMENS ERA

# ఎవరికైనా అక్క ఒక వరం

**చిన్నతనంనుంచి ఎదిగేకొద్దీ ప్రతి దశలోనూ ఏవో ఒక భావోద్వేగాలు, సందేహాలు, భయాలు, సంతోషాలు మనస్సంతా నిండిపోతుంటాయి. ఎప్పటికప్పుడు వాటిని ఎవరో ఒకరితో పంచుకుంటూవుంటే భారంతో నిండిన మనస్సు ఖాళీ అయి ఉల్లాసంగా, ఉత్తేజంగా వుంటుంది. వాటిని ఎవరితో పంచుకోవాలి? యథేచ్ఛగాఎవరి ముందు మనస్సు విప్పాలి?**

అమ్మ కొంగుపట్టుకు తిరుగుతూ, మారాంచేసే సాన్నిహిత్యం వున్నా ఆమె ముందు మనస్సు విప్పే ధైర్యం రాదు. నాన్న చిటికెనవేలు పట్టుకుని పెరిగినా ఆయనతో చెప్పుకునే సాహసం చెయ్యలేరు. స్నేహితులకూ తమలాగే అరకొర జ్ఞానంకనుక వారికి చెప్పే ప్రయోజనం వుండదు.

మరి ఎవరితో పంచుకోవాలి? తనకంటే కొన్నేళ్ళు ముందు పుట్టిన అక్క వుంటేచాలు. కొండంత ధైర్యం వెన్నంటివున్నట్లే. చాలా విషయాల్లో,

ఇంకా చెప్పాలంటే అనుక్షణం అండగా, నిలిచేది అక్కే. ఆమెకు సర్వం తెలుస్తుంది. చిన్నతనంనుంచి కలసిమెలసి పెరిగిన అక్క జీవితానికి చెప్పలేనంత భరోసా ఇస్తుంది. ఎన్నో విషయాల్లో అండగా, ఆదరణగా నిలిచే అక్క వుండడం నిజంగా ఓ వరం, అదృష్టం. ఎందుకూ? అని ప్రశ్నించుకుంటే ఎన్నో సమాధానాలు సాక్షాత్కారమవుతాయి.

## తోడూ నీడగా

ఏ షరతులూ లేకుండా అచంచల ప్రేమనందించే ఇద్దరు అమ్మలు ఇంట్లో వుంటే అంతకుమించిన అదృష్టం ఏముంటుంది.నవమాసాలు మోసే కన్న తల్లి ఒకరైతే, పేగుపంచుకుని పుట్టిన తోడబుట్టిన అక్క మరో తల్లి అవుతుంది.

చిన్నతనంలో తొలినాడు స్కూలుకు చెయ్యిపట్టి చెల్లిని తీసుకువెళ్ళిన అక్క ప్రతిపనిలోనూ మనకు తోడూ, నీడా అవుతుంది. ఏ సమస్య, సంతోషం వచ్చినా ఆదరంగా ఆదరించే ఈ ఇద్దరూ పక్కన నిలిచినప్పుడు నిశ్చింతంగా వుంటుంది.

ఏ కష్టం, నష్టం వచ్చినా, మరే అవసరం వచ్చినా అక్క తోడు ఆసరాగా నిలుస్తుంది.

## తప్పులకు బాసట

చిన్నతనంలో, యవ్వనంలో చేసే చిలిపి పనులకు అంతుండదు. సాహసాలకు ప్రోత్సహించే వయస్సది. ఇద్దరూ కలిసి చేసినా, తప్పు పెద్దల ముందుకు వచ్చినప్పుడు నేరాన్ని అక్కే తన భుజాలపై వేసుకుంటుంది. ఇటువంటి బాల్యస్మృతులు జీవితాంతం వెన్నంటి వుంటాయి. ఈ స్మృతుల తాలూకు అనురాగం, ఆప్యాయతలు, అనుబంధాలు నిత్యం అక్కాచెల్లెళ్ళ నడుమ పెనవేసుకుపోయివుంటాయి.

## తొలిగురువు

డ్రెస్సింగ్‌లో, మేకప్‌లో తొలి గురువు అక్కే. ఆధునిక దుస్తులు ధరిస్తే అమ్మకు నచ్చకపోవచ్చు. మేకప్‌లు అంతకంటే నచ్చకపోవచ్చు. వీటన్నింటికీ సరైన గైడెన్స్ అక్క. నచ్చిన దుస్తులు ధరించడానికి మద్దతు ఇస్తుంది. మేకప్ కిటుకులు నేర్పుతుంది.

## చక్కని సలహాలు

ఊహ తెలిసినప్పటినుంచీ ఏ వయస్సు సమస్యలు ఆ వయస్సుకు ఉంటుంటాయి. ఎన్నో నిర్ణయాల అవసరం వుంటుంది.

ఈ అవసరంలో మంచి సలహాలిచ్చేది తోడబుట్టిన పెద్ద సోదరే. చాలా అనుభవాలు, అనుభూతులను ముందుగా అనుభవించిన అక్కకు తన చెల్లికి ఏ విధంగా సారథి అవ్వాలో ఆమెకు బాగా తెలుసు. తన అనుభవాలను రంగరించి, వాటి ఆధారంగా గొప్ప సలహాలు ఇస్తుంటుంది. ఆ సలహాలకు అదీ ఇదీ అన్న పరిధి వుండదు. సకల విషయాల్లో సవ్యసాచి అవుతుంది.

ఒక్క మాటలో చెప్పాలంటే, ఆమె స్టయిలిస్ట్,మేకప్ ఆర్టిస్ట్, అదనపు మేకప్ కిట్.

## సాంత్వన

చాలాసార్లు జీవితంలో క్లిష్టతల్ని ఎదుర్కోవాల్సి వస్తుంటుంది. యవ్వనంలో బ్రేకప్‌లు, వివాహాంతరువాత తలెత్తే సమస్యలు- జీవితంలోని ప్రతిదశలోనూ తప్పని తిప్పలు ఏవోకటి ఉంటుంటాయి. ప్రతి సమయంలోనూ తలవాల్చి కన్నీటితో కష్టాన్ని కడిగేసుకోగల ఓ భుజం ఆసారా కావాలి. ఓ మాట, ఓ స్పర్శ, ఓ చేయి సాంత్వన చేకూర్చాలి. ఇవన్నీ చేయగలిగేది రక్తం పంచుకుపుట్టిన అక్కకాక మరెవరు?

## రక్షణకవచం

ప్రతి అంశంలోనూ విశ్వాసాన్ని అందించే అక్కతో ప్రతి విషయమూ చెప్పుకునే, చర్చించే చనువు బాగా వుంటుంది. గందరగోళస్థితి నెలకొన్నప్పుడు ఎటువంటి దాపరికాలూ లేకుండా తనతో పంచుకుంటే వెంటనే పరిష్కారమార్గం చిక్కుతుంది.

రహస్యాలకు ఆమె ఓ రక్షణకవచం. ఏ విషయానికీ జడ్జిచేసి నొప్పించని పెద్దరికం, మమకారం ఆమె స్వంతం. ఇన్ని సుగుణాలు గల అక్కయ్య తోడుగా ఉన్నప్పుడు జీవితంలో అన్నీ ఉన్నట్లే కదా!

# 60% క్యాన్సర్స్ 65 ఏళ్ళు పైబడిన వారికి వస్తున్నాయి.

## NCI తాజా సర్వేలో వెల్లడి

జీవం ఉండే ప్రతి కణం క్యాన్సర్ బారిన పడే ప్రమాదం ఉంటుంది. అందుకే మొక్కలతో సహా ఈ సృష్టిలో జీవరాశి అంతా ఈ ప్రాణాంతక వ్యాధి బారినపడ్తూ ఉంటాయి. మన శరీరంలో కణాలు పరిపక్వ స్థితికి రాగానే ఒకటికి ఎన్నోకణాలుగా విభజన చెందుతూ ఎప్పటికప్పుడు కొత్త కణాలు ఏర్పడుతూ ఉంటాయి. వయస్సు పైబడే కొద్ది ప్రతి కణానికి కాలం చెల్లి సమయం దగ్గర పడ్తూ ఉంటుంది. చిన్న వయస్సులో శరీర కణాలు వేగంగా వృద్ధి చెందుతూ ఉంటాయి కాబట్టి ఎదుగుదల సాధ్యం అవుతుంది. పెద్దవారు అయ్యేకొద్ది కణాలు విభజన చెందటం వృద్ధి చెందటం నిదానము అయి శరీరం ఎదుగుదలఆగిపోతుంది. పాతగా అయిపోయిన కణాలను భర్తి చేయటానికి మాత్రమే కొత్త కణాలపుట్టుక వయస్సు పైబడిన వారిలో జరుగుతూ ఉంటుంది. అయితే సహజ సిద్ధంగా క్రమబద్ధంగా జరిగే ఈ ప్రక్రియలో ఎక్కడో తేడా వచ్చి, పాత బడిన కణాలు మృతి చెందకుండానే అనేక కొత్త కణాలు పుట్టుకొని రావటంవలన, వచ్చిన శరీర భాగాలలో కణితులు ఏర్పడుతూ ఉంటాయి. ఆ భాగానికి పరిమితం అయి ఉండే ప్రమాదకరం కాని కణితులు కొన్ని అయితే, ఇతర భాగాలకు, చుట్టు ప్రక్కల కణజాలానికి రక్తం ద్వారా లింఫ్‌నాళాలద్వారా వ్యాప్తి చెందే ప్రమాదకర కణితులు క్యాన్సర్ కణితులు. వయస్సు పైబడే కొద్ది పెరిగే క్యాన్సర్ కణితులుకు మన సామాజిక పరిసరాలకు సంబంధించి, అనేక కారణాలు, దురలవాట్లు, వాతావరణం, వృత్తి వరమైన కారణాలు, కాలుష్యం, జీవనశైలి, హార్మోన్ల వాడకం, కుటుంబ చరిత్ర, కొన్ని రకాలవైరస్‌లు, బ్యాక్టరియా, ఎరువులు, రేడియేషన్ ఇలా ఎన్నో కారకాలు దోహదపడ్తాయని చెప్పుకొవచ్చు.

నేషనల్ క్యాన్సర్ ఇన్స్టిట్యూట్ (NCI) సర్వే ప్రకారం కొత్తగా కనుగొనే క్యాన్సర్స్‌లో 60 శాతం వరకు 65 ఎళ్లు పై బడిన వారిలో కన్పించటమేకాక వీరిలో 70% వరకు మరణానికి గురవుతూ ఉంటారు. చిన్న వయస్సులో ఉండే వారితో పోల్చుకుంటే 65 ఎళ్లు పైబడిన వారు క్యాన్సర్‌కు గురయ్యే ప్రమాదం 10 రెట్లకు పైగా ఉంటోంది. వయస్సు పైబడిన వారిలో అన్నిరకాలక్యాన్సర్స్ వచ్చే ప్రమాదం ఎక్కువే. మరీముఖ్యంగా కోలన్, రెక్టల్, ప్రోస్టేట్, ప్యాంక్రియాస్, ఊపిరి తిత్తులు, మూత్రాశయం, పెద్ద పేగులు, రొమ్ము క్యాన్సర్‌లు వయస్సు పైబడే కొద్ది వచ్చే ప్రమాదం ఎక్కువవుతూ ఉంటుంది. అంతే గాక వీరిలో ఈ కణితులు ట్రీట్‌మెంట్స్‌కు లొంగకుండా ఉండే అవకాశం కూడా ఉండవచ్చు. అధికరక్తపోటు, మధుమేహం, కీళ్ల అరుగుదల, థైరాయిడ్ సమస్యలు, గుండె రక్తనాళాలలో పూడికలు, వంటి సమస్యలు వయస్సుతో పాటు పెరిగి వేధిస్తూ ఉంటాయి కాబట్టి వీరికి క్యాన్సర్ ట్రీట్‌మెంట్స్ కూడా చాలా జాగ్రత్తగా అలోచించి పర్సనలైజ్‌డ్‌గా ఇవ్వవలసి ఉంటుంది. వారి శరీర ఆరోగ్య పరిస్థితులనే కాక వారి మానసిక, సామాజిక, కుటుంబ, ఆర్థిక పరిస్థితులను గురించి కూడా ఆలోచించి క్యాన్సర్ బారిన పడిన వారికి ధైర్యం చెప్తూ ట్రీట్‌మెంట్స్ ఇవ్వాల్సి ఉంటుంది. అందుకే వీరికి ట్రీట్‌మెంట్స్‌లో భాగంగా కౌన్సిలింగ్ ప్రాముఖ్యత కూడా ఎక్కువగా ఉంటోంది.

వయస్సు పైబడే కొద్ది క్యాన్సర్‌కు గురికాక తప్పదా? అన్న దిశలో శాస్త్రవేత్తలు అనేక రకాలుగా పరిశోధనలు చేశారు. వయస్సుకు క్యాన్సర్‌కు సంబంధం ఎక్కువ అవటానికి అనేక కారకాలు దోహదం చేస్తూ ఉన్నాయని పరిశోధనలు నిరూపించాయి. వాటిలో ఈ క్రింది వాటిని కొన్ని కారణాలుగా పేర్కొన్నారు.

1. చిన్నప్పుడు దీర్ఘకాలికంగా ఉన్న స్మోకింగ్, అల్కహాల్, అనేక మందితో శారీరక సంబంధాలు వంటి దురలవాట్లు.
2. వయస్సు పైబడే కొద్ది రోగనిరోధక శక్తి తగ్గటం
3. కొన్ని రకాలహార్మోన్స్ ఎక్కువగా తీసుకోవటం
4. కణాలలో మార్పులు నెమ్మదిగా జరిగి వయస్సు పైబడ్డాక బయట పడటం
5. వృత్తిపరంగా కొన్నిరకాలరసాయనాలకు ఎక్కువగా గురవటం
6. వేరే వ్యాధులు వాటికి తీసుకునే ట్రీట్‌మెంట్స్

చిన్నవయస్సులో, మధ్య వయస్సులో ఉండే అలవాట్ల వలన కణజాలాలలో నెమ్మదిగా జరిగే మార్పులు వయస్సు పైబడ్డాక బయటపడ్తూ ఉంటాయి. వెర్నర్ సింగ్రామ్ (Werner Syndrome), ఆల్జిమర్స్ (Alzheimer's), ఎయిడ్స్ మొదలగు వ్యాధులు ఉన్నవారికీ క్యాన్సర్ వచ్చేరిస్క్ పెరుగుతుంది. శరీరంలో హార్మోన్ లెవల్స్ ఎక్కువగా ఉన్న పెద్దవారిలో కొన్ని రకాలక్యాన్సర్స్ ఎక్కువ. ఉదాహరణకు ఈస్ట్రోజన్ లెవల్స్ దీర్ఘకాలికంగా ఎక్కువగా ఉన్న స్త్రీలలో రొమ్ము, ఎండోమెట్రియల్, అండాశయలక్యాన్సర్స్ అధికం. 60 ఎళ్లు పైబడ్డాక కూడా స్త్రీలలో నెలసర్లు ఆగలేదంటే కొంచెం అనుమానించాలిసిందే. 9 ఏళ్లకే నెలసర్లు, లేటుగా మ్యారేజ్, ప్రెగ్నెన్సి ప్లాన్‌చేసుకొవటం కూడా రొమ్ము క్యాన్సర్ వచ్చే రిస్క్‌ను పెంచే అవకాశం ఉంది.

పురుషులలో టెస్టోస్టిరాన్ హార్మోన్స్ లెవల్స్ ప్రోస్టేట్ క్యాన్సర్‌కు దారితీసే అవకాశం ఉంటుంది


Dr. Ch. Mohana Vamsy
Chief Surgical Oncologist
Omega Hospitals, Hyderabad.
Ph : 98480 11421
Kurnool : 08518 273001


అందుకే ఇటువంటి హార్మోన్లకు సంబంధించిన క్యాన్సర్స్‌కు ట్రీట్‌మెంట్స్‌లో సర్జరి, రేడియేషన్, కీమోలతో పాటు హార్మోన్ థెరఫి ప్రాముఖ్యత కూడా ఉంటుంది.

యుక్త వయస్సులో, తెలిసి తెలియని వయస్సులో సరాదాలకు, స్నేహితులకు అగ్రపీఠం వేస్తూ చేసుకున్న అలవాట్లు వలన వాటికి దూరం అయినా నిబ్బరంగా ఉండటానికి అవకాశం లేదు. స్మోకింగ్, ఆల్కహాల్ అనేక మందితో శారీరక సంబంధాలు, లంగ్, లివర్, సర్వైకల్ క్యాన్సర్స్‌నే కాక ఇంకా ఏ భాగానికైన క్యాన్సర్స్‌ను కలిగించే అవకాశం ఉంటుంది. ఈ కణితులకు ఖచ్చితమైన కారణాలు తెలియవు అనేక ఇతర కారణాలు జన్యుపరమైనవి కారకాలు ఉండవచ్చు. అయితే దురలవాట్లకు, కెమికల్స్‌కు గురయ్యే వారిలో సాధారణ ప్రజానికం కంటె క్యాన్సర్స్ వచ్చే రిస్క్ ఎక్కువ. అలవాట్లకు అతీతంగా వయస్సు పైబడిన వారందరూ స్క్రీనింగ్ టెస్ట్‌లు చేయించుకుంటూ ఉంటే మంచిది. స్త్రీలు గర్భాశయ ముఖద్వార క్యాన్సర్‌ను ముందే పసిగట్టటానికి 35ఎళ్లు పైబడిన దగ్గర నుండి పాప్‌స్మియర్స్, రొమ్ము క్యాన్సర్‌ను తెలుసుకోవటానికి 40 ఏళ్లు పైబడిన వారు మామోగ్రామ్స్, సెల్ఫ్ ఎక్జామినేషన్ అలాగే పురుషులో 50 ఏళ్లు పైబడ్డాక ప్రోస్టేట్ క్యాన్సర్‌ను తెలిపే PSA టెస్ట్, హెపటైటిస్ -B పాజిటివ్‌గా ఉన్న వారు లివర్, స్మోకింగ్ ఆల్కహాల్ అలవాట్లు ఉన్నవారు లంగ్స్, లివర్ పరీక్షలు చేయించుకుంటూ ఉంటే మార్పులను ముందే పసిగట్టవచ్చు.

చిన్న వయస్సు నుండే మంచి ఆహార, వ్యవహార జీవనశైలితో పాటు శరీరంలో మార్పులను ముందే పసిగట్టే స్క్రీనింగ్ టెస్ట్‌లు, తొలిదశలోనే చికిత్సలతో క్యాన్సర్స్‌కు చెక్ పెట్టవచ్చు అని అందరూ అవగాహన పెంపొందించుకోవటం తప్పనిసరి.

(సశేషం)

# రిజర్వేషన్ రాజకీయం

ఎన్నికల వేళ ఎడాపెడా వాగ్దానాలు చెయ్యటం ప్రతి రాజకీయ పార్టీకి, నాయకులకు అలవాటు. ప్రజల జ్ఞాపకశక్తిమీద వారికి అపార నమ్మకం.

వారికి ఎలాగూ గుర్తుండదు, మళ్ళీ అయిదేళ్ళ తరువాత కదా అప్పుడు చూసుకుందామనే ధీమా వారిది. స్వాతంత్ర్యం వచ్చినతర్వాత కాంగ్రెస్‌పార్టీ హవా సాగుతున్నంత కాలం వాగ్దానాలకు, అమలుకు సంబంధం లేకుండా సాగిపోయింది. అందుకే ఆ పార్టీ సోషలిజం సాధిస్తామని వాగ్దానం చేసి ఆ తర్వాత దానిగురించి పూర్తిగా మరిచిపోయింది.

'గరీబీ హటావో' అనే నినాదం ఇచ్చి ఆ తరువాత పేదల సంఖ్యను పెంచేలా విధానాలు అమలుచేసినా చెల్లిపోయింది. అయితే ఎల్లకాలం ఒకేలా వుండదు. చదువులు పెరుగుతాయి.

రాజకీయ చైతన్యం అధికమవుతుంది. ఇతర రాజకీయ పార్టీలు వచ్చి కాంగ్రెస్‌కి సవాలు విసిరాయి. ఇప్పుడు దేశంలో అనేక పార్టీలు.

ఒక్కొక్కచోట ఒక పార్టీ అధికార పార్టీ. కాబట్టి ఎన్నికల వాగ్దానాలను ఆచితూచి చెయ్యకపోయినా, చేసిన వాగ్దానం నిలబెట్టుకునే ప్రయత్నం కనిపించకపోయినా ప్రజలు వెంటనే ప్రత్యామ్నాయ పార్టీని వెతుక్కుంటున్నారు.

ఆ విషయం కేంద్రంలో అధికారంలో వున్నమోడీకి, తెలుగు రాష్ట్రాలను పాలిస్తున్న చంద్రబాబునాయుడు, కె.సి.ఆర్‌కి బాగా తెలిసివస్తున్నది. 2014 వేళ ఎడాపెడా చేసిన వాగ్దానాల సంగతి ఏమిటని, గుజరాత్‌లో 'అచ్చేదిన్' కనిపించటంలేదని ఓటర్లు అంటుంటే నరేంద్రమోడీ నోరెళ్ళపెట్టాల్సివస్తోంది.

అదేవిధంగా నిరుద్యోగమే లేని బంగారు తెలంగాణ సృష్టిస్తామన్న కె.సి.ఆర్.ని 'కొలువుల కొట్లాట' అంటూ విద్యార్థులు నిలదీస్తున్నారు.

ఇంటింటికీ పంపు, ఇళ్ళు, భూమి పంపిణీ... ఇలా ఏ ఒక్క హామీ అమలుచెయ్యని కె.సి.ఆర్.మీద ప్రజల ఆగ్రహం మరింత పెరుగుతున్నది.

ఇక ముస్లిమ్‌లకు పన్నెండుశాతం రిజర్వేషన్లు, గిరిజనులకు రిజర్వేషన్ల శాతం పెంపుదల వంటివి, తమ పరిధిలో లేనివాటిని వాగ్దానములుగా గుప్పించి అధికారం చేపట్టినతర్వాత ఆ యా వర్గాలు మాకిచ్చిన హామీలు అమలు ఎప్పుడని అడుగుతున్నారు.

ఆ వేడినుండి తప్పించుకునేందుకు అమెరికా అధ్యక్షుడి కూతురు ఇవాంకాని హైదరాబాద్ తెప్పించిన ఘనత మాదే అంటూ హడావుడి చేస్తున్నారు.

అంతేకాదు, ప్రజల దృష్టిని ఇప్పుడు తెలుగు మహాసభల సందడివైపుకు మళ్ళిస్తున్నారు.

ఇక చంద్రబాబునాయుడు 2014 ఎన్నికల్లో ఎవరూ అడగకుండానే కాపులకు బి.సి. హోదా వాగ్దానం చేశాడు. ఆ రోజు గెలుపు అత్యవసరం.

చేస్తున్న వాగ్దానం సమంజసమయినదా! అది అమలుచెయ్యగలనా! లేదా! అనే ఆలోచన చెయ్యలేదు. కాంగ్రెస్ హయాంలో అయితే ఇటువంటి వాగ్దానాలు ఎన్ని చేసినా ఇట్టే మరుగునపడిపోయేవి. కాని ఇప్పుడు పరిస్థితులు మారాయి.

మీడియా దృష్టి తీవ్రమైంది. ఏ అంశం మరుగున పడిపోకుండా దానిని బయటకు తెచ్చే వర్గాలు వున్నాయి. కాపులకు రిజర్వేషన్ అంశానికి కట్టుబడి వున్నామని పదేపదే చెప్పిన తెలుగుదేశం ప్రభుత్వం రిజర్వేషన్లు ఇవ్వటానికి ఒక పద్ధతి వుంటుందని, దానిప్రకారం ఒక కమిషన్‌ని ఏర్పాటుచేస్తామని-

ఆ కమిషన్ నివేదిక ఆధారంగానే కాపులకు రిజర్వేషన్స్ అమలుచేస్తామని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు పలుమార్లు వివరించారు.

తదనుగుణంగానే మంజునాథ కమిషన్‌ని నియమించారు. ఆ కమిషన్ అన్ని జిల్లాల్లో పర్యటించింది, అన్ని వర్గాలనుండి విజ్ఞాపనలు స్వీకరించింది.

ఆశ్చర్యం ఏమిటంటే ఆంధ్రప్రదేశ్‌లోని సామాజిక వర్గాలలో ఒకే ఒక్క వర్గం తప్పించి మిగిలిన అన్ని సామాజిక వర్గాలు తమకు వెనకబడిన కుల హోదా కావాలని మంజునాథ కమిటీకి విజ్ఞప్తి చెయ్యటం. అన్ని సామాజిక వర్గాలు వెనకబడివున్నాయని అంటున్న వేళ కేవలం కాపు సామాజిక వర్గాన్నిమాత్రమే వెనకబడిన వర్గంగా చేర్చటం ఎలా అన్న ప్రశ్న మంజునాథ కమిషన్ ముందు నిలిచింది.

దేశంలో వెనకబడిన కులాల జాబితాలో చేరాలన్న తహతహ అత్యంత వేగంగా పెరుగుతున్నది. పైగా వెనకబడిన ముద్ర వేయించుకోవాలనుకుంటున్న వర్గాలలో సామాజికంగా, ఆర్థికంగా, రాజకీయంగా ముందున్న వర్గాలు కావటం ఆశ్చర్యం కలిగించే విషయం. ఇదేదో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి మాత్రమే పరిమితమయినది కాదు.

దేశవ్యాప్తంగా వెనకబాటు రిజర్వేషన్ ఒక రాజకీయ అస్త్రంగా మారింది. ప్రస్తుతం ఎన్నికలు జరుగుతున్న గుజరాత్‌లో పటేల్ వర్గంవారు వెనకబడిన జాబితాలో చేర్చమని ఆందోళన చేస్తున్నారు.

ఆ రాష్ట్ర జనాభాలో వారు పధ్నాలుగు శాతం ఉన్నారు. వ్యవసాయం, వ్యాపారం, రాజకీయాలు అన్నింటిలో వారిదే పైచేయి. సామాజిక హోదాలో కూడా వారిది తిరుగులేని స్థానం.

అటువంటి పటేల్ వర్గానికి రిజర్వేషన్స్ ఇవ్వటం సాధ్యంకాదని అందరికీ తెలుసు.

ఆ వర్గానికి బి.సి. హోదా ఇవ్వటమంటే నిజమైన బి.సి.లకు అన్యాయం చెయ్యటమే. అయినా ఎన్నికల్లో గెలుపుకోసం పటేల్ వర్గానికి రిజర్వేషన్ కల్పిస్తామన్న వాగ్దానం కాంగ్రెస్ పార్టీ చేసింది.

ఇది ఆంధ్రప్రదేశ్‌రాష్ట్రంలో చంద్రబాబునాయుడు చేసినటువంటి వాగ్దానమే. ఇటువంటి సామాజిక వర్గాలు అయిన జాట్‌లు, గుజ్జర్‌లు ఉత్తరప్రదేశ్‌లో, రాజస్థాన్‌లోనూ రిజర్వేషన్‌లకోసం ఆందోళన చేస్తున్నాయి. అయితే వారి డిమాండ్స్‌ని అంగీకరించలేని పరిస్థితి ప్రస్తుతం అధికారంలో వున్నవారిది.

వచ్చే ఎన్నికల్లో మా పార్టీని గెలిపిస్తే మేం మీకు బి.సి. హోదా ఇస్తామంటున్నది ఆ యా రాష్ట్రాలలో కాంగ్రెస్. సాధ్యాసాధ్యాల విషయము గురించి పక్కనపెట్టి వాగ్దానం చెయ్యటంద్వారా ప్రజలలో ఎన్నడూ లేని అనవసరపు ఆశలు రెచ్చగొడుతున్నారు.

రాష్ట్రాల్లో రాజకీయ గెలుపుకోసం



ఇక్కడున్న మనవారికన్నా విదేశాలలో వున్న తెలుగువారికి భాషపై పట్టు, సంస్కృతిపై మక్కువ ఎక్కువగా వున్నాయి.
-చంద్రబాబునాయుడు, ఎ.పి. సి.ఎమ్.

కొత్తగా కొన్ని వర్గాలకు రిజర్వేషన్లు కల్పించే తీర్మానం చేసి కేంద్రానికి పంపటంద్వారా తమ బరువును దింపుకుంటున్నాయి ప్రాంతీయ పార్టీలు.

తెలంగాణలో ముస్లిమ్‌లకు పన్నెండు శాతం, ఆంధ్రాలో కాపులకు ఐదుశాతం రిజర్వేషన్ కల్పించే తీర్మానం కేంద్రానికి చేరాయి.

గుజరాత్‌లో పటేల్ వర్గపు డిమాండ్‌ని తట్టుకోలేని బి.జె.పి.మీద ఒత్తిడి తేవటంకోసమే చంద్రబాబు కాపు రిజర్వేషన్ తీర్మానం చేసివుండవచ్చు. అందువల్ల సుప్రీమ్‌కోర్టు తీర్పును కాదని 50 శాతంమించి రిజర్వేషన్ల అమలుసాధ్యంకాదని,అటువంటి వాగ్దానం ఎవరు చేసినా అది ప్రజలను మోసం చెయ్యటమే నని ప్రధాని నరేంద్రమోడీ స్పష్టంచేశాడు.

తెలుగు రాష్ట్రాల ముఖ్యమంత్రులు ఇద్దరికీ తెలుసు తాము ప్రతిపాదించిన రిజర్వేషన్ల అమలు సాధ్యంకాదని. మతపరమైన రిజర్వేషన్లు కుదరవంటుంది రాజ్యాంగం. ఆ విషయాన్ని న్యాయస్థానాలు ధృవీకరించాయి. అయినా పన్నెండు శాతం రిజర్వేషన్‌లు ముస్లిమ్‌లకు కల్పించాలన్న తీర్మానం రాజకీయంలో ఒక భాగమే.

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో నాలుగుశాతం రిజర్వేషన్లను ముస్లిమ్‌లకు కేటాయించినప్పుడు అది ముస్లిమ్‌లలో వున్న కొన్ని ప్రత్యేక కులాలకోసమేనని, అదికూడావిద్యా రంగానికి మాత్రమే వర్తిస్తుందని, ఉద్యోగాలకు వర్తించదని ప్రభుత్వం ఉత్తర్వుల్లో పేర్కొన్నది. ఆ నాలుగు శాతం రిజర్వేషన్ అంశంమీదే న్యాయస్థానంలో చిక్కులు ఎదురయ్యాయి. అటువంటిది ఏకంగా పన్నెండు శాతం ముస్లిమ్ రిజర్వేషన్ అనేది కె.సి.ఆర్.

తన పార్టీ రాజకీయ పునాది పటిష్టతకోసం చేస్తున్నదేకాని రాజ్యాంగబద్ధమైన తీర్మానం కాదు. ఆంధ్రప్రదేశ్‌లో కాపులకు 5 శాతం రిజర్వేషన్ కల్పించేందుకు చేసిన నిర్ణయంలోనూ రాజకీయ డ్రామా వుంది.

కాపు రిజర్వేషన్‌లకోసం నియమించిన కమిటీ ఛైర్మన్ మంజునాథకి సంబంధం లేకుండా, మిగిలిన సభ్యులనుండి హడావుడిగా ఒక నివేదిక తీసుకుని, మంత్రిమండలి ఆమోదం, అసెంబ్లీ తీర్మానం అంతే వేగంగా పూర్తిచేసి కేంద్రానికి పంపించి చేతులు దులుపుకున్నాడు చంద్రబాబునాయుడు.

ఏదైనా ఒక కమిటీని నియమించినప్పుడు ఆ కమిటీ ఏకగ్రీవంగా నివేదిక ఇవ్వవచ్చు లేదా నివేదికలోని అంశాలతో విభేదించినప్పుడు తన అసమ్మతిని తెలియజేస్తూ వేరొక నివేదిక ఇవ్వవచ్చు.

కాని అసలు ఛైర్మన్ అభిప్రాయం, సంతకం లేకుండా విడిగా సభ్యులు నివేదికను ఇవ్వటం చట్టసమ్మతమా! కాదా! అనేది ప్రశ్న.

ఛైర్మన్ మంజునాథ తన నివేదిక ఇవ్వకముందే మంత్రిమండలి, అసెంబ్లీ తీర్మానాలతంతు పూర్తి చెయ్యటం వెనకున్నది రాజకీయమే.

కాపులకు రిజర్వేషన్లు ప్రతిపాదించటంతో ఆంధ్రప్రదేశ్‌లో రిజర్వేషన్లు 55 శాతానికి చేరతాయి. ఇది సుప్రీమ్‌కోర్టు ప్రకారం అంగీకారం కాదు.

న్యాయవ్యవస్థ పర్యవేక్షణకు ఆవలగా వుండే తొమ్మిదవ షెడ్యూల్ జాబితాలో ఈ రిజర్వేషన్లుచేర్చాలని చంద్రబాబు, కె.సి.ఆర్. కోరుతున్నారు.

ఇప్పటికే తమిళనాడులో 68 శాతం రిజర్వేషన్లు అమలవుతున్న విషయం ప్రస్తావిస్తున్నారు. ఆ రిజర్వేషన్లను తొమ్మిదవ షెడ్యూల్‌లో చేర్చటాన్ని మరోమారు సవాలు చెయ్యాల్సిన అవసరం వుంది.

తమిళనాడుకు మాత్రం ప్రత్యేక రిజర్వేషన్‌ల శాతాన్ని వ్యతిరేకించే పిటీషన్ ఎవరు వేసినా దానిమీద సుప్రీమ్‌కోర్టు స్పందించక తప్పదు. ఆ స్పందన తమిళనాడులోని 68 శాతాన్ని కొట్టివేయటమే అవుతుంది. దేశవ్యాప్తంగా యాభై శాతానికి మించని రిజర్వేషన్ మాత్రమే అమలు అవ్వాలి.

రాజకీయ పార్టీలు వారిగెలుపుకోసం, కొన్నిసామాజిక వర్గాల మద్దతుకోసం చేసే రిజర్వేషన్ వాగ్దానాలు రాజ్యాంగాన్ని, న్యాయస్థానాలను ధిక్కరించటమేకాక సామాజిక ఘర్షణలకు దారితీస్తాయి.

- రాజకీయ లబ్ధికి రిజర్వేషన్ ఉద్యమాలు
- తెలంగాణలో 12 శాతం ముస్లిమ్ రిజర్వేషన్
- 5 శాతం కాపు రిజర్వేషన్ ఆంధ్రాలో
- ఉత్తరాదిన పటేల్, జాట్, గుజ్జర్‌ల కోటా ఉద్యమాలు

కాపులకు కల్పించిన రిజర్వేషన్లపై బి.సి. వర్గాలు ఆంధ్రప్రదేశ్‌లో ఆందోళన చేస్తుండగా, ముస్లిమ్‌లకు తెలంగాణలో కల్పించిన రిజర్వేషన్లపై హైందవ సంఘాలు అలజడిలో వున్నాయి.

సమాజంలో అంతర్గత ఘర్షణవలన విభేదాలు పెరిగి, జాతి బలహీనపడుతుంది. నిజానికి నేడు జరగాల్సినది రిజర్వేషన్లపై సమీక్ష.

నేటివరకు అనుసరించిన రిజర్వేషన్‌లవల్ల లబ్ధి పొందిన వర్గాలను గుర్తించి వారికి రిజర్వేషన్‌లు తొలగించి, ఆ వర్గాలలోనే బాగా వెనకపడిన వర్గాల వారికి రిజర్వేషన్లు ఇవ్వటం జరగాలి. రిజర్వేషన్లను తొలిగా అందుకున్న వర్గాలే ఆ లబ్ధిని తరతరాలుగా అనుభవిస్తుండటంవల్లనే ఎస్.సి. వర్గీకరణ డిమాండ్ తెరమీదికి వచ్చింది.

ప్రస్తుతం అమలవుతున్న రిజర్వేషన్ల విధానంపై సమాజం సమీక్ష కోరుతున్న సమయంలో, కొత్త వర్గాలు రిజర్వేషన్‌లను డిమాండ్ చెయ్యటం, రాజకీయ లబ్ధికి వారికి రిజర్వేషన్లు ఇస్తామనటం ఒక పెద్ద పొరపాటు చర్యగా భావించాలి.

దేశవ్యాప్తంగా బలమైన వర్గాలు రిజర్వేషన్లు కావాలన్న డిమాండ్‌ని కోరటం వెనకవున్న రాజకీయాన్ని ప్రజలు అర్థంచేసుకోవాలి. రిజర్వేషన్ రాజకీయాలను ఆదిలోనే తుంచకపోతే, స్వార్థంకోసం పెంచి పోషిస్తే ఆ ఉద్యమాల సెగకు పార్టీలు, నేతలు బలి కాక తప్పదు. ప్రపంచంలోని పలు దేశాలలో ఏదో ఒక రకమైన సామాజిక విభజనలు ఉన్నాయి.

అయినా ఏ దేశంలో కూడా ఇటువంటి రిజర్వేషన్ ఉద్యమాలు లేవు. ఇప్పుడు వున్న సమాజం ప్రగతివైపు వెళ్ళాలేకాని, వెనకబాటుతనపు ముద్ర వేసుకునేందుకు ఉత్సాహం చూపకూడదు.

2022 నాటికి అభివృద్ధి చెందిన దేశంగా అనిపించుకోవాలని, అగ్రరాజ్యాల సరసన భారతదేశం నిలబడాలన్నది నాటి రాష్ట్రపతి అబ్దుల్ కలామ్ భారతదేశం ముందుంచిన లక్ష్యం.

ఆ గడువుకు చేరటానికి ఇక మిగిలింది ఐదేళ్ళే. కాని ఈ సమయంలో దేశంలోని 60 నుండి 75 మంది శాతాన్ని తమకు వెనకబడిన ముద్ర కావాలని కోరుకోవటం ఆ లక్ష్యాన్ని వెక్కిరిస్తోంది.

దేశం ముందుకు నడవాలని, కులమతాలకు అతీతంగా ప్రగతి సాధించాలని మేధావి వర్గాలు కోరుతుంటే ప్రజలను వెనకబాటుతనం వదిలిరావద్దని రాజకీయనాయకులు అంటున్నారు.

ప్రతిరోజూ ఒక కొత్త సామాజిక వర్గపు ఊరేగింపులు జరుగుతున్నాయి. తమనురిజర్వేషన్ల వర్గాలలో భాగం చెయ్యమన్నది వారి డిమాండ్. సమాజం అగ్రవర్ణాలు అని అనుకునేవారుకూడా వెనకబడిన ముద్రకోసం డిమాండ్ చేస్తుంటే గత డెబ్బైఏళ్ళలో దేశం సాధించిన ప్రగతి ఏమిటి!

ఆ ప్రగతి ఫలాలు ఏ వర్గానికి చేరాయి! ఏ ఒక్కవర్గం అభివృద్ధి చెంది, పైకి ఎదిగామని చెప్పుకోలేకపోతున్నప్పుడు నేటివరకు అమలయిన పంచవర్ష ప్రణాళిక, అమలుచేసిన అభివృద్ధి ప్రణాళికలకు అర్థం ఏమిటి? స్వాతంత్ర్యం వచ్చిన నాటికీ, నేటికీ అభివృద్ధి జరిగింది.

విద్యా,వైద్య సౌకర్యాలు మెరుగయ్యాయి. అన్ని సామాజిక వర్గాలకు చెందినవారు తమ ప్రతిభకు తగినట్టుగా వివిధ రంగాల్లో ఎదిగారు. ఉన్నత స్థానాల్లో వున్నారు. ఐనా తమ వెనకబాటు ముద్రను వదులుకోవటానికి వారు సిద్ధంకారు.

తమ రిజర్వేషన్ సౌకర్యం తమకే కావాలన్న స్వార్థంతో వున్నారు. దాని ఫలితమే నేడు నడుస్తున్న రిజర్వేషన్ రాజకీయాలు. ఆర్థిక సంస్కరణల అమలుతో ప్రభుత్వ ఉద్యోగాలకన్నా మెరుగైన ప్రైవేట్ రంగ ఉద్యోగాలు అందుబాటులోకి వచ్చాయి.

ప్రతిభకు పట్టంకట్టే విధానం అమలవుతోంది. ఆ సమయంలో రిజర్వేషన్ల అవసరమే లేదు. కాని రాజకీయం దిగజారి ప్రైవేట్ రంగంలోనూ రిజర్వేషన్లు కావాలన్న డిమాండ్ వస్తున్నది. ఇది మరింత ప్రమాదకర డిమాండ్. అయినా రాజకీయ లబ్ధిముందు సమాజహితం మరుగునపడుతున్నది. ఈ ప్రమాదం గుర్తించాల్సింది భారతీయ యువతే.

**డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు**

# స్టార్ హంట్

పి.వి.డి.ఎస్.ప్రకాష్

"లకుమాదేవి... వెరీ నైస్. పోయెటిక్‌గా ఉంది" అన్నాడు శశాంక.

"మా ఫాదర్‌కి లిటరేచర్ అంటే ఎంతో ఇష్టం. అందుకే, ఈ పేరు ఏరికోరి మరీ పెట్టారు. కర్పూర వసంతరాయల ప్రేయసి... లకుమాదేవి" చెప్పింది లకుమాదేవి. తన పేరు చెప్పీచెప్పగానే కొత్తవారెవరైనా ఇట్టే ఇంప్రెస్సైపోతారు. అదీ... ఆ పేరు గొప్పతనం. ఆమెలో ఎప్పట్లాగే కించిత్ గర్వం.

వారంరోజుల క్రితం ఓరోజు ఓ డైలీలో-

"పదహారణాల తెలుగమ్మాయిలకు స్వాగతం, సుస్వాగతం. పడమటిగాలి సోకిన తెలుగు సినిమా ప్రపంచంలో మనం మరిచిపోతున్న తెలుగు సంస్కృతీ సంప్రదాయాలకు పట్టంకడుతూ యువ డైరెక్టర్ శశాంక తీయబోయే తదుపరి చిత్రానికి అచ్చ తెలుగమ్మాయికిదే ఆహ్వానం.

మేం వెతుకుతున్న ఆ నాయిక మీరే ఎందుకు కాకూడదూ? తెలుగుదనం ఉట్టిపడే యువతుల కోసమే మా ఈ అన్వేషణ... సంప్రదించాల్సిన చిరునామా" యాడ్ పబ్లిషయింది.

ఆ యాడ్‌కి లకుమకూడా స్పందించి అప్లికేషన్‌తో పాటు ఫోటోల్ని కూడా పంపించింది. ఫలితంగా ఈ రోజు ఈ 'స్టార్‌హంట్'కి అటెండై డైరెక్టర్ శశాంక ముందు కూచుని ఆయన అడుగుతున్న ఒక్కో ప్రశ్నకు తనదైన శైలిలో సమాధానమిస్తోంది.

కొద్దిక్షణాల నిశ్శబ్దం తర్వాత "మీరు ఇక్కడివారు కాదా?" శశాంక ప్రశ్నతో లకుమ ఒక్కసారి ఉలిక్కిపడి తననితాను పరిశీలనగా చూసుకుంది.

కంప్లీట్ వెస్ట్రన్ స్టయిల్ అవుట్‌ఫిట్. శరీరంలో ఏ వంపులెక్కడున్నాయో స్పష్టంచేసే స్కిన్‌టైట్ బ్లూ జీన్స్. ఎత్తయిన గుండెల్ని బిగుతుగా హత్తుకున్న నైట్‌టాప్‌పై ఎదురుపడేవారి కళ్ళు చేదిరేలా ఎర్రెర్రని అక్షరాల్లో 'ప్లీజ్! లవ్ మీ!!' అనే క్యాప్షన్.

"పక్కాలోకల్. హైదరాబాదీ. అచ్చతెలుగు వాళ్ళం" చెప్పింది లకుమ.



**అతడిని తనపైకి తీసుకుని సొగసు సోయగాల్ని రెడ్‌కార్పెట్‌లా పరిచింది. అప్పటివరకూ కిటికీలోంచి వెన్నెల చల్లదనాన్ని వారిద్దరిపై అభిషేకిస్తున్న చంద్రుడు ఒక్కసారిగా నివ్వెరపోయాడు. ఆ ఆశ్చర్యానికి కారణం. వారిద్దరూ కలిసి కనిపించడమే? ఇంతలో...**

"మా యాడ్‌సరిగ్గా మీరు చూడలేదనుకుంటాను?" తిరిగి ప్రశ్నించాడు శశాంక.

అంటే... ఆహార్యంలో, అలంకరణలో అత్యాధునికంగా ఉన్న తనలో శశాంక కోరుకునే తెలుగుతనం కనిపించడంలేదేమో?

అసలు తెలుగుతనం అంటే ఏంటీ? కట్టు,బొట్టులో సంప్రదాయం కనిపించడమేనా?' వరుస సందేహాలు మెదడును దొలిచేస్తుంటే... అంత ఏసీలోనూ ఒక్కసారిగా ఆమెకు చెమటలు పట్టాయి.

"కెమెరా ఫేస్ చేసిన ఎక్స్‌పీరియన్స్ ఉందనుకుంటాను" అడిగాడు శశాంక. 'మోడల్‌గా కొన్ని యాడ్ ఫిలిమ్స్ చేశా" చెప్పింది లకుమ.

ఆ తర్వాత అతడేం మాట్లాడలేదు.

"ఓకే బెస్టాఫ్ లక్" అని మాత్రం అన్నాడతడు.

"మనం మళ్ళీ కలుస్తామా?" చైర్లోంచి లేస్తూ ఉండబట్టలేక అడిగింది లకుమ.

"ఈ ప్రపంచం చాలా చిన్నది లకుమ గారూ! నే వెతుకుతున్న కథానాయిక మీరే అయితే మళ్ళీ కలవొచ్చు" అన్నాడు శశాంక నవ్వుతూ.

"శశాంక మళ్ళీ స్టార్‌హంట్ నిర్వహిస్తున్నాడే. ఈసారి విజయవాడలో. మళ్ళీ ఇంకోసారి హాజరైతే సరి" నేస్తం వైశాలి చెప్పింది లకుమకు.

ఇద్దరూ ఒకే కాలేజీలో డిగ్రీ చేశారు. ఆ ఏడాదే వైశాలికి పెళ్ళయింది. ఈ మధ్యే పుట్టింటికి వచ్చి లకుమ గురించి ఆరాతీస్తూ తనకు తెలిసిన విషయాల్ని ఆమెతో షేర్ చేసుకుంటోంది.

"ఆ యాడ్ నేనూ చూశాను. రెండు రాష్ట్రాల్లోని అన్ని ప్రధాన నగరాల్లోనూ స్టార్‌హంట్ నిర్వహిస్తున్నాడు. హైదరాబాద్‌లో ఓసారి ఇంటర్వ్యూకి అటెండయ్యాను కదా! మళ్ళీ ఛాన్స్ ఇచ్చి టైమ్ వేస్ట్ చేసుకుంటాడనుకోను" అంది లకుమ. ఇంటర్వ్యూపట్ల తనకే మాత్రం ఇంట్రస్ట్ లేనట్లు.

"వెస్ట్రన్ లుక్‌తో ముంబైహీరోయిన్లా ఉన్నావనేగా రిజెక్ట్ చేశాడతడు. ఓ ఐడియా! ఈసారి ఇంటర్వ్యూకి అచ్చతెలుగమ్మాయిలా హాజరవు.

నీకూ తెలుసు కదా... శశాంక సినిమాలెలా ఉంటాయో? తన హీరోయిన్ కూడా అచ్చం అలాగే ఉండాలనుకుంటున్నాడు. ఈసారి డ్రెస్‌కోడ్ మార్చి విజయవాడ స్టార్‌హంట్‌కి అటెండవు. ఎందుకో ఈసారి సెలక్టవుతావనిపిస్తోంది నాకు"

వైశాలి బలవంతంమీద లకుమ ఒప్పుకుంది.

ముందురోజు హైదరాబాద్‌లో బయల్దేరి తెల్లారుజామునే విజయవాడ చేరుకున్నారు లకుమ, వైశాలి. వైశాలి రిలేటివ్స్ ఇంట్లో దిగి ఉదయాన్నే తలారాస్నానం చేసి కనకదుర్గమ్మ దర్శనం చేసుకున్నారు.

పదకొండుగంటల ప్రాంతంలో బెంజిసర్కిల్ స్టార్ హోటళ్ళో బసచేసిన శశాంక దగ్గరికి ఇంటర్వ్యూకి వెళ్ళారు. ఈసారి లకుమ ఆహార్యంలో కొట్టొచ్చిన మార్పు చోటుచేసుకుంది.

కొత్తవారెవరైనా చూస్తే హైదరాబాద్ సిటీలో మోడలింగ్ చేస్తూ కాలేజీలో చదువుకుంటున్న అల్ట్రా మోడ్రన్ అమ్మాయనుకోరు. పల్చటి వెన్నెల్తో నేసిన తెల్లని చీరతో శరీరాన్ని చుట్టబెట్టింది. నల్లటి జాకెట్, జడనిండుగా మల్లెలు,మరువాలు. చేతినిండుగా సప్త వర్ణాలగాజులు.కాళ్ళకు వెండిపట్టీలు అలాఅలా ఆమె నడిచొస్తుంటే పట్టీలకున్న మువ్వలు చేసే సందడి వీనుల విందే. అచ్చం బాపూబొమ్మలానే ఉంది.

స్టార్‌హోటల్‌లోనిరిసెప్షన్‌లోకూర్చున్నారు లకుమ, వైశాలి. సినిమా కంపెనీకి సంబంధించిన ఓ వ్యక్తి

## అందుకే ఈ విరామం

జాతీయ అవార్డు పొందిన 'చందమామకథలు' సినిమాలో కాలేజీ అమ్మాయిగా కాంతులీడిన వర్షిణి సౌందరాజన్ ఇంకోసినిమాకూ సంతకాలచేసింది.

"నేను మోడలింగ్ ఎసైన్‌మెంట్లు చేస్తున్నా. ఢీ 10వంటి టెలివిజన్ షోలు చేస్తున్నా. ఈ షోగొప్ప హిట్‌కావడంతో అదే వేదికపై ఎన్నో ఆఫర్లు వస్తున్నాయి. టీవీలో పని గొప్ప అభ్యాస అనుభవం. వెబ్ సిరీస్ కూడా చేశా. అందుకే సినిమాల అంగీకారంలో మూడేళ్ళ విరామం" అంటూ తేల్చేసింది.





శశాంక బస చేసిన గదిలోపలికి బయటికి తిరుగుతూ హడావిడి చేస్తున్నాడు. వచ్చినవాళ్ళ డిటెయిల్స్ ఫొటోలు తీసుకెళ్ళి ఒక్కొక్కర్నీ పిలుస్తున్నాడు.

లకుమ లేటెస్ట్ ఫొటో గ్రాఫ్‌లను అందించింది. వెంటనే, శశాంక దగ్గర్నుంచి పిలుపొచ్చింది. అదే రిసెప్షన్‌లో తనకన్నాముందు ఎంతోమంది వచ్చి కూర్చున్నప్పటికీ వెంటనే తనని పిలవడంతో గర్వంగా ఫీలైంది లకుమ. “మీ ఇష్టమయిన హీరో?” ఇంటర్వ్యూ మొదలుపెట్టేశాడు శశాంక.

“మహేష్‌బాబు”

“హీరోయిన్”

“నాకు నేనే”

“హండ్రెడ్ పర్సెంట్ కాన్ఫిడెన్స్”

ఇంతలో కూల్‌డ్రింకుల్తో బాయ్ వచ్చాడు. తనో బాటిల్ తీసుకుని “తీసుకోండి” అన్నాడు.

“థాంక్స్” మొహమాటంగానే తీసుకుంటూ అంది లకుమ. కాసేపటి తర్వాత అతడన్నాడు “ఇంటర్వ్యూలో మీరు సక్సెస్ అయ్యారు”

కొద్దిక్షణాలాగి “ఔను! హైదాబాద్ ఇంటర్వ్యూలోనే మీరు సక్సెస్ అయ్యారు.. ఫెయిలవడంలో” శశాంక నవ్వాడు.

“అంటే...”

“వింటానంటే మీకో సజెషన్. దయచేసి సినిమాలకు ప్రయత్నించకండి”

“థాంక్స్ ఫర్ యువర్ సజెషన్” దిగ్గున లేచింది లకుమ. కోపంతో ఆమె ముఖం ఎర్రబడడం వెనుకనున్న అతడు గమనించలేదు.

## ఆయనో నడిచే లైబ్రరీ

‘పిల్ల జమిందార్’ తర్వాత పెద్ద అవకాశాలేం పొందలేకపోయిన హరిప్రియ కన్నడ చెక్కేసి అక్కడ బిజీ అయింది. మళ్ళీ ఇన్నాళ్ళకు బాలకృష్ణ సినిమాతో టాలీవుడ్ గుమ్మం తొక్కింది.

తన పాత్ర షూటింగ్ పూర్తిచేసేసి, తనలోని అల్లరి యాంగిల్ చూస్తారంటూ ఊరిస్తోంది.

“ఇప్పటిదాకా నేను చేయని ఓ కొత్త తరహా పాత్ర ఇది. బాగా ఎంజాయ్ చేశాను. బాలకృష్ణగారి డెడికేషన్ అమోఘం. రిహార్సల్స్ చేయాల్సివస్తే, ఎటువంటి భేషజాలు పెట్టుకోరు. ఆయన నడిచే లైబ్రరీ వంటి వారు” అంటూ ప్రశంసలతో హోరెత్తిస్తోంది.

రెండునెలలతర్వాత ఓ రోజు -

‘మనసిస్తా!’ శశాంక సినిమా పేరది. ప్రెస్‌మీట్ పెట్టి మరీ ఎనౌన్స్ చేశాడు.

పోస్ట్ ప్రొడక్షన్ వర్క్ చివరిదశలో ఉందని.. రెండ్రోజుల్లో కంప్లీట్ కాగానే ప్రసాద్‌లో సినీ ప్రముఖులకు ప్రివ్యూ వేయబోతున్నట్లు ప్రకటించాడతడు.

ప్రతిరోజూ నైట్ టెన్‌ఓ క్లాక్‌కి వచ్చే ‘టోటల్ టాలీవుడ్’ హాఫెనవర్ ప్రోగ్రామ్‌లో ప్రెస్‌మీట్ విశేషాలు టెలికాస్టయ్యాయి. మైకుగొట్టాలముందు నిల్చున్న శశాంక మనసిచ్చిపుచ్చుకోవడం మధురాతిమధురం.

ఎక్కడపడితే అక్కడ మనీపర్సులా మనసుని పారేసుకోలేం. ఎవరికిపడితే వాళ్ళకి మనసుని ఇచ్చేసుకోలేం. ఈ ఇతివృత్తం ఆధారంగా మనసున్న ప్రేక్షకులకు నచ్చేలారూపొందించిన చిత్రం‘మనసిస్తా...!’ఇప్పటికే ప్రేమలో పడ్డవారికి, కొత్తగా ప్రేమలో పడాలనుకుంటున్నవాళ్ళకి ఈ చిత్రం అంకితం” అన్నాడు.

“డైరెక్టర్‌గారూ! చిన్నక్వశ్చన్” అన్నాడో జర్నలిస్ట్.

“అడగండి”

“ఇంతకీ మీరెవరికైనా మనసిచ్చారా?”

“ఓ... ఇచ్చాను”

“ఎవరికి?” టీవీముందు ఆ ప్రోగ్రామ్‌నే చూస్తున్న లకుమ ఆ సమాధానానికి ఒక్కసారిగా ఉలిక్కిపడింది. “నా ఫస్ట్ లవ్.. సినిమానే. సినిమానే ఎంతగానో ప్రేమిస్తున్నాను” అన్నాడు శశాంక.

“మాకు కావాల్సింది ఈ ఆన్సర్ కాదు”

“మీరనుకునే ఆన్సరే ఇవ్వాలని కోరడం తప్పు”

“కానీ...ఇండస్ట్రీలో మోస్ట్ ఎలిజిబుల్ బ్యాచిలర్ మీరు. లవ్‌స్టోరీలు తెరకెక్కించి కిక్కెక్కించడంలో మీకు మీరే సాటి. అలాంటి మిమ్మల్నెవరూ ప్రేమించలేదా?” “ఆ ప్రశ్న నన్నడిగితే ఎలా? అయినా, సినిమామోజులోపడ్డ నేను నిజంగాప్రేమించగలనా? ఏమో?” అన్నాడు శశాంక నిర్లిప్తంగా.

“అయినా, ‘మనసిస్తా!’ సినిమా మీరు చూడండి. నేను ప్రేమలో పడ్డానో లేదో మీకూ తెలుస్తుంది. తెలిస్తే నాకు చెప్తే బహుమతి ఉంటుంది. ఇది మీకే కాదు... అభిమాన ప్రేక్షకులకు కూడా వర్తిస్తుంది” అన్నాడతడు నవ్వుతూ.

కొద్దిరోజులకే ‘మనసిస్తా...!’ సినిమా రిలీజైంది. ఫస్ట్‌డే, ఫస్ట్ షో టాక్ పాజిటివ్‌గా వచ్చింది.

వైశాలితోపాటు ఆర్టీసీ క్రాస్‌రోడ్‌లో ఉన్న థియేటర్‌కి వెళ్ళింది లకుమ. థియేటర్ ముందు జాతరే జరుగుతోంది. టిక్కెట్లకోసం పడరానిపాట్లుపడుతున్నారు జనాలు.

“ఇంత రష్‌లో టిక్కెట్ దొరుకుతుందా?” అనుకుంది లకుమ. థియేటర్ బాల్కనీలోంచి లకుమను చూసిన శశాంక వడివడిగా ఆవరణలోకి వచ్చాడు. అతడ్నిచూసిన ఎలక్ట్రానిక్ మీడియా ఎలర్టయింది.

“డైరెక్టర్‌గారూ! సినిమా సూపర్‌హిట్. ఈ సందర్భంగా మీ రియాక్షన్” అడిగాడో జర్నలిస్ట్ శశాంక ముఖంముందు మైకు గొట్టంపెడుతూ.

“ఇది మూడో సినిమా. ఈ సినిమాతో హ్యాట్రిక్ కొట్టాను. సినిమా చూసిన ప్రతిఒక్కళ్ళూ ఫీల్‌గుడ్ మూవీ అని ప్రశంసిస్తున్నారు” అన్నాడు.

“మూడో సినిమా సరే... మూడు ముళ్ళు సంగతేంటి?” అడిగాడింకో జర్నలిస్ట్.

“మనసిస్తా...సినిమాచూశాను. మీరిచ్చిన పజిల్‌కి ఆన్సర్ దొరకలేదు. క్లూ ఇస్తారా?” మరో ప్రశ్నను సంధించారింకొకరు. అన్నింటికీ శశాంకనుంచి నవ్వే సమాధానమైంది. ఇంతలో యూనిట్‌కి చెందిన ఓ వ్యక్తి అక్కడికి రాగానే “చూడు, ఈశ్వర్! నాక్కావాల్సిన ఈ అమ్మాయిని దగ్గరుండి బాల్కనీలో కూర్చోబెట్టు” అన్నాడు. ఆ వెంటనే మీడియా కెమెరాలన్నీ లకుమని టార్గెట్ చేశాయి.

“నేనెంతగానో ఇష్టపడే మూడక్షరాల నా ఫియాన్సీకి... కృతజ్ఞతలతో శశాంక” అనే అక్షరాలు లవ్ సింబల్స్ నేపథ్యంలో స్క్రీన్‌పై ప్రత్యేకంగా ప్రత్యక్షమయ్యాయి. ఆఖరున కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం : శశాంక అని ఉంది.

అభిరుచి గల ఓ దర్శకుడికి, మోడల్‌కి నడుమ జరిగిన అందమైన ప్రేమకథ అది. ప్రారంభ సన్నివేశం నుంచీచిత్రంఆకట్టుకుంది. రెండక్షరాలప్రేమ, మూడక్షరాల కామం గురించి ఆద్యంతం ఉత్కంఠ భరితంగా చర్చ జరిగింది. సినిమా క్లైమాక్స్‌కి చేరుకుంటుండగా వచ్చిందా సన్నివేశం.

“నువ్వు లేని జీవితం వృథా అనుకున్నాను. ఔనునిజం. నేనునిన్ను ప్రేమిస్తున్నాను. ఐ లవ్ యూ” థియేటర్ అంతా ‘ఐ లవ్ యూ!’ ప్రకంపనలతో నిండిపోయింది. హీరోయిన్ అవ్వాలని వచ్చిన ఓ అమ్మాయిని ముందు తిరస్కరించిన ఓ డైరెక్టర్‌ఆమెని ప్రైవేటుగా కలుసుకుని ఆమె ముందు మనసుని ఆవిష్కరించిన దృశ్యం అది.

నిన్న గురించి భయపడేవాడు, నేడు పోరాడలేడు.
నేడు పోరాడలేనివాడు, రేపు గెలవలేడు.
గెలవాలనుకుంటే భయం వదిలేయాలి.
భయం పోవాలంటే
పోరాడి తీరాలి.

"నువ్వెవరో నాకు తెలుసు. కావ్యనాయికల సౌంద ర్యానివి. ఆ దివినేలిన ఊర్వశివి. అంతకుమించి కర్పూరవసంతరాయలి కావ్యనాయిక లకుమవి?" అన్నమాటలు డీటీఎస్‌సౌండ్‌లో హైలైట్‌అయ్యాయి.

ఆఖరున ఆ డైరెక్టర్ ఎంతో భావోద్వేగంతో చెప్తాడిలా "అందుకే, ప్రతిభావంతురాలైనప్పటికీ నిర్దాక్షిణ్యంగా నిన్ను తిరస్కరించాను. నిన్ను నే చూసుకోవాల్సింది వేలాదిమంది నీ అందాన్ని వీక్షించే వెండితెరపై కాదు. నా గుండెతెరపై. కాదన్నా, ఔనన్నా ఇక నీదే నిర్ణయం" అంటూ ఆ సీన్ కట్ చేశాడు.

చివర్లో ఆ డైరెక్టర్ చేతిని హీరోయిన్ అందుకోవడంతో 'శుభం కార్డ్' పడింది. ఆ సన్నివేశాన్ని చూస్తున్న లకుమ అవాక్కయింది.

'మనసిస్తా' డైరెక్టర్ మదిలో సుందరి! క్రియేటివ్ డైరెక్టర్‌ని ప్రేమముగ్గులోకి దింపిన అజ్ఞాతభామ! శశాంక మనసుని దోచిన అభినవతారక!

రెండక్షరాల ప్రేమను వెండితెరపై అత్యద్భుతంగా ఆవిష్కరించే శశాంక ప్రేమలో పడ్డాడు. మూడక్షరాల పేరుగల ఆ సుందరి ఎవరో తెలుసుకోవాలనుకుంటున్నారా? థియేటర్ నుంచి ఇంటికి రాగానే చానెల్ పెట్టిన లకుమ షాక్‌కి గురైంది. శశాంక ఇండస్ట్రీలోకి దూసుకువచ్చిన యువకెరటం.

ఎంబీఏ చదివి... ఏ డైరెక్టర్ దగ్గరా అసిస్టెంట్‌గా పని చేయకుండా డైరెక్ట్‌గా మెగాఫోన్ పట్టుకుని సత్తా చాటిన యువదర్శకుడు.

అతడి సినిమా అంటే ఆడియన్స్‌కి ఎంతో క్రేజ్. స్క్రీన్‌పై ప్రత్యక్షమయిన యాంకర్ అలవోకగా ఇంట్రో చదివేస్తోంది. మధ్యమధ్య శశాంక సినిమాలోని ప్రేమ సన్నివేశాల క్లిప్పింగ్స్ ప్లేచేస్తూ ప్రోగ్రామ్‌ని పరిగెత్తిస్తున్నారు. అవును మరి! శశాంక గురించి మరే చానల్ టెలికాస్ట్ చేయకముందే... 'ఎక్స్‌క్లూజివ్'గా ఈ ప్రోగ్రామ్‌ని రూపొందించారు.

"ఆమె మోడల్‌గా ఇప్పుడిప్పుడే ఎదుగుతోంది. సక్సెస్‌ఫుల్‌గా కొన్ని కమర్షియల్ యాడ్స్ చేసింది. అవకాశంవస్తే సిల్వర్ స్క్రీన్‌పై కూడా మెరవాలనుకుంది. కానీ అంతలోనే ఈ క్రియేటివ్ జీనియస్ మనసు కొల్లగొట్టింది. ఇంతకీ ఆమె ఎవరో తెలుసుకోవాలనుకుంటున్నారా?

సినీ వినీలాకాశంలో తారకలా తళుకులీనాలనుకున్న అమ్మాయిప్యార్‌మే యువడైరెక్టర్ పడిపోయాడు. పీకల్లోతు ప్రేమలో మునిగిపోయాడన్న దానికి నిదర్శనమే థియేటర్లలో హల్‌చల్ చేస్తున్న



ఎన్ని మాధ్యమాలు వచ్చినా,
వాటి పరిధి విస్తరించినా
సినిమా ప్రాధాన్యం సినిమాదే...
సినిమా ఒక మ్యాజిక్.
-అదితీరావు హైదరి, నటి

## సీరియల్స్ వదలా....

'శశిరేఖా పరిణయం' సీరియల్‌లో సుపరిచితం అయిన మేఘనా ఆకాష్ ఇప్పుడు 'ఇది మాప్రేమకథ' అంటూ వెండితెరనిండా తెల్లని మేఘాలను విరజిమ్ముతున్నది. 'శశిరేఖా పరిణయం' సీరియల్‌చూసి తనను ఎంపికచేశారంటూ అడిగినవారికి, అడగని వారికి కూడా ఏకరువుపెడుతున్నది మేఘన.

"సినిమాలు, సీరియల్స్‌ను ఎంజాయ్ చేస్తున్నాను. కష్టసుఖాలన్నవి రెండింటిలోనూ ఉన్నాయి. సినిమాల్లోకి వచ్చినప్పటికీ మంచి కథలు వస్తే సీరియల్స్ చేస్తూనేవుంటా" అని చెప్పింది.



అతడి లేటెస్ట్ ఫ్లిక్ 'మనసిస్తా!' సినిమా టైటిల్స్‌లోనే 'నేనెంతగానో ఇష్టపడే మూడక్షరాల నా ఫియాన్సీకి కృతజ్ఞతలతో శశాంక' అంటూ బాహాటంగా ప్రకటించాడంటే ఆమె అంటే అతడికెంత ప్రేమో ఇట్టే అర్థం చేసుకోవచ్చు.

శశాంక చెప్పని ఆ మూడక్షరాల పజిల్‌ని ఈ చానెల్ కనిపెట్టింది. సినిమాలో క్లయిమాక్స్‌కి ముందు వచ్చిన ఓ సన్నివేశంలో హీరోయిన్‌ని తిరస్కరించిన డైరెక్టర్ ఆ పేరును ప్రకటించేశాడు.

"నువ్వెవరో నాకు తెలుసు. కావ్యనాయికల సౌంద ర్యానివి. ఆ దివినేలిన ఊర్వశివి. అంతకు మించి కర్పూరవసంత రాయలి కావ్యనాయిక లకుమవి?" అంటూ సినిమాలో ఓ డైలాగ్ ద్వారా తన ఫియాన్సీ పేరుని శశాంక చెప్పకనే చెప్పేశాడు.

వెంటనేమాచానెల్‌ప్రతినిధి మూడక్షరాల మోడల్స్ ఎవరున్నారా? అని ఆరాతీస్తే... ఆ అమ్మాయి పేరు దొరికిపోయింది. ఒక్కో అక్షరాన్ని విడదీస్తూ చెప్పేసింది యాంకర్. ఆ పేరు 'ల...కు...మ...!'

ఫిబ్రవరి ఫోర్టీన్త్.... వాలెంటైన్స్ డే.

తూర్పు రాగరంజితమవుతున్న ఓ ఉదయాన్నే కాలింగ్‌బెల్ మోగింది. 'అంతపొద్దున్నే ఎవరొచ్చారా?' అని ఆలోచిస్తూనే తలుపు తీసిన లకుమ అంతులేని ఆశ్చర్యానికి లోనైంది.

ఆ వచ్చిందెవరో కాదు... శశాంక.

"ఇంట్లోకి రావొచ్చా?" ప్రశ్నిస్తూనే జవాబు కోసం ఎదురుచూడకుండా లోనికొచ్చేశాడతడు.

"ఇంట్లో ఎవరూ లేరా?"

"అర్జెంట్ పనిమీద మమ్మీ ఊరెళ్ళింది. ఈ సాయంత్రానికి వస్తుంది" చెప్పింది లకుమ.

సొంతింట్లో సోఫాలోకూచున్నట్లు రిలాక్స్‌గాకూర్చున్నాడతడు. లోనికి వెళ్ళి అయిదు నిముషాల్లో పొగలు కక్కుతున్న వేడి వేడి కాఫీతో హాల్లో కొచ్చింది.

"కాఫీవిత్ కాన్వర్సేషన్. ఈ ఘడియ కోసమే నే ఎదురుచూస్తున్నాను" చెప్పాడు శశాంక కాఫీ సిప్ చేస్తూ.

"ఆ తర్వాత" అన్నాడతడు.

"నిజం చెప్పనా? నిన్ను చూసిన మొదటిక్షణంలోనే నా మనసు పారేసుకున్నాను. ఇంటర్వ్యూగదిలోకి అలా అలా నువ్వు నడిచొస్తుంటే... నీ పాదాల కింద నా హృదయం పడి నలిగిపోయింది.

అప్పటికప్పుడే స్టార్‌హంట్‌కి ఫుల్‌స్టాప్ పెట్టి.... చేతుల్లో ఉన్న ఆ సినిమాని వదిలేసుకుని నీతో ఎంచక్కా లేచిపోవాలనిపించింది. అంతేకాదు.. నిన్ను హీరోయిన్‌గా తెరపై చూడాలనిపించలేదు.

అందుకే, అసమానసౌందర్యరాశివైన నిన్నే సినిమాలకే పనికిరావంటూ తిరస్కరించాను.

ఔను... నిన్ను ఇష్టపడుతున్నాను! అయితే, ఆ ఇష్టాన్ని వ్యక్తపరిచే క్రమంలో తిరస్కరించి నీ మనసుని గాయపరిచి ఉంటాను. నన్ను క్షమించలేవా?" లకుమ రెండు చేతులు పట్టుకుని దీనంగా అర్థిస్తున్నాడు శశాంక.

వారంరోజులు తిరక్కముందే వారిద్దరూ దంపతులయ్యారు. ఆ రోజు తొలిరాత్రి -

బుగ్గలో సిగ్గుల గులాబీలు విచ్చుకోగా ఎదలోనే కొలువున్న ప్రియసఖుడికి ఎదురేగలేని సంకటస్థితిలో అడుగులు తడబడుతుండగా... కనురెప్పలు వాలిపోగా సాలభంజికలా తలుపుదగ్గరే స్థాణువై నిలుచుంది లకుమ. నెమ్మదిగా లేచాడు శశాంక.

"ఇంతకాలం నే చేసిన స్టార్‌హంట్ ఈ సగం కోసమే" అంటూ ఆమె అరుణాధరాల్ని చుంబించాడు. ఇక, ఆ రాత్రి వారిద్దరికీ జాతరే.



THE LARGEST CIRCULATED TELUGU WEEKLY

స్వాతి సపరివార పత్రిక

# నూతన సంవత్సర కానుక సరికొత్త విజయాల వేదిక

## పిడపర్తివారి

# 2018 క్యాలెండర్ ఉచితం

కాలాన్ని, దాని కదలికలను అంచనావేయడం అనితర సాధ్యం.
రెప్పపాటుసమయాన్ని ఆపాలన్నా ఆ సృష్టికర్తకే అసాధ్యం.
కాల పురుషునికాలం అంత గొప్పది. అటువంటి కాలం గురించి
తెలుసుకోవాలనే జిజ్ఞాసగలవారికోసమే ఈ స్వాతి
క్యాలెండర్. కాలజ్ఞానాన్నిచ్చేదే స్వాతి క్యాలెండర్.
ఈ క్యాలెండర్‌లో రోజుయొక్క ప్రాముఖ్యత, సంవత్సరంలోని 365
రోజుల గ్రహానుకూలత, వారం, వర్జ్యం, తిథి, నక్షత్రం, దుర్ముహూర్తం,
సుముహూర్తం, రాహుకాలం మొదలైన వాటితోపాటు ఏ నెలలో
ఏ పండుగ మొదలైనవాటిగురించి వివరించబడింది.
స్వాతి క్యాలెండర్ మీ వద్ద వుంటే 12 నెలలు అనగా 365 రోజుల
అదృష్టమంతా మీ చేతిలో వున్నట్లే.
లగ్న నిర్ణయకర్తలవంటి బహుముఖ ప్రజ్ఞావంతులుసైతం
ప్రామాణికంగా తీసుకునేది స్వాతి క్యాలెండర్‌నే. కనుక ఈ క్యాలెండర్
కోసం ముందుగా మీ కాపీని రిజర్వుచేసుకోండి.





మ్యాప్‌లితో పేపర్, మల్టీకలర్ ప్రింటింగ్‌తో **2018 క్యాలెండర్**ను పాఠకదేవుళ్ళకు నూతన సంవత్సర
కానుకగా స్వాతి సపరివార పత్రిక **5.1.2018 సంచిక** తో ఉచితంగా అందిస్తోంది.
ముందుగానే మీ కాపీని ఏజెంట్‌ద్వారా రిజర్వ్ చేసుకోండి.

Cell : 81860 00039 www.themoneyworkshop.com



సురేష్ పద్మనాభన్

**చా**లామంది తాము అనుకున్నది జరిగితే గుడ్ లక్ అని, జరగకపోతే బ్యాడ్ లక్ అని అనుకుంటారు. మీ జీవితమనే నిఘంటువులోనుండి ఈ మాటలను తొలగించినప్పుడే మీరు నిజమైన స్వతంత్రం గల వ్యక్తిగా జీవించగలుగుతారు.

Evil gotten good, never proveth worth




## ఇది చదివినవారికి డబ్బు వశమవుతుంది

'లక్' అనే పదాన్ని అందరూ అనేక సమయాల్లో ఉపయోగిస్తుంటారు. కాని 'లక్'ని అర్థం చేసుకున్నవారు బహుతక్కువ. అందుకే కొందరు దానికి 'గుడ్' అని, 'బ్యాడ్'అని అర్థంలేని పదాలను జతచేర్చి మాట్లాడుతుంటారు.

అలాంటివారికి 'లక్'కే కాదు గుడ్, బ్యాడ్ అనే పదాలకూ సరైన అర్థం తెలియదు.

'ఆహా అతనెంత లక్కీ ఫెలో'

'నేనెంత లన్‌లక్కీ ఫెలోని'

'ఇది గుడ్ లక్', 'అదంతా బ్యాడ్ లక్'

ఇలాంటి పదాలను రోజూ మనం అనేకసార్లు ప్రయోగిస్తాం లేదా మరెవరో వాడుతుంటే వింటుంటాం. డబ్బు విషయంలో అనుకున్నది అనుకున్నరీతిలో జరగకపోతే 'బ్యాడ్ లక్' వెంటాడుతుందనుకుంటారు. ఇదంతా చూస్తుంటే 'గుడ్ లక్', 'బ్యాడ్ లక్' అనే రెండు స్టిక్కర్స్ మీ దగ్గరున్నాయి.

మీకు జరిగిన లేదా జరగకపోయిన పనిని అనుసరించి వాటిలో ఏదోకదాన్ని మీ ఆలోచనలకు అంటించుకుంటారు. కొంతకాలం క్రితంవరకు కుందేలు కాలిని అదృష్టం తెచ్చే వస్తువుగా భావించేవారు. ఆ కుందేలు కాలిని రసాయనాల పూతతో కుళ్ళిపోకుండా చేసి అమ్మేవారు. అది అదృష్టం తెచ్చిపెడుతుందని నమ్మేవారు. ఆ కుందేలు కాలిని కొని ఇంటికి తెచ్చుకుని దాచుకునేవారు. ఇదంతా ఎవరో అనాగరికులు చేయటంకాదు. నాగరికులమని చెప్పుకునేవారే చేసేవారు.

ఆ కాలు మనకు అదృష్టం తెచ్చిపెట్టటం సరే... మరి ఆ కాలు, ఆ కాలితోపాటే ప్రాణం కోల్పోయిన కుందేలు అదృష్టం గురించి ఎప్పుడైనా ఆలోచించారా? ఎవరైనా సరే... ఎప్పుడైతే 'గుడ్ లక్' అనేది ఒక వస్తువుతో కలిసి వస్తుందో వారు తమ శక్తియుక్తులన్నీ ఆ ఒక్క వస్తువుమీదే పెడతారు.

'గుడ్ లక్' అనే నమ్మకాన్ని వాడిన ప్రతిసారీ సొంత శక్తుల్ని కొంతమేర నష్టపోతుంటారు.

'గుడ్‌లక్' అనే మాట వాడటం కొంతవరకు ఫరవాలేదు. 'బ్యాడ్‌లక్' అనేదాన్ని నమ్మటంకన్నా హీనం మరొకటి లేదు.

'రష్యన్ రోలెట్టె' అనే ఆట వుంది. రివాల్వర్‌లో ఒకే ఒక బుల్లెట్ పెడతారు. రివాల్వర్ మూసివేసి బుల్లెట్ వున్న 'మ్యాగజీన్'ని గిర్రున తిప్పుతారు. ఇప్పుడు ఆ బుల్లెట్ ఎక్కడుందో ఎవరికీ తెలియదు. అది తొలిసారి ట్రిగ్గర్ నొక్కినప్పుడు పేలవచ్చు లేదా రెండోసారి... లేదా మూడోసారి... ఇది రష్యన్ రోలెట్టె.

ఇందులో ఆ బుల్లెట్ ఎవరివైపైతే గురిపెట్టబడుందో వాడికి ప్రాణసంకటం. చూసేవారికి ఉత్సాహం... ఒకటేమిటి అన్ని భావాలు కలగలిపి వస్తాయి. ఇటువంటి ఆటను ఒక మనిషి మరెవరి మీదో కాక తన కణతకు తానే గురిపెట్టుకుని ఆడుకుంటున్నాడనుకోండి.

అతనికి భయం, ఆందోళన, ఆశ్చర్యం, అద్భుతం వంటి అన్ని బావాలు ఒకేసారి కావాలనుకుని ఆడుతున్నాడనుకోండి. ఇది పిచ్చిఅనాలా లేక వెర్రి అనాలా! ఈ బుల్లెట్ పేలకపోతే అది 'గుడ్ లక్' అనా? ఒక వేళ పేలి అతడి ప్రాణం హరిస్తే అది బ్యాడ్ లక్ అనా? ఇందులో ఏమైనా అర్థముందా?

అసలు ఆ ఆట ఆడటం ఎందుకంట? జీవితంలో ఎదురయ్యే సంఘటనలు అతి సమీపంగా పెట్టి కాల్చే బుల్లెట్ల వంటివి. అవి రానా వద్దా అని మీ అనుమతి తీసుకోవు. జరిగేముందు మీరు సిద్ధంగా వున్నారా లేదా అనేది పట్టించుకోవు.

కాలం పాటించే పద్ధతి మనకు నచ్చినా నచ్చకపోయినా సంఘటనలు జరగకుండా పోవు.

మనం చేయగలిగింది వీటికి దీటుగా స్పందించటమే కాని మూర్ఖంగా వ్యవహరించటం కాదు. వస్తువులకు, సంఘటనలకు మీరు వేసే 'గుడ్ లక్', 'బ్యాడ్ లక్' అనే ముద్రలు మిమ్మల్ని జీవిత కాలంలో ఊబిలో నుండి బయటకు రానివ్వవు.

**ఊ**బిలో కావాలని ఇరుక్కున్నవారికి బయటి ప్రపంచంలో స్వతంత్రంగా జీవించటంలో లభించే ఆనందం అర్థం కాదు. వారికివారే నిర్మించుకున్న బందిఖానాలో బతకాల్సివస్తుంది.

మీ జీవితమనే నిఘంటువులోనుండి 'గుడ్ లక్' 'బ్యాడ్ లక్' అనే మాటల్ని తొలగించినప్పుడే మీరు నిజమైన స్వతంత్రంగల వ్యక్తిగా జీవించగలుగుతారు.

**(వచ్చేవారం వస్తా)**

# ఐరన్ బేబీలు

పిల్లలకు శరీరంలో ఐరన్ లోపిస్తే, ఆ ఐరన్‌లేమి రక్తహీనతకు దారితీస్తుంది. అసలేమిటీ ఐరన్‌లేమి రక్తహీనత అనీ మియా? అన్న అవగాహన వుంటే సమస్యకు సులువుగా పరిష్కారం లభిస్తుంది.

ఊపిరితిత్తుల్లోని ఆక్సిజన్ రక్తంద్వారా శరీరంలోని వివిధభాగాలకు సరఫరా అవుతుంది.

ఈ ప్రక్రియను నిర్వహించే ఎర్రరక్తకణంలోని భాగాన్ని హిమోగ్లోబిన్‌గా వ్యవహరిస్తారు.

సరైన మోతాదులో హిమోగ్లోబిన్‌ను తయారు చేసుకోవడానికి శరీరానికి చాలినంత పరిమాణంలో ఐరన్ కావాలి.

శరీరంలో తగినంత ఐరన్ లేకపోయినట్లయితే చాలినంత మోతాదులో హిమోగ్లోబిన్ తయారవదు. ఫలితంగా ఐరన్ లేమి రక్తహీనత ఏర్పడుతుంది.

## పిల్లల్లోనే ఎందుకు ఎక్కువ?

పిల్లల్లో ఎదుగుదల శీఘ్రంగా వుంటుంది. వారి శారీరక ఐరన్ అవసరం వారి సైజ్‌తో పోల్చితే ఎక్కువగా వుంటుంది.

పైగా, ఈ రోజుల్లోని పిల్లల్లో ఆహారపు అలవాట్లు సక్రమంగా లేకపోవడంవల్ల వారిలో పోషకాహార లేమి ఏర్పడుతున్నది. ఓ మాదిరినుంచి తేలికపాటి ఐరన్ లేమి రక్తహీనత ఉన్నప్పుడు వాటి తాలూకు లక్షణాలు అంతగా కనపడవు.

### అత్యధిక రక్తలేమి తలెత్తినప్పుడు ఈ కింది లక్షణాలు కనపడుతుంటాయి :


బలహీనంగా, అలసటగా వుంటారు


పేలవంగా కనపడతారు


మగతగా వుంటారు


ఆకలి పెద్దగా వుండదు


తక్కువ ఎదుగుదల


నాలుక మంట


అసహనం, చిరాకు


ఏకాగ్రత లేమి

## గుర్తించేదెలా?

సింపుల్ రక్త పరీక్షద్వారా హిమో గ్లోబిన్ స్థాయిలు తెలుసుకోవచ్చు.రక్తహీనతకు ఇతర కారణాలు కూడా వుంటాయి. విటమిన్ బి12 లేదా ఫోలిక్ యాసిడ్ లోపంవల్ల కూడా రక్తహీనత ఏర్పడుతుంది. అయితే హిమోగ్లోబిన్ లోపంవల్ల ఏర్పడే రక్తహీనత సాధారణంగా తలెత్తుతుంటుంది.

చికిత్సతో పిల్లల్లోని హిమోగ్లోబిన్ స్థాయి మెరుగవకపోతే అరుదుగా ఉండే ఇతర కారణాలకోసం వైద్యులు విస్తృతపరీక్షలు సూచిస్తారు.

**చికిత్స :** ఐరన్ సప్లిమెంట్లు తీసుకోవడంద్వారా ఐరన్ లేమి రక్తహీనతకు చికిత్స చేయవచ్చు. అయితే ఈ చికిత్సకు కొన్ని వారాలు సమయం పడుతుంది. తొలి కొద్దిరోజుల్లో మెరుగుదలను గుర్తించవచ్చు.

హిమోగ్లోబిన్ సాధారణస్థాయికి చేరినప్పటికీ చికిత్సను కొన్నివారాలపాటు కొనసాగించాల్సివుంటుంది. దీనివల్ల శరీరంలో చాలినంత ఐరన్ స్థాయిలు నిల్వ అయ్యేందుకు వీలవుతుంది.

**ఐరన్ మాత్రలు :** భోజనాల నడుమ ఐరన్ మాత్రలువేసుకోవడం సరైనసమయం. పాలు, క్యాఫైన్, అత్యధికపీచుపదార్థాలు లేదా యాంటాసిడ్స్‌తోకలిపి ఐరన్ సప్లిమెంట్లు తీసుకోకూడదు. ఇవి ఐరన్‌గ్రహణతో జోక్యంచేసుకునే అవకాశం వుంటుంది.

విటమిన్ 'సి' సప్లిమెంట్లు లేదా ఆరెంజ్ జ్యూస్‌తో కలిపి ఐరన్ సప్లిమెంట్లు తీసుకోవడం మంచి ఆప్షన్. ఇవి శరీరం ఐరన్‌ను సమగ్రంగా గ్రహించేందుకు ఎంతగానో దోహదపడతాయి.

## కారణాలు?

- రక్తహీనతకు కారణం అయ్యే నులిపురుగులు, పారాసైటిక్ ఇన్‌ఫెక్షన్లు.
- ఋతుస్రావంవల్ల కాని లేదా గ్యాస్ట్రో ఇన్‌టెస్టినల్ స్రావంవల్ల కాని శరీరంనుంచి రక్తంద్వారా ఐరన్ కోల్పోవడం.
- కొన్ని వైద్యకారణాలరీత్యా ఆహారంనుంచి ఐరన్‌ను శరీరం సరిగ్గా గ్రహించలేకపోవడం.
- దైనందిన ఆహారంనుంచి అందే ఐరన్ సప్లయ్ శరీరానికి అవసరం అయ్యే హిమోగ్లోబిన్ ఉత్పత్తికి నడుమ వ్యత్యాసం ఎక్కువగా వుండడం.


పేపర్, ఐస్, మట్టి తినాలన్న కోరిక


తలనొప్పి


అభ్యాస క్లిష్టతలు


తక్కువ అటెన్షన్ స్థాయి

## ఏ విధంగా అడ్డుకోవాలి?

పిల్లల ఆహారంలో తగినంత ఐరన్ ఉండే విధంగా జాగ్రత్తలు తీసుకోవాలి.


రెడ్‌మీట్


బీన్స్, లెంటిల్స్, శనగలు, సోయాబీన్స్


గుమ్మడిగింజలు


ఎండు పండ్లు (ప్రూన్స్, రైజన్లు)


బంగాళాదుంపలు


గుడ్డుసొన


బ్రౌన్‌రైస్


బాదంపప్పులు, వాల్‌నట్స్


ఆకుకూరలు


డార్క్ చాక్లెట్లు


చికెన్, మటన్


పూర్తిస్థాయి ధాన్యాలు (గోధుమ, ఓట్స్, బార్లీ)

Courtesy : PARENT CIRCLE

## అమ్మాయిలకు ఎక్కువ అవసరం

- ప్యూబర్టీదశలో ఆడపిల్లలకు ఐరన్ అవసరం ఎక్కువగా వుంటుంది. ఎదిగేవయస్సులో వారికి బ్లడ్ వ్యాల్యూమ్ ఎక్కువ కావాల్సి వుంటుంది. ప్యూబర్టీ సమయంలో బ్లడ్ వ్యాల్యూమ్ పెరుగుతుంది.
- ఈ దశలో పిల్లల ఎత్తు, కండరాల మాస్‌కూడా పెరుగుతుంటాయి. కండరాల ఎదుగుదలకు ప్రొటీన్ అవసరం ఎక్కువగా వుంటుంది.
- నెలసరి ఋతుస్రావంవల్ల కోల్పోయే రక్తాన్ని భర్తీ చేసుకోవడానికి సరైన ఐరన్ నిల్వల్ని మెయిన్‌టెయిన్ చేయాలి.
- ప్యూబర్టీ దశలో ఎముకలు, కండరాలు శరీరంలో నిల్వగల ఐరన్‌ను ఎక్కువగా ఉపయోగించుకుంటాయి. ఐరన్ పెంచుకోవడానికి గుడ్లు మంచి ఆధారం. రైస్‌ఫ్లేక్స్, గార్డెన్ క్రెస్ సీడ్స్, ఆకుకూరలు, లివర్, ఇతర ఆర్గాన్ మీట్‌లనుంచి ఐరన్ లభిస్తుంది.

విటమిన్ 'సి' ఎక్కువగా తీసుకోవడంవల్ల ఐరన్‌ను శరీరం బాగా గ్రహిస్తుంది.

కాబట్టి, తినే పదార్థాలపై కొద్దిగా నిమ్మరసం జల్లుకోవడం సరైన ఆలోచన.

మన దేశంలో యుక్తవయస్సు అమ్మాయిల్లో 53 శాతం, అబ్బాయిల్లో 27 శాతం రక్తహీనత ఉందనేది అధ్యయనాల్లో తేలిన అంశం. ఐదేళ్లలోపు పిల్లల్లో 58 శాతం రక్తహీనత ఉన్నట్లు గుర్తించారు.

బి.హిమబిందు

# నేనెవరో తెలుసా!

భారతదేశానికి ప్రస్తుత ఉపరాష్ట్రపతి ఒక ఆంధ్రుడు. గతములో మరో ఇద్దరు ఆంధ్రులు ఆ పదవిలో బాధ్యతలు నిర్వహించారు. ప్రస్తుత ఉపరాష్ట్రపతిది నెల్లూరు జిల్లా అయితే గతంలో ఉపరాష్ట్రపతిగా పనిచేసినవారి ఇంటి పేరు నెల్లూరి జిల్లాలోని ఒక గ్రామం పేరు.

మరో ఉపరాష్ట్రపతి ఇంటిపేరులో, పేరులో కూడా గిరులుండేవి. ఆంధ్రులు ఉత్తమ గవర్నర్లు, ఉపరాష్ట్రపతులు, రాష్ట్రపతులుగా పనిచేస్తారన్నది ఢిల్లీలో ఉన్న వారి అభిప్రాయం. అందుకే అటువంటి పదవుల్లో నాడు ఆంధ్రులను కూర్చోపెట్టేవారు.

ఆ కోవలోనే నెల్లూరుకే చెందిన మరో నేతను ఉపరాష్ట్రపతిని చెయ్యాలని నాటి ప్రధాని భావించారు. గతంలో గవర్నర్‌గా ఉత్తమ సేవలు అందించినవాడు కనుక ఉపరాష్ట్రపతి, ఆపైన రాష్ట్రపతిగా కూడా బాగా పనిచేస్తాడని ప్రధాని భావించారు.

ఆ మేరకు ఆయనకు ప్రతిపాదనకూడా పంపారు. కాని ఇంటిముందుకు వచ్చిన ఉపరాష్ట్రపతి పదవిని ఆ నెల్లూరు పెద్దమనిషి సున్నితంగా తిరస్కరించారు.

పదవులకోసం రాజకీయనాయకులు వెంటపడే రోజుల్లో, ఉన్నత పదవి తనను వెతుక్కుంటూ వస్తే కాదు పొమ్మన్న రాజకీయనాయకులను చూసి ఆశ్చర్యపోవాల్సిందే. అది ఆ రాజకీయవేత్త ప్రత్యేకత.

నిబద్ధతతో కూడా రాజకీయాల్లో ఎదగవచ్చని నిరూపించిన వ్యక్తి ఆయన. బాల్యంలో జరిగిన సంఘటనలు కొందరి జీవితాలను మారుస్తాయి.

దేశ స్వాతంత్ర్య పోరాటం జరిగే రోజుల్లో గాంధీజీ ఆంధ్ర దేశ పర్యటనకు వచ్చారు. 1920ల్లో గాంధీజీ నెల్లూరు వస్తే తన తల్లి చేయిపట్టుకుని మహాత్ముని మాటలు వినటానికి వెళ్ళాడు.

ఆ సమావేశంలో గాంధీజీ ఏమి చేస్తారో, ఆయనకు ఏమి వంటపట్టిందో కాని ఏడేళ్ళ వయసులోనే గాంధేయవాదిగా మారాడు. అక్కడనుండి ఆయన దృష్టి రవీంద్రనాథ్‌టాగూర్‌మీదికి మళ్ళింది.

స్వరాష్ట్రంలో చదువు పూర్తిచేసుకున్న ఆయన, రవీంద్రుడు ప్రారంభించిన శాంతినికేతన్‌లో చదువుకునేందుకు వెళ్ళాడు. డిగ్రీ అందుకుని శాంతినికేతన్‌నుండి తిరిగి వచ్చిన యువకుడిగా స్వాతంత్ర్య పోరాటంలోకి దూకాడు. విద్యార్థి ఉద్యమాలలో పాల్గొన్నాడు.

క్విట్ ఇండియా ఉద్యమంలో చురుకుగా వ్యవహరించాడు. జైలుకు వెళ్ళాడు. శిక్షలు అనుభవించాడు. కాంగ్రెస్ పార్టీలో ప్రత్యేక గుర్తింపు కల్గిన నేతయ్యాడు. పిన్నవయసులో మంత్రులైనవారు నేడు చాలామంది కనిపిస్తుంటారు. అయితే అదంతా వారికి రాజకీయ వారసత్వంగా అందివచ్చిన పదవులేగాని స్వయంప్రతిభతో, గుర్తింపుతో అందుకున్నవి కావు.

ఈనాటి రాజకీయ వారసులకు భిన్నంగా ఆయనకు స్వయంప్రతిభతో మంత్రివర్గములో స్థానం దక్కింది. రాజాజీవంటి సీనియర్ ఏర్పాటుచేసిన మద్రాసు మంత్రివర్గంలో 29 ఏళ్ళ కుర్రాడు మంత్రిగా ప్రమాణ స్వీకారం చెయ్యటం ఒక సంచలనం.

పైగా అప్పటికి ఆ కుర్రాడు బ్రహ్మచారి. చిన్న వయసులోనే పెళ్ళిళ్ళు చేసే సాంప్రదాయం వున్న కాలం. ఆ సామాజిక వర్గానికి చెందిన వ్యక్తి అయినా మూడు పదులు వయసుదాటినతర్వాతగాని ఆయన పెళ్ళి చేసుకోలేదు. అలా మద్రాసు రాష్ట్రంలో రాజాజీ దగ్గరే కాదు, ఆ తరువాత టంగుటూరి ప్రకాశం మంత్రివర్గంలోనూ పనిచేశాడు.

మద్రాసు రాష్ట్రంనుండి విడిపోయి ఆంధ్ర రాష్ట్రం ఏర్పడినప్పుడు కర్నూలులో బాధ్యతలు స్వీకరించిన మంత్రివర్గంలో ఆయన వున్నాడు. అంతేకాదు, కొత్తగా ఏర్పడిన ఆంధ్ర రాష్ట్రానికి స్వల్పకాలం ముఖ్యమంత్రిగా కూడా పనిచేశాడు.

నైజాం ప్రాంతం కలిపి ఏర్పాటుచేసిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో తిరిగి మంత్రి అయ్యాడు. అలా మూడు రాష్ట్రాలలో మంత్రిగా పనిచేసిన వ్యక్తి ఆయనేనేమో! స్వతంత్ర భారతదేశంలో పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ఏర్పాటుచేసిన మంత్రివర్గం 1952, 1955 ఎన్నికల్లో ఘనవిజయాలు సాధించింది.

ఆయన ఏర్పాటుచేసిన మంత్రివర్గంలో పనిచేసిన కొద్దిమంది ఆంధ్రులలో ఆయన ఒకరు. సమాచార శాఖను సమర్థవంతంగా నిర్వహించాడు ఆనాడు.

ఆయనను ఆ తర్వాత దేశంలోని అతిపెద్ద రాష్ట్రానికి గవర్నర్‌గా నియమించారు. ఇందిరాగాంధీకి ఆయన సేవలు వినియోగించుకోవాలని వుండేది.

మరోసారి గవర్నర్, ఉపరాష్ట్రపతి పదవివంటి పదవులు వద్దని స్వరాష్ట్రానికి తిరిగివచ్చారు. దాదాపుగా అరవై ఏళ్ళ వయసులో రాజకీయాల నుండి రిటైర్‌మెంట్ ప్రకటించారు.

రాజకీయనాయకులకు రిటైర్‌మెంట్ అనే పదం నచ్చదన్నది అందరికీ తెలిసిన విషయమే. అటువంటి పదవులకోసం వెంపర్లాడే సాదాసీదా రాజకీయవేత్తలకు భిన్నంగా తనంతతానుగా పదవులను వద్దనటం అప్పటికీ ఎప్పటికీ ఒక గొప్ప విశేషమే.

నిజానికి ఆయన రాజకీయాలకు తగినవాడు కాదన్నది చాలామంది అభిప్రాయం. స్వాతంత్ర్య సమరంవల్ల రాజకీయాలలోకి వచ్చాడు కాని లేకుంటే ఆయనకు బాగా నచ్చినది సాహిత్యరంగమే.

హాయిగా విద్యారంగంలో ఎక్కడో ఒకచోట ఒక గొప్ప ప్రొఫెసర్‌గా, సాహితీవేత్తగా స్థిరపడి వుండేవాడేమో. మాతృభాష తెలుగుతోపాటు దేశంలోని మరో పది భాషలు ఆయనకు వచ్చు.

ఇంగ్లీషు వచ్చు. భాషల విషయంలో పి.వి.నరసింహారావుకి ఈయనే స్ఫూర్తి ఏమో! సంస్కృతం, ఉర్దూ, బెంగాల్, ఒరియా, తమిళ, కన్నడ, అస్సామీ, గుజరాతీలు అన్నింటిలో నిష్ణాతుడు ఆయన. పైగా స్వయంగా రవీంద్రుడి శిష్యుడిగా కలకత్తాలో సాహిత్యంమీద మక్కువ పెంచుకున్నాడు.

బెంగాలీ సాహిత్య ప్రభావం, రవీంద్రుని రచనల ప్రభావం ఆయనమీద వుంది. రవీంద్రుని రచనలను తెలుగులోకి అనువాదంచేసి అందించారు. రవీంద్రుని రచనలను స్ఫూర్తిగా తీసుకుని అనుసరణంగా మంచి కవిత్వం రాశారు.

స్వేచ్ఛానువాదాలు, పూర్తి అనువాదాలు ఆయన కాలం నుండి వచ్చాయి. సాహితీవేత్తలతో గడపటానికి ఇష్టపడేవారు. తెలుగులో స్వతంత్రంగా కావ్యాలను రచించారు. ఇతర భాషలలో మంచి సాహిత్యం ఎక్కడయినా కనిపిస్తే దానిని తెలుగువారికి అందించేందుకు ప్రయత్నించేవారు.

ఇక్బాల్ కవితలు, కె.ఎమ్. మున్షీ కథలు తెలుగులోకి ఆయన అందించాడు.

సాహిత్యంలో అత్యున్నత అవార్డ్‌గా భావించే 'జ్ఞానపీఠ్'కి అర్హులయినవారిని ఎంపికచేసే కమిటీకి ఎనిమిదేళ్ళపాటు అధ్యక్షుడిగా వుండేవారు ఆయన. కేంద్ర సాహిత్య అకాడమీకి అధ్యక్షుడు.

తెలుగు భాషా సమితికి అధ్యక్షుడు. ఆంధ్ర విశ్వవిద్యాలయానికి ప్రోఛాన్సలర్.

ఆ విశ్వవిద్యాలయం నుండి గౌరవ డాక్టరేట్ అందుకున్నాడు ఆయన. కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డ్ అందుకున్నాడు. పరిపాలన అధ్యక్షుడయినా సాహితీమూర్తిగానే ఎక్కువ గుర్తింపు పొందారు ఆయన. ఇంతకీ...

*1. ఆ నేత పేరేమిటి?*

*2. ఆయన పుట్టిన గ్రామం పేరేమిటి?*

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు
ఇన్‌లాండ్ కవర్‌పై రాసి
స్వాతి చిరునామాకు 23 డిశంబరు 2017 తేదీలోగా పంపించండి. కరెక్టు సమాధానాలు
రాసినవారిలో లాటరీ పద్ధతి ద్వారా
ఒకరిని విజేతగా ఎంపిక చేసి ₹ 500/-
నగదు బహుమతిని అందజేస్తాం.

8.12.2017 సంచికలో ప్రచురించబడిన
'నేనెవరో తెలుసా!' శీర్షిక సమాధానాలు :
1. ఏడిద కామేశ్వరరావు
2. బొమ్మరిల్లు, పాలవెల్లి
**₹ 500/- బహుమతి పొందిన విజేత :**
సంజీవి నాగ శ్వేత
నెం. 19, హరిదాస నగర్, గట్టిగెరె
ఆర్.ఆర్.నగర్, బెంగళూర్-98

తమిళ సూపర్‌స్టార్ రజనీకాంత్ గురించి ప్రత్యేకంగా పరిచయం అవసరం లేదు. రజనీకాంత్ నటనగురించి అందరికీ తెలుసు.

రజనీకాంత్ డైలాగ్ డెలివరీ గురించి, అతని శరీర కదలికల గురించి చెప్పాల్సిన పనిలేదు. కాని రజనీకాంత్ గురించి తెలియని విషయం అతనిలోని ఆధ్యాత్మికచింతన. దక్షిణాదిన రజనీకాంత్ రాఘవేంద్రస్వామికి భక్తుడన్న విషయం తెలుసు.

తరచుగా ఆ మఠాన్ని సందర్శించి అక్కడి స్వామీజీ ఆశీస్సులు పొందుతుంటాడు. ఆ మధ్య ఒకసారి హఠాత్తుగా రజనీకాంత్ కనిపించకుండా పోయాడంటూ తమిళ పత్రికల్లో వార్తలు వచ్చాయి.

రజనీకాంత్ అభిమానులు ఏమైంది మా 'హీరుడి'కి అంటూ చెన్నై వీధుల్లోకి వచ్చారు. దానితో రజనీకాంత్ వివరణ ఇవ్వక తప్పలేదు.



Courtesy : LIFE POSITIVE

# ఆధ్యాత్మిక అవతారంలో రజనీకాంత్

తాను ఎక్కడికి వెళ్ళలేదని, తాను ధ్యానంకోసం హిమాలయాలకు వెళ్ళానని రజనీకాంత్ ప్రకటించాడు. నాడు ఆ విషయం బయటపడటానికి పలు సంవత్సరాల ముందునుండే రజనీకాంత్ ధ్యానంకోసం హిమాలయాలకు వెళ్ళటం మొదలుపెట్టాడు.

హిమాలయ పాద ప్రాంతమయిన రాష్ట్రం ఉత్తరాఖండ్. అందులోని అల్మోరా జిల్లాలోని ఒక గుహకి ప్రత్యేకత ఉంది. ఆ గుహకు చేరటమంత సులభం కాదు. అతికష్టంమీద, మెట్లు సరిగా లేని మార్గం గుండా పైకి చేరాల్సివుంటుంది.

ఆ గుహలో 'యోగి మహావతార్ బాబాజీ' తపస్సు చేసుకునేవారు. ఆయన వయసు ఎంతో తెలియదు. చాలామంది ఆ బాబాజీని చూశామని చెప్పటమేగాని ప్రత్యేకంగా ఇలా వుంటారని వర్ణించిందిలేదు.

ఎవరితో ఆ బాబాజీ మాట్లాడిన దాఖలాలు లేవు. వరాలు ఇవ్వటం, ఏవేవో శక్తులు ప్రదర్శించటం వంటివి ఆ బాబాజీ ఎన్నడూ చెయ్యలేదు.

నేటికీ అదృశ్య రూపంలో బాబాజీ అక్కడ తిరుగుతుంటాడనేది ఆ ప్రాంతవాసుల నమ్మకం. ఆ గుహలో వున్న బాబాజీ 'క్రియా యోగం' ఆచరించేవారు. మహావతార్ బాబాజీగురించి విన్న రజనీకాంత్ ప్రతి ఏటా అక్కడికి వెళుతున్నాడు.

నాటి బాబాజీ గుహలో రజనీకాంత్ కూర్చుని ధ్యానం చేసుకునేవాడు. ఇలా ప్రతి ఏటా ఒక నెల రోజులపాటు షూటింగ్‌లు, సినీరంగపు ఇతర హడావుడులు, మద్రాసు నగర వాతావరణానికి దూరంగా హిమాలయాలకెళ్ళటం రజనీకాంత్‌కి అలవాటైంది.



బాబాజీ గురించి రజనీకాంత్‌కి పరిచయంచేసింది ఆయన మిత్రుడు హరి. అలా క్రియాయోగాన్ని ఆరంభించిన రజనీకాంత్ ఆ ప్రక్రియ బాగా వంటపట్టించుకున్నాడు. భార్యతో కలిసి క్రియా యోగా శిబిరాలకు హాజరయ్యేవాడు. క్రియా యోగా సాధన రజనీకాంత్ జీవితంలో ఎంతో మార్పు తెచ్చింది.

క్రమంగా బాబాజీ భక్తుడయ్యాడు. ప్రతి ఏటా ఆ గుహకి వెళ్ళిరావటం మొదలుపెట్టాడు.

పదిహేనేళ్ళక్రితం రజనీకాంత్ 'బాబా' అనే పేరుగల సినిమాలో నటించాడు. ఆ సినిమా కాస్తా అట్టర్ ఫ్లాప్ అయింది. అది అతనికి ఆర్థికంగా ఇబ్బందులు తెచ్చింది. దానితోపాటుగా బాబాజీ జీవితాన్ని ఆయన అనుమతి లేకుండా సినిమాగా మలిచాను అనే బాధ రజనీని వేధించింది.

ఆ బాధనుండి బయటపడేందుకు మళ్ళీ మళ్ళీ హిమాలయ గుహలకు వెళ్ళటం మొదలుపెట్టాడు. రజనీకాంత్, అతనికి ఆప్తమిత్రులు హరి, మూర్తి, శ్రీధర్‌రావులు కలిసి బాబాజీ గుహకు వచ్చే భక్తులకు సౌకర్యాలు కల్పించాలనుకున్నారు.

ఆ గుహ సమీపంలో సత్రం వంటిది నిర్మించారు. భక్తుల సౌకర్యాల నిర్వహణను రజనీకాంత్, అతని మిత్రబృందమే పర్యవేక్షిస్తున్నది.

ఉత్తరాఖండ్‌కి రజనీకాంత్ చేసే వార్షిక యాత్ర రహస్యంగానే సాగిస్తాడు. చెన్నైలో విమానం ఎక్కుతూనే తాను ఒక సూపర్‌స్టార్‌ని అనే ఆలోచనను మరచిపోతాడు. సాదాసీదా పైజమా, షర్ట్‌లోకి మారతాడు. వీలైతే లుంగీని ధరిస్తాడు.

పైన ఒక కండువా ధరించి ఇతరులు గుర్తుపట్టలేని పద్ధతిలో తయారవుతాడు. అందరు భక్తులలాగానే అక్కడి సత్రంలో, ఇతర దుకాణాలలో దొరికేవి తింటాడు. ధ్యాన కేంద్రంలో మిగిలిన భక్తులతో కూర్చుంటాడు. ఒకసారి ధ్యానానికి కూర్చుంటే నాలుగైదు గంటలు అలా ధ్యానంలో వుండగలిగినంత ఆధ్యాత్మిక శక్తిని రజనీకాంత్ సాధించాడు.

తన 'ఆధ్యాత్మిక గృహం అల్మోరాలోని గుహ' అని చెప్పుకుంటాడు రజనీకాంత్.

# జై భారత్

## చిత్ర వెంకటేష్

గౌతమ్ డ్రైవ్ చేస్తున్న కారు వేగంగా ముందుకు దూసుకుపోతుంది.

"ఏ రెస్టారెంట్‌కు వెళదాం" డ్రైవ్ చేస్తూనే అడిగాడు గౌతమ్.

"నేను డైరెక్షన్ చెపుతాను. నువ్వు దాని ప్రకారం డ్రైవ్ చెయ్యి"అంటూ ఎలావెళ్ళాలో సూచనలు ఇవ్వసాగింది సుజి.

పదినిమిషాలతరువాత కారు ఒక రెస్టారెంట్ ముందు ఆగింది.

గౌతమ్‌కారు దిగుతూ దేదీప్యమానంగా వెలుగుతున్న నేమ్‌బోర్డ్‌వైపు చూశాడు.పారు రెస్టారెంట్ అని ఉంది. గౌతమ్ చైనావచ్చి సంవత్సరం కావస్తోంది. కాని ఎప్పుడూ ఈ రెస్టారెంట్ గురించి వినలేదు.

అమెరికాలో ఏదో ఊరిలో పారు రెస్టారెంట్ ఉంది అని విన్నాడు. తరువాత ఆ పేరు వున్న రెస్టారెంట్ ఇక్కడ చూస్తున్నాడు.

"గౌతమ్ ఈ హోటల్‌లో భోజనం చాలా బాగుంటుంది. ఒకసారి ఇక్కడ తింటే మళ్ళీ మళ్ళీ ఇక్కడికే రావాలనిపిస్తుంది. నువ్వు ఇండియన్‌వి. నీకు ఇండియన్ డిషెస్ చాలా ఇష్టమని ఇక్కడికి తీసుకువచ్చాను. ముందే చెపితే సస్పెన్స్ పోతుందని చెప్పలేదు.

నిజానికి ఈ రెస్టారెంట్ గురించి నాకూ బొత్తిగా తెలియదు. ఒకసారి స్నేహితురాలితో ఇక్కడికి వచ్చాను, తను తీసుకువచ్చింది. ఆ రోజు భోజనం నాకు చాలా అద్భుతంగా తోచింది. ప్రతిసారి ఇంత దూరం రావటం వీలుకాదు. అందుకే నాలుగు నెలలకు ఒకసారిఇక్కడికి వస్తుంటాను" అంది సుజి.

ఇద్దరు లోపలికి వెళ్ళి మూలగా ఉన్న టేబుల్ ముందు కూర్చున్నారు. అక్కడనుంచి వాళ్ళకు క్యాష్ కౌంటర్ స్పష్టంగా కనిపిస్తుంది.

కౌంటర్ ముందు ఒక యువతి కూర్చునివుంది. ఆమెకు ముప్పై సంవత్సరాలు ఉంటాయి. సన్నగా పొడుగ్గా ఉంది. కళ గల మొహం. వయస్సు ముప్పై ఉన్నా అలా కనిపించదు. చప్పున చూస్తే ఒక కాలేజీ అమ్మాయిలా అనిపిస్తుంది.

ఒకవైపు క్యాష్ తీసుకుంటూనే ఇంకోవైపు పని



### జరిగిన కథ

4

ఓ రోజు ప్రద్యుమన్‌ని తన ఛాంబర్‌లోకి పిలుస్తాడు పండరీనాథ్. ఉగ్రవాదులను ఏరిపారేసే బాధ్యతను ప్రద్యుమన్‌కు అప్పజెబుతాడు పండరీనాథ్.

ఇద్దరి మధ్య ఎగ్రిమెంట్ కుదురుతుంది. యాదవ్‌తోసహా అప్పటికి పదిమందిని చంపేస్తాడు ప్రద్యుమన్. ఇంతలో సిన్హా ప్రవేశించి చైనా ఎసైన్‌మెంట్ అప్పగిస్తాడు.

ఇండియన్ రీసెర్చ్ అండ్ ఎనాలసిస్ డిపార్ట్‌మెంట్‌లో ఏజెంట్ గౌతమ్ చైనా ప్రభుత్వంలో ఉద్యోగం చేస్తూ అక్కడి రహస్య సమాచారాన్ని ఇండియన్ ఎంబసీకి చేరవేస్తుంటాడు. చైనా ఇంజనీరింగ్ డిపార్ట్‌మెంట్‌లో పని చేసే ఓ చిన్న ఉద్యోగి సుకాకు లంచం ఇచ్చి ఫిఫ్త్ జనరేషన్ యుద్ధ విమానం తయారు చేస్తున్న విషయం తెలుసుకుంటాడు.

గౌతమ్ తన ప్రియురాలు సుజితో లవర్స్ పార్క్ చేరుకుంటాడు. అక్కడికి మిలట్రీ అధికారి మావో కూడా వస్తాడు.

ఇక జరగబోయేది చదవండి.



వాళ్ళకు ఇన్‌స్ట్రక్షన్స్ ఇస్తుంది. అంతేకాకుండా ప్రతి టేబుల్ దగ్గరికి వెళ్ళి కస్టమర్స్‌తో మాట్లాడుతోంది. ఆమెనుచూసి చాలా ఇంప్రెస్ అయ్యాడు గౌతమ్.

ఇద్దరు సౌత్ ఇండియన్ తాల్ ఆర్డర్ చేశారు. సుజి చెప్పింది నిజమే. భోజనం చాలా శుచిగా,రుచిగా ఉంది. చాలారోజుల తరువాత తన తల్లి చేతివంట తిన్నట్టుగా ఫీలయ్యాడు గౌతమ్.

"భోజనం చాలా బాగుంది సుజి" అని అన్నాడు గౌతమ్ చేతివేళ్ళను చప్పరిస్తూ.

"దయచేసి నువ్వు చైనీస్ భాష నేర్చుకో. ప్రతి నిమిషం నీతో ఇంగ్లీష్‌మాట్లాడాలంటే చాలా ఇబ్బందిగా ఉంటుంది" అంది చిరాకుగా సుజి.

"ఈ మాట నువ్వు ఎప్పుడో ఒకప్పుడు అంటావని నాకు తెలుసు. అందుకే చైనీస్ భాష నేర్చుకోవటానికి ఒక ట్యూటర్‌ను నియమించుకున్నాను. వారానికి శని ఆది వారాలుమాత్రమే వస్తుంది.

రెండుగంటలు చెప్తుతుంది. వచ్చేవారం నుంచి నా ట్యూషన్ మొదలవుతుంది"

**హిందూ ధర్మంలో అంటరానితనానికి చోటు లేదు. మఠాధిపతులు ప్రయత్నిస్తే నేడున్న అంటరానితనం నిర్మూలమవుతుంది.**

-ప్రవీణ్ తొగాడియా, వి.హెచ్.పి. అధ్యక్షుడు



"ఇంతకీ ట్యూటర్ ఎవరు? ఆడా-మగా" అని అంది నవ్వుతూ సుజి.

"అమ్మాయి. చాలా అందమైన చైనీస్ అమ్మాయి. చైనీస్ భాషలో స్పెషలైజ్ చేసింది. బీజింగ్‌లో పెద్ద స్కూలులో చైనీస్ టీచర్‌గా పనిచేస్తుంది"

"ఇంత కాలానికి ఒక మంచి నిర్ణయం తీసుకున్నావు. సందర్భం వచ్చింది కనుక చెపుతున్నాను. నాతో ప్రవర్తించినట్టు తనతో ప్రవర్తించకు. చాలా ఇబ్బందిపడతావు" అంది సీరియస్‌గా సుజి.

"నీ ఆడబుద్ధి పోనిచ్చుకున్నావు కాదు... ఆ అమ్మాయి పేరు చాంగ్‌లీ. కావాలంటే ఆమె అడ్రస్సు, సెల్ నెంబర్ ఇస్తాను"

"అవసరం లేదు" అంది సుజి.

భోజనం ముగించినతరువాత డబ్బు ఇవ్వటానికి కౌంటర్ దగ్గరికి వచ్చారు.

"భోజనం ఎలా ఉంది..." డబ్బు తీసుకుంటూ అడిగింది కౌంటర్‌లో ఉన్నామె.

"చాలా బాగుంది. పొగడ్త కాదనుకుంటే ఇలాంటి భోజనం బీజింగ్‌సిటీలో ఎక్కడా లేదు.అంత రుచిగా ఉంది" అన్నాడు గౌతమ్.

"ఆ టేబుల్ మీద ఒక రిజిష్టర్ ఉంది. అందులో మీ పేరు అడ్రస్ రాయండి. దానికింద మా హోటల్ డిషెస్‌మీద మీ అభిప్రాయంకూడా రాసి కిందసంతకం పెట్టండి. అదే మాకు కస్టమర్స్ రికార్డ్" అందామె.

గౌతమ్ అలాగే రాసి సంతకం పెట్టాడు. తరువాత ఇద్దరు హోటల్‌లోంచి బయటకు వచ్చారు. ఆ రోజు వాతావరణం చాలా ఆహ్లాదకరంగా ఉంది. గాలి చల్లగా, సేద తీరుస్తున్నట్టుగా వీస్తోంది.

రాత్రివరకు ఇద్దరు కారులో సిటీ అంతా తిరిగారు. రాత్రి ఏడుగంటలకు ఇంటికి బయలుదేరారు. మధ్యదారిలో ఒక హోటల్‌లో భోజనం చేశారు. అప్పటికే బాగా చీకటిపడిపోయింది.

ఆకాశంలో చందమామ వెన్నలముద్దలా మెరిసిపోతున్నాడు. నక్షత్రాలు దూరంగా చిన్నగా వెలుగుతూ తమ ఉనికిని చాటుకుంటున్నాయి.

పావుగంట తరువాత ఇద్దరు కారులో గెస్ట్‌హౌస్ చేరుకున్నారు. కారు ఇంటిముందు పార్క్ చేస్తూ క్యాజువల్‌గా ముందుకు చూశాడు గౌతమ్. అంతకు ముందు వచ్చిన మిలిట్రీకారు జీపులక్కడే ఉన్నాయి. యథాప్రకారం మిలిట్రీ జవాన్లు గేటుముందు అటెన్షన్‌లో నిలబడి కావలా కాస్తున్నారు.

బీజింగ్ ఇంటర్నేషనల్ ఎయిర్ పోర్ట్‌లో స్మూత్‌గా ల్యాండ్ అయింది ఇండియన్ ఎయిర్‌లైన్స్ విమానం. ప్రయాణీకులు అందరూ దిగినతరువాత చివరగా దిగాడు ప్రద్యుమన్.

పావుగంటలో కస్టమ్స్ ఫార్మాలిటీస్ ముగించుకుని లాంజ్‌లోకి వచ్చి నిలబడ్డాడు. అతన్ని పికప్ చేసుకునే మనిషి ఇంకా రాలేదు. అతనికోసం ఎదురు చూస్తూ కెఫిటేరియాదగ్గర నిలబడ్డాడు

కాఫీ తాగుతూ చుట్టూ గమనిస్తున్నాడు. అప్పుడే ఒక దృశ్యం అతని కళ్ళలో పడింది.

ఒక యువకుడిని ఇద్దరు ఎయిర్‌పోర్ట్ సెక్యూరిటీ గార్డ్స్ పట్టుకుని తీసుకువెళుతున్నారు. అతని చేతిలో ఒక చిన్న బ్రీఫ్‌కేసు మాత్రం ఉంది. అతను చైనీస్ భాషలో ఏదో అంటున్నాడు.

సెక్యూరిటీ గార్డ్స్ చేతులు పట్టుకుని బతిమాలుతున్నాడు. కాని వాళ్ళు అతని మాటలు వినిపించుకోలేదు. అతనిమీద కొంచెంకూడా జాలి చూపించలేదు. జంతువును ఈడ్చుకువెళ్ళినట్టు అతన్ని లోపలికి ఈడ్చుకువెళుతున్నారు.

ఆ యువకుడు ఏదో చెయ్యరాని నేరం చేశాడని ప్రద్యుమన్‌కు అర్థమైంది. బీజింగ్‌లో అడుగుపెట్టక ముందే ప్రద్యుమన్ ఎందుకైనా మంచిదని కొంచెం చైనాగురించి చూచాయిగా తెల్సుకున్నాడు. అందులో ముఖ్యమైంది డ్రగ్స్ స్మగ్లింగ్.

ఈ దేశంలో డ్రగ్స్ స్మగ్లింగ్ పెద్ద నేరంగా పరిగణిస్తారు. ఒక మనిషి డ్రగ్స్ స్మగుల్ చేస్తూ పట్టుబడితే వెంటనే అతన్ని అరెస్ట్ చేసి ఎయిర్‌పోర్టులో వున్న



## రెండూ కావాలి

సోకులాడి సోనాక్షిసిన్హాను కదిలిస్తే ఫ్రాంక్‌గా తనగురించి చెప్పుకున్నది.

"నేనో మట్టిముద్దలాంటి దాన్ని. నన్ను ఎలాగైనా మలుచుకోవచ్చు. నటించమంటే నటిస్తా. పాడమంటే పాడతాను. నిజం చెప్పాలంటే పాట అంటే చాలా ఉత్సాహం వచ్చేస్తుంది.

నటన, పాట రెండింటిలో ఒకదాన్ని ఎంచుకొమ్మంటే రెండూ కావాలంటాను. పాడే ఆస్కారంగల పాత్రలో నటించాలంటే నాకెంతో ఇష్టం" అంటోంది.

మొబైల్ కోర్ట్‌లో హాజరుపరుస్తారు. అధికారులు సేకరించిన సాక్ష్యాలు పరిశీలిస్తారు న్యాయమూర్తి.

ఆ మనిషి ఖచ్చితంగా నేరం చేశాడని ఆధారాలు నిరూపణయితే వెంటనే శిక్షవేస్తారు. మనదేశంలోలాగా వాయిదాలు, బెయిల్ లాంటివి ఉండవు. ఆ నేరస్థుడిని వెంటనే బయటకు తీసుకువెళ్ళి కాల్చిచంపేస్తారు. తర్వాత అతని వాళ్ళకు కాల్‌చేసి చెప్తారు.

అధికారులు ఎంత స్ట్రిక్ట్‌గా ఉన్నాకూడా ఈ దేశంలో డ్రగ్స్ స్మగ్లింగ్ తగ్గింది కాని పూర్తిగా సమసిపోలేదు. ప్రద్యుమన్ చూసిన మనిషి అదే నేరం చేసివుంటాడు. అతని బ్రీఫ్‌కేస్‌లో డ్రగ్స్‌ప్యాకెట్స్ దొరికివుంటాయి.

అందుకు అతన్ని అరెస్ట్ చేసి కోర్ట్‌కు తీసుకువెళుతున్నారు. "అప్పుడే ఆర్ యూ ప్రద్యుమన్ ఫ్రమ్ ఇండియా" అని ఒక గొంతు వినిపించింది.

ప్రద్యుమన్ తన ఆలోచన నుంచి తెప్పరిల్లి వెనక్కితిరిగి చూశాడు. ఒక చైనీస్ మిలిట్రీ అధికారి కనిపించాడు. "అవును నేనే ప్రద్యుమన్‌ను మీరు ఎవరు" అడిగాడు ప్రద్యుమన్.

"నేను మిమ్మల్ని ఎయిర్‌పోర్ట్‌లో రిసీవ్ చేసుకోవటానికి వచ్చిన మనిషిని... మావాళ్ళు మిమ్మల్ని జాగ్రత్తగా తీసుకు రమ్మని చెప్పారు. బయలుదేరుదామా" అన్నాడు అతను.

మెల్లగా ఇద్దరూ పార్కింగ్ స్పేస్‌లో ఉన్న మిలిట్రీ జీపువైపు నడిచారు. ఒక్కక్షణం తరువాత జీపు వేగంగా బీజింగ్‌రోడ్డుమీద పరుగులు తీస్తోంది. కిటికీలోంచి చూస్తూ నగర అందాలను ఎంజాయ్‌చేస్తున్నాడు ప్రద్యుమన్. నాలుగు సంవత్సరాలకు ముందున్న బీజింగ్‌కు ఇప్పుడు కనిపిస్తున్న బీజింగ్‌కు చాలా తేడాలు కనిపిస్తున్నాయి.

నాలుగు సంవత్సరాలకు ముందు చైనాను చూడటానికి ప్రద్యుమన్ తన స్నేహితులతో బీజింగ్ వచ్చాడు. అప్పుడే నగరం చాలా అల్ట్రామోడరన్‌గా అందంగా కనిపించింది. నాలుగు సంవత్సరాలతరువాత నగరం ఇంకా అభివృద్ధి చెందింది.

ఎటుచూసినా స్కైస్క్రేపర్స్‌లాంటి భవనాలు, లెక్కలేనన్ని మాల్స్, పబ్‌లు దర్శనమిస్తున్నాయి. పేవ్‌మెంట్ మీద ఎవరు నడిచివెళ్ళటం చూడలేదు ప్రద్యుమన్. అందరూ ఏదో వాహనంలో దూసుకుపోతున్నారు. కాని ఒక విచిత్రమైన విషయం మాత్రం గమనించాడు. అందరు మొహాలకు మాస్కులు వేసుకునివున్నారు. దానికి కారణం పొల్యూషన్.

ఇటీవలే ప్రపంచసర్వేలో కాలుష్యంలో బీజింగ్ మొదటి స్థానంలో ఉందని తేలింది. అందుకే అందరూ మాస్క్‌లు వేసుకుని తిరుగుతున్నారు. గంటతర్వాత జీపు సిటీకి దూరంగా ఉన్న మిలిట్రీ కంటోన్మెంట్ ఏరియాలో ఆగింది. అది రిస్ట్రిక్టెడ్ ఏరియా.

మామూలు సివిలియన్స్‌కు ప్రవేశం లేదు. అనుమతి లేకుండా లోపలికి అనుమతించరు. ప్రోటోకోల్ ప్రకారం ప్రద్యుమన్‌ను మాత్రమేకాకుండా ఆ మిలిట్రీ అధికారిని కూడా పూర్తిగా చెక్ చేశారు. తర్వాత లోపలికి అనుమతించారు.

జీపు వేగంగా వెళ్ళి చిన్న ఆఫీసుముందు ఆగింది. అది అడ్మినిస్ట్రేషన్ బిల్డింగ్. లోపలికి వచ్చినవాళ్ళంతా అక్కడ క్లియరెన్స్ తీసుకుని లోపలికి వెళ్ళాలి. మిలిట్రీ అధికారి, ప్రద్యుమన్ జీపుదిగి లోపలికి వెళ్ళారు.

ప్రద్యుమన్ తన అపాయింట్‌మెంట్ ఆర్డర్, పాస్‌పోర్ట్ వీసా చూపించాడు. వాటిని పూర్తిగా చెక్ చేసిన తర్వాత లోపలికి వెళ్ళమని సైగచేశాడు. ఇద్దరు ఇంకో చిన్న గేటు దగ్గరికి చేరుకున్నారు. అక్కడ కూడా చెకింగ్ జరిగినతరువాత ముందుకు వెళ్ళారు. ఎదురుగా విశాలమైన రోడ్డు దానికి రెండువైపుల పెద్ద పెద్ద బిల్డింగ్స్ ఉన్నాయి. రోడ్డుమీద గుంపులు గుంపులుగా మిలట్రీ అధికారులు, జవాన్లు కనిపిస్తున్నారు. అందరు తాపీగా నడుస్తూ మాట్లాడుకుంటున్నారు. కొంతమంది ప్రద్యుమన్‌ను చూసి పలకరింపుగా నవ్వారు. జవాబుగా ప్రద్యుమన్ కూడా నవ్వాడు.

వరుసగా బిల్డింగ్స్ దాటినతరువాత డబుల్ బెడ్ రూమ్ క్వార్టర్స్ దగ్గరికి వచ్చారు. ఆ అధికారి ఒక క్వార్టర్‌ముందు ఆగి తాళం తెరిచాడు.

"మిస్టర్ ప్రద్యుమన్ ఇదే మీ క్వార్టర్. ఈ రోజు మీరు పూర్తిగా విశ్రాంతి తీసుకోండి. రేపటినుంచి డ్యూటీలో జాయిన్‌కండి. ఇక్కడికి దగ్గరలోనే క్యాంటీన్ ఉంది. సింగ్ క్యాంటీన్ అంటారు.

అక్కడ మీకు కావల్సిన ఇండియన్ వంటకాలు పూర్తిగా దొరుకుతాయి. ఇరవయినాలుగు గంటలు భోజనం దొరుకుతుంది. రోజూ మీరు క్యాంటీన్‌లో టిఫిన్, కాఫీ, భోజనం చెయ్యవచ్చును. కాని డబ్బు మాత్రం ఇవ్వకండి. ఆ డబ్బు ప్రభుత్వం ఇస్తుంది. ఇప్పటికి నాకు సెలవు ఇవ్వండి" అన్నాడు అతను.

అతనికి థ్యాంక్స్ చెప్పి లోపలికి వెళ్ళాడు ప్రద్యుమన్. తలుపులకు లోపలనుంచి గడియపెట్టి బెడ్‌రూమ్‌లోకి నడిచాడు. బ్యాగ్‌ను మంచంమీద పడేసి బెడ్‌మీద వాలిపోయాడు.

క్వార్టర్ చిన్నదైనా అందంగా, పొందికగా ఉంది. రెండు బెడ్‌రూమ్‌లో డబుల్‌కాట్ మంచాలున్నాయి. కొంచెంసేపు రెస్ట్ తీసుకున్నాడు ప్రద్యుమన్. తర్వాత రిఫ్రెష్ అయి క్వార్టర్స్‌లోంచి బైటకు వచ్చాడు. తలుపుకు తాళంవేసి మెల్లగా క్యాంటీన్‌వైపు నడిచాడు.

అతను ఎంతో దూరం నడవకుండానే క్యాంటీన్‌కు దారి కనిపించింది. క్యాంటీన్ ఎటువైపు ఉందో ఒక బాణంగుర్తు కనిపించింది. దాని గుర్తును అనుసరించి ఇంకా లోపలికి వెళ్ళాడు. ఎదురుగా క్యాంటీన్ కనిపించింది. లోపల పెద్దగా రష్‌గా లేదు.

ఇద్దరు మిలిట్రీ అధికారులుమాత్రం లెమన్ టీ తాగుతూ ఏదో మెల్లగా మాట్లాడుకుంటున్నారు... లోపలకు వస్తున్న ప్రద్యుమన్‌ను చూసి పలకరింపుగా చిన్నగా నవ్వారు. తనుకూడా నవ్వాడు ప్రద్యుమన్.

పేరుకు క్యాంటీన్ కాని అక్కడ చైనీస్ వంటకాలతో ఇండియన్ వంటకాలు కూడా దొరుకుతున్నాయి. ముఖ్యంగా ఇడ్లీ దోశ ఉన్నాయి. రెండు ప్లేట్లు ఇడ్లీ ఒక మసాలా దోశ తిన్నాడు ప్రద్యుమన్. తరువాత వేడి కాఫీతాగి వాష్ బేసిన్ దగ్గరికి వెళ్ళాడు.

చేతులు కడుక్కున్నతరువాత అలవాటు ప్రకారం బిల్ పే చెయ్యబోయాడు. అప్పుడే అప్రయత్నంగా అతనికి అధికారి మాటలు గుర్తుకువచ్చాయి.



**నాకు ఒక రాజకీయ లక్ష్యం వుంది. దానికోసం ఏ పార్టీలో చేరేది త్వరలోనే ప్రకటిస్తాను.**

-జయప్రద, నటి

కౌంటర్‌లో కూర్చున్నమనిషి ప్రద్యుమన్‌ను చూసి పలకరింపుగా నవ్వాడు. తను కూడా నవ్వుతూ అతనిదగ్గరికి వెళ్ళాడు. "హలో నా పేరు ప్రద్యుమన్" అన్నాడు ప్రద్యుమన్.

"నా పేరు సురజిత్‌సింగ్ ఈ క్యాంటీన్ ఓనర్‌ను. మీరు ఇండియానుంచొచ్చారుకదూ" అన్నాడతను.

"అవును మీకు ఎలా తెలుసు" అని ఆశ్చర్యంగా అడిగాడు ప్రద్యుమన్.

"నిన్న రాత్రి మీ గురించి ఇక్కడ మాట్లాడుకుంటుంటే విన్నాను. మీరు ఏం తిన్నా డబ్బులు తీసుకోవద్దని నిన్న నాకు లీ చెప్పాడు. అందుకే మిమ్మల్ని వెంటనే గుర్తుపట్టగలిగాను" అన్నాడు సింగ్.

"మిమ్మల్ని కలుసుకోవటం నాకు ఆనందంగా ఉంది. దేశంకాని దేశంలో ఒంటరిగా ఎలా ఉండాలో అని లోలోపల మధనపడ్డాను. కాని మీరు కనిపించిన తర్వాత నా భయం పోయింది. పైగా మీరు భారతీయులు కావటం నాకింకా ఆనందంగా ఉంది"

"నాకు కూడా చాలా సంతోషంగా ఉంది. ఇంత కాలం చైనీస్ భాషలో మాట్లాడి మాట్లాడి విసుగొచ్చింది. ఈ రోజు మీతో తెలుగులో మాట్లాడటం ఆనందంగా ఉంది. మీకేం సహాయం కావాలన్నా నన్ను అడగండి. మొహమాటంపడకండి. దేశంకాని దేశంలో ఒకరికి ఒకరు సహాయం చేసుకోకపోతే ఎలా చెప్పండి"అన్నాడు సింగ్ నవ్వుతూ.

"ఇక్కడ ఇంకా ఎంతమంది భారతీయులు ఉన్నారు..." అడిగాడు ప్రద్యుమన్.

"చాలామంది ఉన్నారు. కాని ఇక్కడ లేరు. అందరూ బీజింగ్‌లో ఉన్నారు. కొంతమంది ఉద్యోగాలు చేస్తున్నారు. మరికొంతమంది నాలాగే వ్యాపారం చేస్తున్నారు. వాళ్ళలో నాకు చాలామంది మంచి స్నేహితులు ఉన్నారు. ప్రతి నెల మొదటి వారంలో అందరం మా ఇంట్లో కలుసుకుంటాం.

ఆ రోజు విందులు వినోదాలతో కాలక్షేపం చేస్తాం. ఇప్పుడు మీరు కూడా మాతో చేరిపోయారు. వచ్చే నెల మిమ్మల్ని నా స్నేహితులందరికీ పరిచయం చేస్తాను.అందరం సరదాగా ఎంజాయ్ చెయ్యొచ్చు. ఏమంటారు ప్రద్యుమన్"

"ఇంకేం అంటాను సరే అంటాను. నేను ఇక్కడ ఒంటరిగా ఉంటున్నా. నాకుమాత్రం ఇక్కడ కాలక్షేపం చెయ్యటానికి ఏం ఉంది. అలాగే కల్సుకుందాం" అన్నాడు ప్రద్యుమన్. అప్పుడే ప్రద్యుమన్‌కు సిన్హా చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి.

సింగ్‌కూడా ఒక ఏజెంట్ అనిచెప్పాడు సిన్హా. ఈ విషయం గుర్తుకురాగానే ప్రద్యుమన్ చప్పున సింగ్‌వైపుచూశాడు. అదే సమయంలో సింగ్ కూడా అతని వైపు చూశాడు. ఇద్దరి చూపులు క్షణం పాటు కలుసుకున్నాయి. ఒక్క క్షణం పాటు ఇద్దరిమధ్య మౌనం తాండవించింది. నిశ్శబ్దాన్ని ఛిద్రంచేస్తూ ఏదో చెప్పబోయాడు ప్రద్యుమన్.

"మీరేం చెప్పబోతున్నారో నాకు తెల్సు.ఎస్. నేను కూడా మీలాంటి ఏజెంట్‌నే. కాకపోతే మీకు నాకు ఒక్కటే తేడా. నేను ఇక్కడ పర్మినెంట్‌గా సెటిల్ అయ్యాను. మీరు ఒక అసైన్‌మెంట్‌కోసంమాత్రం ఇక్కడికి వచ్చారు. మీకు అన్నివిధాలుగా సహకరించమని నాకు పైనుంచి ఎప్పుడో ఆర్డర్స్ వచ్చాయి.

మీకేం కావాలో అడగండి. మీరేం అడగదలుచుకున్నా క్యాంటీన్ ఉన్నప్పుడు మాత్రమే అడగండి. బయటమాత్రం అంతగా మాట్లాడకండి. అప్పుడే ఎవరికీ అనుమానం రాదు" అన్నాడు సింగ్. అతను చెప్పింది సబబుగానే తోచింది ప్రద్యుమన్‌కు.

మావో తన ఛాంబర్స్‌లో కూర్చుని సిగరెట్ వెలిగించాడు. అతనికి ఎదురుగా టేబుల్‌మీద ఒక ఎర్ర రంగు ఫైలు ఉంది. దానిమీద 'టాప్ సీక్రెట్' అని మార్కర్ పెన్‌తో రాసివుంది.

ఆ ఫైలు ఆ రోజు ఉదయమే మిలిట్రీ ఇంటెలిజెన్స్ డిపార్ట్‌మెంట్ హెడ్‌క్వార్టర్స్‌నుంచి వచ్చింది. ఆ సమయంలో మావో ఆఫీసులో లేడు.

ఒక ముఖ్యమైన పనిమీద హెడ్‌క్వార్టర్స్‌కెళ్ళాడు. అందుకే ఆ ఫైలు వెంటనే చూసే అవకాశం అతనికి లేకుండా పోయింది. ఆఫీసుకు వచ్చిన వెంటనే ఆ ఫైలు తెరిచి చూశాడు. అందులో మిలిట్రీ ఏజెంట్లు ఒక రాజకీయనాయకుడి గురించి పంపించిన రిపోర్ట్ ఉంది. అతను సెంట్రల్ మినిస్టర్ కూడా.

ఆ సెంట్రల్ మినిస్టర్‌కు చైనీస్ మాఫియాతో సత్ సంబంధాలు ఉన్నాయని మావోకు చూచాయిగా తెలిసింది. కాని వాటికి తగిన ఆధారాలు కాని, సాక్ష్యాలు కాని లేవు. అందుకే తన ఏజెంట్లను పంపించి వివరాలు సేకరించమని చెప్పాడు మావ్.

ముగ్గురు ఫీల్డ్ ఏజెంట్లు దాదాపు నాలుగు నెలలు ఆ మినిస్టర్‌ను నీడలా వెంటాడారు. అనుసరించారు. అతనెక్కడికెళితే అక్కడికి వెళ్ళారు. అతనెవరెవరిని కల్సుకుంటున్నాడో ఎవరితో మాట్లాడుతున్నారో రహస్యంగా ఫోటోలు తీశారు.

అయితే ఆశ్చర్యం ఏమిటంటే ఆ మంత్రి కల్సుకున్నవాళ్ళలో అనుమానించవలసినవాళ్ళు ఎవరు కనిపించలేదు.వాళ్ళంతా మామూలు పౌరులు.

బ్యాంకులలోను, ప్రభుత్వ కార్యాలయాల్లో పని చేస్తున్నవాళ్ళు. పైగా వాళ్ళంతా మంత్రికి మాత్రమే కాకుండా చాలామందికి తెలుసు.

అయినా ఏజెంట్లు నిరుత్సాహపడకుండా రెట్టించిన ఉత్సాహంతో తమ ప్రయత్నాలు చేశారు. చివరకు వాళ్ళ కష్టాలు ఫలించాయి. ఒకరోజు సదరు మంత్రి బీజింగ్‌లో ఉన్న ఒక ఫైవ్‌స్టార్ హోటల్‌కు తన గరల్‌ఫ్రెండ్‌తో వెళ్ళాడు. నెలకు ఒకసారి అందమయిన అమ్మాయిలతో హోటల్‌గదిలో గడపటం ఆ మంత్రికి అలవాటు.

ఆ రోజు కూడా అలవాటు ప్రకారం హోటల్‌కు వెళ్ళి గదిలోకి వెళ్ళి కూర్చున్నాడు. అంతకుముందే మావో మనుషులు ఆ గదిలో స్పై కెమెరా ఏర్పాటు చేశారు. కొంచెంసేపయినతర్వాత ఒక అందమయిన కాల్‌గరల్ మంత్రిగారి

## పారితోషికానికే ప్రాధాన్యం

ఇటు యాంకరింగ్‌లో గ్లామర్ లుక్స్‌తో,అటు సినిమాల్లో హాటెస్ట్ రూపంతో అలరిస్తున్న రష్మీగౌతమ్ విషయాలను వెల్లడించడంలో వెరీ ఫ్రాంక్. ఇటీవల ఓ ఇంటర్వ్యూలో తాను పారితోషికానికి ఎక్కువ ప్రాధాన్యం ఇస్తానని నిజాయితీగా చెప్పింది.

'కెరీర్ ఆరంభంలో చాలా ఇబ్బందులుపడ్డాను. ఇంటినుంచి డబ్బు తెప్పించుకోవడం చాలా కష్టంగా అనిపించేది. తొలి అవకాశంతర్వాత అన్నపూర్ణస్టూడియోస్ నుంచి చెక్కు అందుకున్నాను.

ఆ డబ్బుతోనే అద్దెకట్టి ఎకౌంట్ తెరిచాను. పరిశ్రమలో విజయంవరిస్తే అన్నీ బావుంటాయి.లేకుంటే కష్టాలు తప్పవు. డబ్బువిలువ బాగా తెలిసిందికాబట్టే, ఎక్కువ పారితోషికం ఇస్తే, చిన్న హీరోలతో సినిమా చేయడానికి కూడా సిద్ధమే" అని చెప్పింది.





న్యాయ, శాసన, కార్యనిర్వాహక వ్యవస్థల మధ్య వున్న సున్నితమైన సోదర భావం పరిరక్షించటం ఎంతో ముఖ్యం.
-రామ్‌నాథ్ కోవింద్, రాష్ట్రపతి

గదిలోకి అడుగుపెట్టింది. ఆ రోజు ఇద్దరు జరిపిన శృంగార కేళీవిలాసాలు స్పై కెమెరాలోకి ఎక్కాయి. అంతేకాకుండా వాళ్ళు మాట్లాడుకున్న మాటలు కూడా రికార్డ్ అయ్యాయి.

నిజానికి వచ్చిన అమ్మాయి కాల్‌గరల్ మాత్రమే కాదు మాఫియా కొరియర్. ఆమె పని మాఫియావాళ్ళు చెప్పినట్టు మంత్రిని కలుసుకుని సమాచారంచెప్పటం. దాని ప్రకారం మంత్రి నడుచుకునేవాడు.

విషయం తెలుసుకున్న ఏజెంట్లు అలర్ట్అయ్యారు. మంత్రిని ఫాలో కావటం మానేసి కాల్‌గరల్‌ను ఫాలో కావటం మొదలుపెట్టారు. ఒకరోజు ఆ కాల్‌గరల్ కస్టమర్ దగ్గరికి వెళ్ళటానికి కారులో బయలుదేరింది. కాని ఆమె కస్టమర్‌ను కలుసుకోలేదు.

మరి ఎక్కడికో వెళ్ళటం గమనించి ఏజెంట్లు ఆమెను రహస్యంగాఫాలో అయ్యారు. ఆ అమ్మాయి కారు సిటీ లిమిట్స్ దాటి అడవిమార్గం పట్టింది. పదినిమిషాలు లోపలికి ప్రయాణంచేసి ఒక నిర్జనమైన ప్రదేశంలో తన కారు ఆపింది. అక్కడ ఆమెకోసం మాఫియా మనుషులు ఎదురుచూస్తున్నారు.

వాళ్ళు ఆమెకు ఒక పెద్ద అట్టపెట్టె ఇచ్చారు. ఆమె దాన్ని తీసుకుని తన కారు డిక్కీలో పెట్టుకుని తిన్నగా మంత్రిగారి ఇంటికెళ్ళింది. ఆ చెక్కపెట్టెను అతనికి అప్పగించి తనెళ్ళిపోయింది. ఆమె వెళ్ళిపోయిన తరువాత మంత్రి ఎవరికో కాల్ చేశాడు. కొంచెంసేపైనతరువాత ఆ మనిషి వచ్చి ఆ అట్టపెట్టెను డెలివరీ తీసుకున్నాడు. దానికి బదులుగా ఒక పెద్ద సంచిలో డబ్బు ఇచ్చాడు.

ఈ దృశ్యాన్ని అంతకుముందే మంత్రి ఇంట్లో పెట్టిన రహస్య వీడియో రికార్డ్ చేసింది. ఆ ఫోటోలు చాలు మంత్రిని కటకటాల వెనక్కి పంపించటానికి. ఆ ఫైలులో ఏజెంట్‌లు ఇచ్చిన రిపోర్ట్స్‌తోపాటు ఫోటోలు కూడా ఉన్నాయి.

రిపోర్ట్ ఇచ్చిన ఏజెంట్లు ఒక విషయం రాశారు. నిజానికి ఆ విషయానికి ఎవరు అంతగా ప్రాధాన్యత ఇవ్వరు. కాని మావో అలాంటివాడు కాడు. ఏ చిన్న విషయాన్ని విడిచిపెట్టడు. ఆ విషయం ఏమిటంటే ప్రస్తుతం మంత్రి సిటీలో లేడు. ఏదో ముఖ్యమైన పనిమీద షాంగాయ్ వెళ్ళాడు.

రెండు రోజులవరకు తిరిగిరాడు. మామూలుగా మావో స్థానంలో ఇంక ఎవరైనా ఉంటే ఈ విషయం పెద్దగా పట్టించుకునేవారు కాదు. కాని మావ్‌కుమాత్రం ఆ విషయం చాలా సంతోషం కలిగించింది. తను ఏం చెయ్యాలో అప్పటికప్పుడు నిర్ణయించుకున్నాడు.

వెంటనే ఫైలును జాగ్రత్తగా డ్రాయర్‌లో పెట్టి తాళం వేశాడు. చాంబర్స్ నుంచి బయటకు వచ్చి చుట్టూ చూశాడు. కారిడార్‌లో కాని ఆఫీసు బయట కాని ఎవరు కనిపించలేదు. ఉద్యోగస్థులు అందరు తమ గదులలో దీక్షగా పనిచేసుకుంటున్నారు.

ఇద్దరు మిలిట్రి జవాన్లు మాత్రం మెయిన్ గేటు దగ్గర కాపలా ఉన్నారు. ఇద్దరి చేతిలో వాకిటాకీలున్నాయి. మావో తన కారులో కూర్చుని స్టార్ట్ చేశాడు. అతని కారు వేగంగా మెయిన్ గేటుదాటి మెయిన్‌రోడ్డుమీదకు ప్రవేశించింది.

అరగంటసేపు ప్రయాణం చేసినతర్వాతబీజింగ్‌లో ఒక పాష్ ఏరియాలో ఒక రెండంతస్థుల భవనానికి కొంతదూరంలో ఆగింది. అది మంత్రి ఇల్లు. మెయిన్ గేటు దగ్గర ఒక వాచ్‌మెన్ మాత్రమే ఉన్నాడు.

అతను సిగరెట్ తాగుతూ ఏదో సెక్స్ పత్రికచూస్తున్నాడు. మావో తన కారును భవనానికి ఇంకా కొంచెం దూరం పార్క్ చేసి మెయిన్‌గేటువైపు నడిచాడు. పిల్లిలా అడుగులు వేస్తూ వాచ్‌మెన్ వెనుక చేరుకున్నాడు. అరచేతిని కత్తిలా బిగించి వాచ్‌మెన్ మెడమీద బలంగా కొట్టాడు. అది జూడో దెబ్బ.

**ఇంకా ఉంది**



**ఇక సంస్థలు నిలబడవు. ఒక సంస్థ ఎదిగి, స్థిరపడేసరికి టెక్నాలజీ పెరిగి ఆ సంస్థను దెబ్బతీస్తున్నది.**

-శేఖర్ కపూర్, దర్శకుడు

# పూజాహెగ్డే

'ముకుంద' ముగ్ధమనోహరరూపానికి రానురాను గ్లామర్‌వేడిని అద్ది ఉక్కిరిబిక్కిరి చేసింది పూజాహెగ్డె. బాలీవుడ్ చెక్కేసి భారీ రూపంతో దూసుకుపోయే ప్రయత్నాలు సాగించి, మళ్ళీ వెనుతిరిగి దక్షిణాదికి చేరిపోయింది. అందంలో ముందుండే పూజాహెగ్డె వ్యక్తిగత సౌందర్య రహస్యాలు తెలుసుకోవాలి.



Courtesy : NEW WOMAN

- **నా పర్సనల్ స్టయిల్ స్కేల్‌రేట్:** అది నిర్ణయించాల్సింది ప్రజలు. నాకు నేనెప్పుడూ ఫుల్ మార్క్స్ ఇచ్చుకుంటుంటా
- **నాతో ఎల్లవేళలా ఉండే సౌందర్య ఉత్పత్తులు :** లిప్‌స్టిక్, మాయిశ్చరైజర్, బ్లష్
- **నా దృష్టిలో అందం అంటే :** కనెక్ట్‌కాగల సామర్థ్యం. అందమైనవారితో కనెక్ట్‌కాగల సామర్థ్యం అనేది చాలా ముఖ్యం
- **ఎల్లవేళలా సౌందర్యం :** నవ్వులో దాగుంటుంది. చెదరని నవ్వులో అందం ఎల్లవేళలా వుంటుంది. అలాగే మనం ఎప్పుడూ సీరియస్‌గా వుంటే అలసిపోతాం
- **నా చర్మ సంరక్షణ కార్యక్రమం :** మన చుట్టూ గల గాలిలో కాలుష్యం వుంటుంది. కాబట్టి ముఖాన్ని ఎక్కువసార్లు నీటితో వాష్ చేసుకుంటూ వుంటాను. పైగా ఎక్కువమేకప్ అప్లయ్‌చేస్తాం కనుక, దాన్ని క్లీన్ చేసుకోవడం అవసరం. నాణ్యమైన ఉత్పత్తులనే వాడాలి. మాయిశ్చరైజర్ బాగా అప్లయ్ చేస్తుంటా
- **నేను పాటించే గృహ చికిత్సలు :** దక్షిణాదికి చెందినదాన్నేమో, చిన్నప్పటినుంచీ ఆయిలింగ్‌కు అలవాటుపడ్డాను. నాది బాగా పొడిచర్మం. కాబట్టి ఆయిల్ రాస్తుంటాను. అలాగే శిరోజాలకు కూడా.

  మంచి కొబ్బరినూనెతో ఆయిల్‌మసాజ్ చేసుకోవడం నా అలవాటు
- **నా ఫేవరెట్ మేకప్ స్టయిల్ :** మెట్టె లిప్‌స్టిక్ ట్రెండ్ నచ్చుతుంది. తక్షణం స్టయిల్ కోషెంట్ పెరుగుతుంది
- **నేనిచ్చే బ్యూటీ సలహా :** మేకప్ అప్లయ్ చేసినప్పుడు చర్మం టెక్చర్ బావుండాలి. అతిగా మేకప్ చేసుకున్నప్పుడు మన సహజ మెరుపులు కొన్నిసార్లు తగ్గిపోతుంటాయి
- **సౌందర్య పరిరక్షణకు కావాల్సింది :** సహజ పదార్థాల ప్రాముఖ్యాన్ని తెలుసుకోవాలి. ఈ పదార్థాల్లో అత్యద్భుతమైన సౌందర్య ప్రయోజనాలుంటాయి. ప్రాచీన గృహచిట్కాలను నేను విశ్వసిస్తాను. ఇవి చర్మానికి చాలా చాలా మేలుచేస్తాయి
- **నేను షేర్ చేసుకోవాలనుకునే బ్యూటీసీక్రెట్ :** నా వ్యక్తిగత అనుభవం దృష్ట్యా కార్బోహైడ్రేట్స్ తినడం చాలా ముఖ్యం. కార్బ్స్ పవర్‌ను సహజంగా తక్కువ అంచనా వేస్తుంటాం. నేనూ అదే చేసేదాన్ని.

  అది నా చర్మంపై ప్రభావం చూపింది. మెరుపు తగ్గిపోవడం అనేది తొలి సూచన




# Russia

Russia is the largest country in the world.

Tsars ruled Russia long ago. They lived in the Kremlin.












Outside the Kremlin stands Saint Basil's Cathedral. It has nine colourful onion-shaped domes!




Tsar Nicholas II liked to give his family expensive Faberge Eggs like this one. This egg has a tiny clockwork train that moves when you wind it up!

The Hermitage is a famous art museum in Saint Petersburg. It has more than a thousand rooms!







Some people love to eat raw fish eggs, called caviar!

Siberia is a part of Russia that is very, very cold! In Siberia, you can store food in the ground. The food won't rot because it is too cold!







You can boil water for making tea in this samovar. You will need to drink lots of hot tea to keep warm in Siberia!



blini

Come celebrate the Maslenitsa festival! Russians welcome spring by eating blini, because these yellow pancakes look like the sun.

At the festival, you can ride in a troika pulled by three horses, or watch a folk dance. The dancers are pretending to be horses pulling a troika!

troika

folk dance

**Bolshoi Ballet**

Do you like ballet? Russia has one of the world's oldest and most famous ballet troupes, the Bolshoi Ballet.

Let's take the subway to the ballet performance. In the subway stations in Russia, you can find classical paintings and stained glass!

**subway station**

Yuri Gagarin was the first man to go around the Earth in his rocket, Vostok I.

**Yuri Gagarin**

**Trans-Siberian railway**

The Trans-Siberian railway is the world's longest railway. Crossing Russia takes six days!

**Matryoshka dolls**

You could bring your Matryoshka dolls to play with on the train. Each doll has many smaller dolls inside.

**Peter the Great**

PETRO ...
CATHARINA ...

If you visit Saint Petersburg, you can see this famous statue of Tsar Peter the Great, who built the city.

If you look out the train window, you can see Lake Baikal, the world's deepest lake. It is over 1 kilometre deep!

**Lake Baikal**

# మీరు ఒంటరిగా ఉంటున్నారా




ఇటీవలి కాలంలో ఒంటరిగా ఉంటున్న పెద్దలు చాలామంది వున్నారు. కట్టుకున్నవారు కాలంచెల్లి, కన్నవారు సుదూర ప్రాంతాలకు తరలివెళ్ళినతర్వాత ఇంటిలో ఒంటరిగా మిగిలిపోతున్నారు.

ఆ ఒంటరితనం ప్రభావం కొందరి ముఖంలో స్పష్టంగా కనిపిస్తుంది. అటువంటి పరిస్థితులనే ఎదుర్కొంటున్నప్పటికీ ఎటువంటి ఒంటరితనం అనుభవించక హాయిగా నల్గురితో కలిసిపోయి నవ్వుతూ, నవ్విస్తూ తిరిగేవారున్నారు.అవసరంలో ఉన్న వారిని ఆదుకునేందుకు ముందుంటారు.

ఒంటరిగా మిగిలిపోయామని బాధపడేవారికి, ఒంటరివారిగా మారినా ఒంటరితనం అనుభవించే వారికి మధ్యవున్న తేడా వారి మానసికస్థితి మాత్రమే. తాము ఒంటరివాళ్ళమనుకునేవారు నిజంగానే ఒంటరివారవుతారు. నేను ఒంటరిని కాదు, చుట్టూ వున్న వారంతా నా వాళ్ళే అనుకుని, వారితో సత్సంబంధాలను కల్గివున్నవారు ఎన్నటికి ఒంటరివాళ్ళు కాదు.

'ఒంటరితనం'అనేది మానసికస్థితి. కాబట్టి దానిని ముందుగా అర్థంచేసుకోవాలి. ఒంటరితనం అనేది ఈ రోజుల్లో ఏర్పడాల్సిన అవసరం లేదు.

ఎప్పుడు కావాలంటే అప్పుడు మాట్లాడుకునే, చూసుకునే అవకాశం సాంకేతికంగా సాధ్యమైంది. ఎంతదూరంలో వున్నవారినైనా కళ్ళ ఎదుట తెరమీద చూస్తూ, హాయిగా మాట్లాడుకోవచ్చు. భావోద్వేగాలను పంచుకోగలరు. అటువంటి అవకాశం అంతకు ముందు తరాలకు లేదు.

ఫోన్ అన్ని ఇళ్ళల్లో ఉండేదికాదు.ట్రంక్‌కాల్ బుక్ చేసి ఆ ఫోన్‌కాల్‌కోసం ఎదురుచూడాల్సివచ్చేది. ఫోన్ చేసిన సమయానికి అవతలివారు ఫోన్‌కి అందుబాటులో వుంటారన్న గ్యారెంటీ లేదు.

ఆ రోజుల్లో ఒకరి గురించి మరొకరికి తెలియచేసేందుకున్న ఏకైక సాధనం ఉత్తరం. అది రాసి పడేస్తే ఎన్నాళ్ళకు చేరుతుందో తెలియదు. తిరిగి సమాధానం రావటానికి మరెంతోకాలం పట్టేది.

## కారణాలు అనేకం

అయినా ఎవరూ ఒంటరితనంతో బాధపడలేదు. తమ చుట్టూ వున్నవారంతా తమవారేగా అని బంధుత్వాలు, మాటలు కలుపుకుని వుండేది సమాజంలో. ప్రతిక్షణం ఎవరో ఒకరు పలకరించేవారు. అవి కూడా ఆత్మీయ పలుకులు. అందువలన ఆ తరంవారికి ఒంటరితనపు ఇబ్బందులు బహుతక్కువ.

కాని ఇప్పటిసమస్య వేరు. ఎవరితో పడితే వారితో కలవరు. ప్రతిదానికి స్థాయి, అవసరాలు వంటివన్నీ చూసుకుంటారు. పైగా తన కోణం నుండి అవతలివారు ఎలా వున్నది అంచనావేస్తారు.

తన అంచనాకు అటుఇటుగా వున్నవారెవరితోనూ మాటలకు ఇష్టపడరు. అలా తమంత తాము ఒక్కొక్కరిని దూరంగా పెట్టి ఒంటరిగా మిగిలిపోతున్నారు. అది కోరి ఎంచుకున్న ఒంటరితనమే కాబట్టి హాయిగా వుండాలికదా! అయినా ఎందుకు హాయిగా, ఒంటరిగా వుండలేకపోతున్నారు!

* ఎవరూ ఒంటరి కాదు
* మానసికస్థితి అలా అనిపిస్తుంది
* ఒంటరి అవటానికి కారణాలు
* బయటపడే మార్గాలున్నాయి

ఒంటరితనం అనేదానికి తగినట్టుగా మానవుడి పరిణామం జరగలేదు. మనిషి సామాజిక జీవి. ఎప్పుడు ఎవరో ఒకరితో సంబంధాలుకల్గి, గుంపులో, గుంపుతో జీవించాల్సిందే.

ఏ కారణం చేతనైనా మందలో నుండి వేరుపడిన జీవి ఎంత గందరగోళానికిగురవుతుందో అదేవిధంగా మనిషికూడా ఒంటరివాడైనపుడు అన్ని రకాల ఇబ్బందులకు గురవుతారు. అందుకే నేరం చేసినవ్యక్తిని ఒంటరిగదిలో ఖైదు చేస్తారు. ఇది నేడు కొత్తగా కనుక్కున్న శిక్షావిధానం కాదు.

రాజరికపు రోజుల్లోనే తోడులేనివిధంగా బందీని చేసి మనిషిని మానసికంగా బలహీనుడిని చేసేవారు. 'ద్వీపాంతర శిక్ష' అనేది అలా పరిణమించినదే.

ఒంటరితనంలోకి తమంత తామే నెట్టుకుంటారు కొందరు. స్నేహితులతో ఎలా మెలగాలో తెలియదు. పరిచయస్థులందరిని పోటీదారులుగా చూస్తారు.

ఇటువంటి మనస్తత్వం విద్యార్థిదశలోనే ఏర్పడి, ఇతరుల గెలుపును అంగీకరించలేని, ఎంత దగ్గరి బంధువు ఎదుగుదలను ఆస్వాదించలేనివారు తమ ఓటమి భారం నుండి బయటపడేందుకు వారందరికీ దూరంగా జరుగుతారు. వారినుండి తాము వేస్తున్న వెనకడుగు తమను ఒంటరిని చేస్తున్నదని ఆ సమయంలో వారికి తెలియదు.

వివాహం తర్వాత కొందరు దంపతులు తాము తప్పించి మరొకరు తమ మధ్యకు రావటానికి వీలులేదనుకుంటారు. బంధువులను ఇంటికి రానివ్వరు. స్నేహితులతో కలవరు. వెరసి వారిద్దరికంటూ కొత్త లోకం నిర్మించుకుని అందులోనే విహరిస్తుంటారు. అటువంటి లోకం స్థిరంగా నిలిస్తే ఫర్వాలేదు.

ఏదైనా కారణంతో ఒకరు దూరమైతే ఏర్పడే ఒంటరితనం భయానకం. జీవితంలో హఠాత్తుగా ఏర్పడిన వెలితిని తట్టుకోవటం చాలా కష్టం.

పిల్లలు ఎదిగి ఇల్లు వదిలివెళ్ళిపోయినతరువాత చాలామంది దంపతులు ఒకలాంటి డిప్రెషన్‌లోకి వెళుతుంటారు. ఆ సమయంలో స్నేహితులు, బంధువుల అవసరం వారికి ఏర్పడుతుంది. కాని వారంతా అప్పటికీ ఈ దంపతులకు దూరమైవుంటారు.

బంధువులు, మిత్రులు వున్నా వారితో సరయిన మానసికబంధం వుండదు. చుట్టూ సంపద వున్నా వాటిని అనుభవించలేని ఒంటరితనమే యువరాణి డయానా మరణానికి కారణం. పలువురు సినీతారల ఆత్మహత్యల వెనకున్నదీ ఒంటరితనపు ఇబ్బందే.

## వదిలించుకోవాలి

ఒంటరితనం అనే ఇబ్బందిని ప్రారంభదశలోనే గుర్తించినవారు అందులోనుండి బయటపడగలుగుతారు. తాము ఒంటరివారమయ్యామన్న వాస్తవాన్ని గుర్తించటంతో సగం సమస్య పరిష్కారమవుతుంది. ఒంటరితనం అనేది ఒక భావన మాత్రమే.

ఒంటరితనం వాస్తవం కాదు. ఆ విషయం అర్థం చేసుకుని ఒంటరితనం గురించి అతిగా స్పందించటం ఆపాలి. తానేదో ఒంటరినని, ఆ ఒంటరితనంలోకి నెట్టబడ్డానన్న బాధ ఎవరిలో వుంటుందో వారు ఆ ఒంటరితనంలో నుండి బయటకు రాలేరు. కాబట్టి ముందుగా ఆలోచనల్లో మార్పు సాధించాలి.

ఆ మార్పును తీసుకురాగలిగినది సాటివారు. ప్రతి ఒక్కరిలో ఏవో కొన్ని ఇష్టాలు, అయిష్టాలుంటాయి.. అటువంటి భావాలు కల్గినవారితో స్నేహం మొదలుపెట్టండి.

నడక, తోటపని, సామాజికసేవ, పెట్టుబడులు పెట్టడం. ఇలా ఏదైనా సరే మీకున్న ఇష్టాలను ఇతరులలో వెతికివారితో మాటలు కలపటం అవసరం. అటువంటివారితో మాట్లాడే సమయంలో అహంకార అంశం అడ్డుకాకూడదు.

నా మాటే నెగ్గాలన్న పట్టుదల వుండకూడదు. మాట్లాడటం తగ్గించి, వినటం పెంచినవారు ఎవరూ ఒంటరివారవరు. వినేవారిని ఎవరైనా ఇష్టపడతారు. శ్రోతల కోసం మనుషులు వెతుక్కుంటారు. అలా కొంతకాలం శ్రోతగా వ్యవహరించగలిగితే ఇక ఆ తర్వాత స్నేహాలు మరింత ముందు కెళ్తాయి. ఇటువంటి మాటలు, కబుర్లవలన ఇతరుల అవసరాలను గుర్తించగలుగుతారు. వారి మనోభావాల్ని అర్థం చేసుకోటం సులభమవుతుంది. తనచుట్టూ అందరూ తిరగాలి అన్న ఆలోచన ఆగిపోయి, అందరితో కలిసి అడుగు వేయటమనే స్థితికి చేరితే ఒంటరితనం మాయమవుతుంది. బంధువులు, స్నేహితులు ఎవరైనా వారితో వున్న విభేదాల గురించి, భిన్న లక్షణాల గురించిన ఆలోచనలు అధికంగా చేసేవారు ఒంటరిగానే మిగిలిపోతారు. వారితో వున్న ఇష్టమయిన అంశాలమీదకు దృష్టిని మళ్ళించి, మాటలు వాటిమీద వుంచగలిగిన వారే మానసిక ఒంటరితనం ఫీలవరు.

స్వతంత్రంగా వ్యవహరించగలగటం ఒక దశలో చాలా గొప్పవిషయంగా అనిపిస్తుంది. చాలామందికి లేని ఒక గొప్పలక్షణం తనలో వుందన్న భావం కూడా కొందరి జీవితంలో ఒంటరితనం తెస్తుంది.

## గొప్ప లక్షణం

స్వతంత్రంగా వ్యవహరిస్తూ ఎవరి సహాయంతీసుకోరు, ఎవరికీ సహాయం అందించరు. ఫలితంగా పదిమందితో కలిసి పనిచేయగలిగిన మనస్తత్వంలోపిస్తుంది. స్వతంత్రంగా వ్యవహరించేవారిలో బాధ్యత తీసుకునే గుణముంటుంది.

దేనికీ కూడా తొణకరు, బెణకరు. రెండు మూడు ముందస్తు ఆలోచనలు కలిగివుంటారు. వ్యక్తులను ప్రేమిస్తారు. అయితే మనసులోని ఆనందం, ప్రేమ వంటివి సరిగా అవతలివారికి తెలియచెప్పలేకపోతారు. వారి స్వతంత్రత వారి శరీర కదలికలో ప్రతిక్షణం తెలియకుండానే ప్రదర్శిస్తారు. ఫలితంగా ఇతరులు వారికి దగ్గరవరు. ఇష్టపడిన మనుషులు దూరమవటం తట్టుకోలేని ఒంటరితనాన్ని తెస్తుంది.

ఆధ్యాత్మికత ఒంటరితనం గురించి చెపుతుంది. మనుషులు, ఋషులు అడవుల్లో, కొండగుహాలలో ఒంటరిగా తపస్సు చేసుకుంటూ గడిపిన వైనం మన పురాణాలలో కనిపిస్తుంది. కాని వారిది నిజంగా ఒంటరితనం అనగలమా! కాదు వారు భగవంతునితో అనుబంధం పెంచుకున్నవారు. ఆధ్యాత్మిక ఒంటరితనం గొప్ప వెలుగునిస్తుంది ముఖంలో.

ఆ వెలుగుకి క్రూరమృగాలు కూడా లొంగిపోతాయి ఆశ్రమాలముందు పులులు కూడా పిల్లులులాగా వ్యవహరిస్తాయి. అటువంటి స్థాయికి అందరూ చేరలేరు. తమ చుట్టూ వున్న బంధాలు వదులుకోలేక కేవలం తమ ఒంటరితనాన్ని సమర్థించుకునేందుకు మునులు, ఋషులను ఉదాహరణగా చూడటం అనేది అర్థంలేని విషయం.

అసలు ఆధ్యాత్మిక చింతనాపరులు ఒంటరివారు కానే కాదు. వారంతా లోకంగురించి ఆలోచించగల్గిన ఉన్నత మానసిక స్థితికి చేరినవారు. ఏ వయస్సయినా హాబీలకు అనువైనదే. ఏ వయసుకు తగిన హాబీ ఆ వయసులో అలవాటు చేసుకోగలరు. తగిన హాబీలో పడితే వారికి కాలం ఎలా గడిచిపోతుందో తెలియకుండా ముందుకు వెళతారు.

సరైన హాబీ వున్నప్పుడు ఒంటరితనం వెంటాడదు. సామాజికసేవ, ఆధ్యాత్మిక చింతనాపరుల బృందాలలో చేరటం ఒంటరితనానికి విరుగుడు. సామాజికసేవ అంశం ఒక కొత్త దృక్పథాన్ని ఇస్తుంది. మరొకరిని ఆదుకోగలిగామన్న తృప్తి కొత్తశక్తినిస్తుంది.

తమ జీవితానికి కొత్త లక్ష్యం ఏర్పరుచుకోగల్గుతారు. ఆధ్యాత్మికచింతన మానసిక ప్రశాంతతనిస్తుంది. ధ్యానం, దైవసేవలు రెండూ ఒంటరితనాన్ని పారద్రోలగలిగినవే. ఒంటరితనం నుండి బైటపడాలన్న ఆలోచన, ఒంటరితనమనేది మానసికంగా ఏర్పడిన ఇబ్బందనేదానికి జతకూడితే సమస్యను అధిగమించటం సులభం.

శ్రీహర్ష


Courtesy: GRUHASHOBHA



# నేరనిర్ణయం

విశాలదేశాన్ని ఏలే శతాననమహారాజు తనదేశంలో న్యాయవిచారణలో సంపూర్ణమయిన న్యాయం జరగాలన్న ఆశయం గలవాడు. ఈ మాట ఆయన తనమంత్రి అయిన బృహస్మృతితో అంటే, అదిఅసాధ్య మని బృహస్మృతి ఆయనకు స్పష్టం చేసేశాడు.

ఆ కాలంలో రఘునాథుడు అనే గొప్ప శాస్త్రవేత్త ఉండేవాడు. ఒకసారి ఆ రఘునాథుడు విశాల దేశానికి వచ్చి, శతాననుణ్ణి కల్సుకుని ఒక పెట్టె ఇచ్చాడు. ఆ పెట్టెలో ఒక చిన్న యంత్రం ఉన్నది.

ఆ యంత్రం గురించి రఘునాథుడు శతానన మహారాజుతో ఇలా చెప్పాడు :

"నేను చాలా ప్రయోగాలు చేసి ఈ యంత్రాన్ని తయారుచేశాను. ఇది మనిషి శరీరంలోని కంపనల ఆధారంతో పనిచేస్తుంది. చూడండి. ఇందులో ఒక ముల్లు వున్నది. సున్నా నుంచి పదిదాకా అంకెలు ఉన్నాయి. ఎవరన్నా దీనిని ధరించి మాట్లాడేటప్పుడు ఈ ముల్లు నాలుగు అంకె దాటివెళ్ళదు. అలా వెళ్ళిన పక్షంలో ఆ మనిషి అబద్ధమాడుతున్నాడన్నమాట.

దీని సహాయంతో న్యాయాధికారి, దోషిగా ఎంచబడినవాడు నిజంచెబుతున్నాడో, అబద్ధమే చెబుతున్నాడో తేలికగా నిర్ణయించవచ్చు" ఈ మాట విని మంత్రి అయిన బృహస్మృతి-

"ఆర్యా, నేరం మనస్తత్వానికి సంబంధించినది. ఈ యంత్రం కేవలమూ భౌతిక శరీరంలో కలిగే మార్పులను మాత్రమే కొలుస్తుంది. అందుచేత దీని సహాయంతో నిర్దుష్టంగా నేరనిర్ణయం సాధ్యపడదేమోనని నా అనుమానం" అన్నాడు.



రఘునాథుడు చిరునవ్వు నవ్వి, "మనస్సు శరీరంలో కలిగించే అతిసూక్ష్మశరీరకంపనలను సైతం ఈయంత్రం కనిపెట్టగలదు. నేరం మనస్సుకు సంబంధించినదే అయినా నేరస్తుడి మనస్సుకు అనుగుణంగా అతని శరీరంలో కంపనలు కలుగుతాయి.

అందుచేత, నిర్దుష్టమయిన నేర నిర్ణయానికి ఈ యంత్రంపై పూర్తిగా ఆధారపడవచ్చును. కావాలంటే మీరు ఈ యంత్రాన్ని పరీక్షించి చూడండి" అన్నాడు.

వెంటనే రాజూ, మంత్రీ కూడా ఆ యంత్రాన్ని పరీక్షించి చూశారు.

రాజు అబద్ధమాడగానే ముల్లు ఏడు అంకెమీదికి పోయింది.

మంత్రి అబద్ధం ఆడినప్పుడు ఐదు అంకెమీదికి పోయింది.

"అద్భుతం!" అన్నాడు రాజు. మంత్రిమాత్రం, "రాజుగారికి ఏడు అంకె చూపించిన ముల్లు, నాకు అయిదు అంకెమాత్రమే చూపించింది. మరొకరికి రెండు అంకెమాత్రం చూపదని ఏమిటి?" అన్నాడు.



రఘునాథుడు చిరాకుపడి, "ఈ యంత్రంగురించి నాకు ఎలాటి సందేహమూ లేదు. కావాలంటే మీరు ఎన్ని పరీక్షలైనా చేసుకోవచ్చు" అన్నాడు.

రాజు తన మంత్రిని మందలించి, రఘునాథుణ్ణి శాంతపరచి, "నాకు ఈ యంత్రముపైన పూర్తి విశ్వాసం కుదిరింది. దీని ధర్మాన ఇకముందు నా రాజ్యంలో నిర్దోషులకు ఎలాంటి భయమూ ఉండదు. న్యాయనిర్ణయం కూడా కాలయాపన లేకుండా జరిగిపోతుంది" అన్నాడు.

రఘునాథుడు సన్మానాలు పొంది వెళ్ళిపోయాక, రాజు ఆ యంత్రాన్ని ఎన్నో పరీక్షలకు పెట్టాడు. అది నమ్మదగినదేనని రుజువయింది. త్వరలోనే రాజు నేరవిచారణ జరిపినప్పుడల్లా పూర్తిగా ఆ యంత్రం మీదనే ఆధారపడసాగాడు. పూర్తిగా ఆ యంత్రం మీదనే ఆధారపడటం అంతమంచిది కాదని మంత్రి హెచ్చరించినా కూడా రాజు వినిపించుకోలేదు.

ఇలా ఉండగా, ఒక గ్రామంలో సిద్ధయ్య అనే ఒక రైతు, మిట్టమధ్యాహ్నంవేళ, నలుగురూ నడిచే రాచబాటలో, నారయ్య అనే వ్యాపారిని దారుణంగా హత్య చేశాడు. వెంటనే పదిమందీ చేరి సిద్ధయ్యను పట్టుకుని న్యాయస్థానానికి తీసుకువచ్చారు. సిద్ధయ్య ఒకంతట న్యాయస్థానానికి రావటానికి ఒప్పుకోక, పెనుగులాడుతూ, తాను 'ఏమీ నేరం' చెయ్యలేదని చెప్పాడు.

సిద్ధయ్యను తెచ్చి రాజు ఎదుట నిలబెట్టగానే, రాజాజ్ఞ ప్రకారం ఇద్దరు భటులు సిద్ధయ్య రెండు చేతులూ పట్టుకున్నారు.

మూడో భటుడు సిద్ధయ్య మెడలోయంత్రం తగిలించాడు. "నువ్వు నేరం చేశావా, లేదా?" అని రాజు సిద్ధయ్యను అడిగాడు.

"లేదు" అన్నాడు సిద్ధయ్య.

భటుడు యంత్రంలోని ముల్లుకేసి చూసి, అది ఒకటి అంకెమీద ఉన్నట్టు చెప్పాడు.

"అతన్ని విడిచిపెట్టండి" అన్నాడు మహారాజు.

అతను హత్యచెయ్యటం కళ్ళారా చూసిన గ్రామస్తులంతా హాహాకారాలుచేశారు. ఈ సంగతి తెలుసుకుని రాజు సిద్ధయ్యను మళ్ళీ, మళ్ళీ అదేప్రశ్న వేశాడు. కాని ముల్లు ఒకటిమీదనే ఉండిపోయింది. ఇదంతా చూసి బృహస్మృతి ఒక క్షణమాలోచించి "నువ్వు హత్య చేశావా, లేదా?" అని సిద్ధయ్యను అడిగాడు.

"చేశాను" అన్నాడు సిద్ధయ్య.

రాజు ఆశ్చర్యానికి మేరలేదు. సిద్ధయ్య హత్య చేశాడు. కాని నేరం చెయ్యలేదని యంత్రం చెబుతున్నది! రెండూ నిజమెలా అవుతాయి?

"హత్య చేస్తే నువ్వు నేరం చేసినట్టే కదా?" అని రాజు సిద్ధయ్యను అడిగాడు. "వాడు నా పెళ్ళాం, బిడ్డల్ని హత్య చేసిన సంగతి నాకొక్కడికే తెలుసు. అందుకే వాణ్ణి నేను చంపాను. అది నేరం ఎందుకవుతుంది?" అని సిద్ధయ్య రాజుతో అన్నాడు.

బృహస్మృతి రాజుకేసి చూసి నవ్వి, "యంత్రం అసత్యమాడలేదు. తాను చేసిన హత్య నేరంకాదని సిద్ధయ్య నమ్ముతున్నాడు. అందుచేత యంత్రం అతను నేరం చెయ్యలేదని చెప్పింది. అతను శిక్షార్హుడో, కాదో చెప్పవలసింది శిక్షాస్మృతి. ఈ యంత్రం కాదు" అన్నాడు.

రాజుకు తన పొరపాటు తెలిసివచ్చింది. యంత్రానికున్న హద్దులు గ్రహించి, ఆయన సిద్ధయ్యకు తగిన శిక్ష ఇచ్చినతర్వాత యంత్రం ఆధారంతో తీర్పులు చెప్పటం మానుకున్నాడు.

వసుంధర

# పిల్లులు చేసే మేలు





Courtesy : INFINITHOUGHTS

మనుషులకు మంచి మిత్రులు పెంపుడు జంతువులు. ఒకప్పుడు అన్ని జంతువులు అడవి జంతువులే. మనిషి కూడా ఒకనాడు ఆటవిక దశలో వున్నవాడే. ప్రకృతిలోని వింతలు,విశేషాలు అర్థంచేసుకుని మానవుడు అడవి వదిలి క్రమంగా బయటకు వస్తూ, తనతోపాటు కొన్ని జంతువులను వెంటతీసుకుని వచ్చాడు.

క్రమంగా అవి మనిషికి మచ్చికయ్యాయి. మనిషి మీద ఆ జంతువులు ఎంతగా ఆధారపడ్డాయంటేఅతడి సహాయంలేకుండా విడిగా బతకలేని పరిస్థితి.

ఆవులు, గేదెలు, కుక్కలు, కోళ్ళు, పిల్లులు వరుసగా పెంపుడు జంతువులు అయ్యాయి. కుక్కలు, పిల్లులు ఇళ్ళకు దూరంగా బతకగలుగుతున్నా మనిషిని ఆధారంచేసుకునే బతుకుతున్నాయి.

మనిషి జీవితంలో మరో మలుపు పట్టణీకరణం. పట్టణాలు, నగరాలు ఏర్పడినతర్వాత పెంపుడుజంతువులు అతనికి భారంగా మారాయి. గేదెలు, ఆవులు ఇళ్ళలో పెంచుకునే మార్గంలేదు.కుక్కలు, పిల్లులు వంటివి కొంతకాలం ఇళ్ళలో వుంచుకున్నారు.

కాని ఇళ్ళు ఇరుకై, అపార్ట్‌మెంట్‌ల సంస్కృతి పెరిగి ఇప్పుడు చిన్న చిన్న జంతువులకు ఇంటిలో స్థానం లేకుండాపోయింది. ఎంత వద్దంటున్నా పిల్లులు మనుషులను వదలటంలేదు.అక్కడక్కడే ఇళ్ళమధ్యే తిరుగుతున్నాయి. తరిమివేయబడుతున్నాయి. అప్పుడప్పుడు రోడ్డుమీద ప్రమాదాలకు గురవుతున్నాయి. అటువంటి పిల్లులను రక్షించే బాధ్యతను ముంబయిలోని సినీ ఫోటోగ్రాఫర్ మృదు ఖోస్లా చేపట్టింది.

ఆమె నిర్వహించే సైఫర్ స్టూడియోకి అనుబంధంగా మ్రిదు పిల్లుల రక్షణ కేంద్రం మొదలు పెట్టింది. ప్రస్తుతం అందులో 40 పిల్లులు రక్షణ పొందుతున్నాయి. ఇవన్నీ ఒకప్పుడు వీధుల్లో తిరిగినవి. మ్రిదు ఉద్దేశ్యం జంతువుల్ని ప్రేమించే వ్యక్తులు, కళాకారులను ఒక వేదికమీదికి తీసుకురావటం.

పిల్లులను అక్కడికి తీసుకువచ్చి రక్షించటమే కాదు అక్కడున్న పిల్లులను ఎవరయితే తీసుకువెళ్ళి పెంచుకుంటామంటే ఇస్తారు. అలా 200ల మంది దత్తతకు తీసుకున్నారు. మరొక పథకం ప్రకారం ఎవరైనా ఒక పిల్లిని దత్తత తీసుకోవచ్చు.

పిల్లులను రక్షిత కేంద్రంలోనే వుంచుతారు. కాని వాటికి అవసరమైన ఖర్చును భరిస్తారు. పెంపుడు జంతువులు ఎంతో మేలుచేస్తాయనేది అందరికీ తెలిసినదే. మానసిక ఇబ్బందులను తొలగించగలిగిన శక్తి పెంపుడు జంతువులకు వుందని మానసిక శాస్త్రవేత్తలు అంటున్నారు. పెంపుడు జంతువులతో సమయం గడపటం అనేది చికిత్సలో భాగం చేస్తున్నారు.

మానసిక అనారోగ్యాలకే కాదు, ఇతరత్రాగాయాలై ఆసుపత్రిపాలైనవారికి, కోలుకుంటున్న సమయంలో పక్కన పెంపుడు జంతువు వుంటే త్వరగా సాధారణ ఆరోగ్యం పొందుతారన్నది బలంగా వినిపిస్తున్న అభిప్రాయం. నేటివరకు పెంపుడు కుక్కలమీదనే అధ్యయనం జరిగింది. ఆదుర్దాకి గురవుతున్నవారు, అధిక రక్తపోటుతో బాధపడేవారు, ఒత్తిడికి గురయ్యేవారు పెంపుడు కుక్కలతో గడపటంద్వారా ఆ వ్యతిరేక ఇబ్బందులనుండి బయటపడటం ధృవీకరించబడింది. ఒంటరితనంనుండి బయటపడేయగలిగిన శక్తి పెంపుడు కుక్కలకుంది.



Courtesy : LIFE POSITIVE

పెంపుడు జంతువులతో సమయం గడిపినవారిలో ప్రశాంతత అందించే హార్మోన్ అధికంగా విడుదలవుతుంది. దానితో వారి రక్తపోటు తగ్గుతుంది,ఆదుర్దా ఆగిపోతుంది. ఇతర మనుషులతో కలిసివుండటానికి, సమయం గడపటానికి ఇబ్బందిపడేవారికి పెంపుడు జంతువులతో కులాసాగా సమయం గడిపితే మంచి ఫలితముంటుంది.

ఇటువంటి మేలు కుక్కలే కాదు, పిల్లులు చేస్తాయన్నది మ్రిదు ఖోస్లా ఆలోచన. అందుకే ఆమె పిల్లులమీద దృష్టిపెట్టింది. తన రక్షిత కేంద్రంలోకి తీసుకునే పిల్లుల విషయంలో చాలా జాగ్రత్తలు వహిస్తారు. అవి ఎక్కడనుండి తెస్తున్నారు అనేది తమ సిబ్బందిద్వారా విచారణ జరిపిస్తారు.

బాగా పరిచయం వున్నవారిద్వారా వచ్చిన పిల్లులను మాత్రమే స్వీకరిస్తారు.అలా వారు దత్తత తీసుకున్న పిల్లుల విషయంలో పూర్తి శ్రద్ధవహించే సిబ్బంది ఆ కేంద్రంలో పనిచేస్తున్నారు.

కేవలం జీతంకోసం పనిచెయ్యటానికే ఆ కేంద్రంలోకి వచ్చిన సిబ్బంది ఇప్పుడు జంతువులమీద ప్రేమ పెరిగిందంటున్నారు.

జంతువులను అర్థంచేసుకుంటున్నాం. వాటి అవసరాలను సరిగా చూడగల్గుతున్నాం అని చెప్పారు అక్కడ పనిచేసే స్వచ్ఛంద సేవకులు. ఇప్పుడు చాలా మంది ఔత్సాహికులు ఆ సంస్థతో కలిసి పనిచేస్తున్నారు. వారిలో పశువుల వైద్యులు వున్నారు.

వీరంతా కలిసి జంతు ప్రేమమీద అవగాహన కల్పిస్తున్నారు. గత అయిదు సంవత్సరాలుగా ప్రతి పదిహేను రోజులకు ఒక్కసారి ఒక జంతు శిబిరం నిర్వహిస్తారు. జంతువుల ప్రవర్తన, వాటికిసంబంధించి తీసుకోవాల్సిన జాగ్రత్తలు వివరిస్తారు.

మనదేశంలో జంతువులపట్ల శ్రద్ధ తక్కువగా వుందంటారు ఆ సంస్థవారు. నిజమైన ప్రేమను పంచగల్గేవి జంతువులే అంటారు జంతుప్రేమికులు. మనలోని అభద్రతను పోగొడతాయి. వెన్నంటి వుంటాయి.

మనుషులకు చేసిన మేలు గుర్తుండదు. కాని జంతువులు అలా కాదు. చేసిన కొద్ది సహాయానికే మనల్ని వెన్నంటి వుంటాయి. అందుకే ప్రతి ఒక్కరు ఒక పెంపుడుజంతువును ఇంటిలో పెట్టుకోవాలి. పిల్లులతో ఇబ్బందులు తక్కువ. అందుకని వాటిని స్వాగతించమన్న ప్రచారం బొంబాయిలోని ఈ సంస్థ చేస్తున్నది.

# SEX AND సైకాలజీ



డా॥జి. సమరం

Your Body's way of telling you that you hit her spot



ఎ.ఎమ్. గుడివాడ

*నా వయస్సు 35 సంవత్సరాలు. నేను అతిగా సిగరెట్లు తాగుతాను. పూర్వకాలం నాకు సెక్స్ సామర్థ్యం చాలా ఎక్కువగా ఉండేది. రోజుకి 5-6 సార్లు కూడా సెక్స్‌లో పాల్గొనేవాడిని.*

*కొంతకాలంగా నిదానంగా సెక్స్ తగ్గిపోతూ వచ్చింది. ఇప్పుడు సెక్స్‌లో పాల్గొనడం అరుదై పోయింది. ఇంతా చేస్తే నా వయస్సు 35 సంవత్సరాలే కదా. ఈ వయస్సుకే సెక్స్ తగ్గిపోతుందా? లేక నా ధూమపానం అలవాటే సెక్స్‌ని దెబ్బతీసిందా?*

ధూమపానంఅలవాటు సెక్స్‌ని తప్పకుండా దెబ్బ తీస్తుంది. సిగరెట్లలో ఉండే పొగాకు దీనికంతటికీ మూలం. పొగాకులో నికోటిన్ అనేది ఉంటుంది.

నికోటిన్ రక్తనాళాల్లోకి చేరి రక్తనాళాల గోడలని మరింతగా దెబ్బతీస్తుంది.

రక్తనాళాల గోడలు దళసరి అయిపోయి రక్తనాళాల పనితీరుని దెబ్బతీస్తుంది. రక్తనాళాలు దెబ్బ తినడంతో సెక్స్ కోరిక ఉన్నప్పటికీ తగినంత రక్తం పురుషాంగంలోకి చేరదు.

దాంతో సెక్స్ చేయాలనుకున్నప్పటికీ అంగం మెత్తగానే ఉండిపోతుంది. ఇప్పుడు మీ పరిస్థితి ఇదే. మీరు ధూమపానం పూర్తిగా మానేయండి. డాక్టరుకి చూపించి మందులు వాడండి. కొంతకాలానికైనా మీలో సెక్స్ సామర్థ్యం కొంత పెంపొందవచ్చు.

డి.ఎల్. విశాఖపట్టణం

*ఇటీవలనే నాకు పెళ్ళి అయింది. మొదటి రాత్రి సెక్స్‌లో పాల్గొన్నప్పుడు పురుషాంగం విపరీతంగా నొప్పి చేసింది. రక్తం కూడా కారింది. పురుషాంగం లోపల 3-4 చోట్ల చర్మం తెగింది.*

*దాంతో ఆ తర్వాత అంగం స్తంభించనే లేదు. నాకు ఏమైనా నరాలు తెగిపోయాయా? నేను సంసార సుఖానికి పనికిరాకుండా పోయానా? నాకు చాలా భయంగా ఉంది. నన్నేం చేయమంటారు?*

కొందరు మగవాళ్ళకి తొలి కలయికల్లో ఫ్రెన్యులమ్ తెగి రక్తం కారడం, నొప్పి చేయడం జరుగుతుంది. మరికొందరు మగవాళ్ళకి పురుషాంగ పూర్వ చర్మం టైట్‌గా ఉండి సెక్స్‌లో పాల్గొన్నప్పుడు చిట్లి రక్తంకారడం, నొప్పిచేయడం ఉంటుంది.

ఇలా ఫ్రెన్యులం, చర్మం చిట్లినప్పుడు నాలుగైదు రోజులు సెక్స్‌లో పాల్గొనలేకపోతారు. పురుషాంగ పూర్వ చర్మం బాగా టైట్‌గా ఉంటే సున్తీ ఆపరేషను కూడా చేయవలసివస్తుంది.

ఏది ఏమైనప్పటికీ సెక్స్‌కి పనికిరాకుండా పోవడం జరగదు. కారణంబట్టి చికిత్సచేస్తే అన్ని బాధలు తొలగిపోతాయి. కొద్దిరోజుల్లోనే మామూలు అయిపోతారు. అంతేగాని నరాలు తెగడం, సెక్స్‌కి పనికి రాకపోవడం అనేది జరగదు.

హెచ్.ఆర్. రాజోలు

*దాంపత్యంలో పలుమార్లు పాల్గొంటేనే గర్భం వస్తుందా? గర్భం రావాలంటే రోజులో ఎన్నిసార్లు మేము సెక్స్‌లో పాల్గొనాలి?*

స్త్రీలో నెలకి ఒక్కసారే అండం విడుదల అవుతుంది. ప్రతి నెల సక్రమంగా మెన్సెస్ వచ్చే స్త్రీలో నెల మధ్యలో అండం విడుదలవుతుంది. ఆ రోజుల్లో సెక్స్‌లో పాల్గొంటేనే గర్భం వస్తుంది.

అంతేగాని, ఎక్కువసార్లు సెక్స్‌లో పాల్గొనడం అనేది ముఖ్యం కాదు. అండం విడుదల రోజుల్లో ఒక్కసారి పాల్గొన్నా గర్భం వస్తుంది.

అండం విడుదలలేనప్పుడు ఎన్నిసార్లు సెక్స్‌లో పాల్గొన్నప్పటికీ ప్రయోజనం ఉండదు.

జె.కె. తెనాలి

*కొందరు స్త్రీలు ప్రేమ, పెళ్ళి, సెక్స్ అంటేనే అసహ్యించుకుంటారు. ఇటువంటి వారిని తెలియకుండా పెళ్ళి చేసుకుంటే భర్త పరిస్థితి ఏమిటి? భర్త సుఖపడగలడా, లేడా? సంసారం ఉంటుందా, ఉండదా?*

## కొత్తగా మొదలుపెట్టాలి

శరీరం చిత్రమైనది. మనసు మరింత చిత్రమైనది. అన్నింటిని కావాలనుకుంటుంది. అధికమైతే తట్టుకోలేదు. ఇష్టంగావుందని ఎక్కువగా తింటే కడుపులో ఇబ్బంది వస్తుంది. బాగుందని ఒకే రకమైన రుచిని తింటే మొహం మొత్తుతుంది.

ఇటువంటి పరిస్థితిలో శరీరం తిరిగి సాధారణ స్థితికి రావాలంటే వైద్యం సూచించేది ఒకటే మార్గం. అతిగా తినటం వల్ల ఇబ్బంది అయితే కొంతకాలం ఏదీ తినకండి. ఉపవాసం చెయ్యండి.

లోపలికి చేరిన విషతుల్యాలు బయటకుపోతాయి. ఎంత ఇష్టమయిన పదార్థమయినా కొన్నాళ్ళు దానిని దూరంగా ఉంచండి. ఆలా చెయ్యకపోతే దానిమీద మక్కువ పోతుంది. ఇతర ఇబ్బందులు వస్తాయి.

పదార్థాలపరంగా చెప్పిన ఆ పద్ధతే సెక్స్‌కి కూడా వర్తిస్తుందంటారు. ఒకేరకమైన వంటకాలతో విసిగిపోయినవారు బయటకువెళ్ళి తిందామనుకున్నట్టే ఎటువంటి కొత్తదనం లేకుండా ఒకేరకమైన పద్ధతిలో సెక్స్‌లో పాల్గొనేవారికి బోర్ కొడుతుంది. అప్పుడే బయటి రుచుల ఆలోచనలు వస్తాయి. సెక్స్‌లో థ్రిల్ లోపించి తాము ఇతరత్రా కొత్త అనుభవాలను కోరుకున్నాం అని సర్వేలో పాల్గొన్నవారిలో 30 నుండి 60 శాతంమంది చెపుతున్నారు. సెక్స్‌లో లోపించిన తృప్తి కొందరిదైతే, మరికొందరిది ఒకే తీరులో, ప్రతి రోజు అనుభవించి మొహం మొత్తటం.

శారీరకంగా అలసిపోయి, మానసికంగా ఒత్తిడికి గురవుతున్న వేళ సెక్స్‌పై విముఖత ఏర్పడుతుంది. కొత్తదనం లోపించినపుడు సెక్స్ బోర్ అనిపించి అందులో సుఖం, సంతోషం రెండూ వుండవు.

కాబట్టి సెక్స్‌జీవితంలో మజా కొనసాగాలంటే మళ్ళీ కొత్తగా మొదలుపెట్టాలి.

క్రికెట్ ఆట చూసేవారు బ్యాట్స్‌మెన్ రాగానే 'గార్డ్' తీసుకోవటం గమనించేవుంటారు. రెండు మూడు గంటలు ఆడినతర్వాత తిరిగి మరోసారి 'గార్డ్' తీసుకోవటం చూసేవుంటారు. మళ్ళీ ఎందుకనే ప్రశ్న కలుగుతుంది చాలామందికి.

తగ్గిన తన 'ఫోకస్'ని తిరిగి తెచ్చుకునేందుకు,

డా॥ జి. సమరం వాసవ్య నర్సింగ్‌హోమ్ బెంజిసర్కిల్ విజయవాడ 520 010 ఫోన్ 0866-2472370 E-mail drsamaram@hotmail.com www.gsamaram.com

కొందరు స్త్రీలకి సెక్స్ అంటేనే ఎవ ర్షన్ వస్తుంది.అటువంటివాళ్ళు సెక్స్‌లో పాల్గొనడానికి ఏమాత్రం ఇష్టంచూపరు. ఇటువంటి స్త్రీలకి సైకలాజికల్ కౌన్సి లింగ్‌చేస్తే మారే అవకాశం ఉంది.

అందుకని ఇటువంటివారినితెలియ కుండా పెళ్ళిచేసుకున్నప్పటికీ భర్త కాస్త సహనంతో ఉండి కౌన్సిలింగ్ చేయిస్తే సంసారం, సుఖసంసారం అయ్యే అవ కాశం ఉంది.

డి.కె. నిజామాబాద్

*నాకు ఇంకా పెళ్ళి కాలేదు. పడుపు వృత్తిలో ఉన్న అనేకమందిని సెక్స్‌లో కలిశాను. ఇటీవల హెచ్.ఐ.వి. టెస్ట్ చేయించుకుంటే అందులో నాకు హెచ్.ఐ.వి. ఉన్నట్లు వచ్చింది.*

*నా ఆరోగ్యం చాలా చక్కగా ఉంది. ఎటువంటి బాధా లేదు. మరి నాకు హెచ్.ఐ.వి. ఉన్నట్లు ఎలా వచ్చింది? నాకు హెచ్.ఐ.వి ఉన్నట్లా, లేనట్లా?*

*నేను ఆరోగ్యంగానే ఉన్నాను కనుక వేశ్యలదగ్గరకు వెళ్ళ డం మానేసి పెళ్ళి చేసుకుని భార్యతోనే ఉండవచ్చా?*

హెచ్.ఐ.వి. ఉన్నప్పటికీ మొదట్లో కొన్ని సంవత్సరాలపాటు ఎటువంటి బాధా ఉండదు. పైకిపూర్తి ఆరోగ్యంగానే కనబడతారు. కాని 5-10 సంవత్సరాలు గడిచేసరికి ఆరోగ్యం క్షీణిస్తుంది.

మరింత మెరుగ్గా ఆడేందుకు అలా మళ్ళీ గార్డ్ తీసుకుంటారు. దంపతులు తమ పడకగది అనుభవంలో 'బోర్' అనేది మొదలైతే లైంగిక జీవితాన్ని తిరిగి కొత్తగా మొదలుపెట్టాలి.

అలా చెయ్యటం ద్వారా సెక్స్ జీవి తంలోకి వచ్చిన వ్యతిరేకతఅంశాలను వదిలించుకోగలుగుతారు. సెక్స్ జీవి తంలో థ్రిల్ లోపించిందనగానే సెక్స్‌ని కొంతకాలం ఆపండి.

ఉపవాసం చేసి పొట్టలో గడబిడ పోగొట్టుకుని, తిరిగి తినటానికి సిద్ధం చెయ్యటం లాంటిదే ఇది. సెక్స్‌మాని సెక్సీకబుర్లు పెంచండి. ఒకరి అవస రాలగురించి మరొకరు మాట్లాడండి.

ఎలా కావాలనుకుంటున్నది చెప్పు కోండి. తన ఆనందంకన్నా భాగస్వామి ఆనందానికి ప్రాధాన్యతను ఇస్తానని మనసుకి చెప్పుకోండి.

సెక్స్‌లో ఆనందం, తృప్తిని దూరం చేస్తున్న ఆదుర్దా, ఒత్తిడి, ఇతర అంశాల నుండి దూరంగా జరగండి. ◆




Courtesy : SAVVY

రక రకాల బాధలు, వ్యాధులు కలుగుతాయి. మీరు వెంటనే డాక్టరుకి చూపించి హెచ్.ఐ.వి.కి మందులు మొదలుపెట్టండి.

వ్యాధి మొదటి దశలోనే మందులు మొదలుపెట్టినట్లైతే ఆరోగ్యం క్షీణిం చదు. అందరిలాగానే మీరు పూర్తి ఆరోగ్యవంతుడిగా ఉంటారు.

మీరు పెళ్ళి చేసుకోవచ్చును. కాని భార్యతో సెక్స్‌లో పాల్గొన్నప్పుడు తప్ప కుండా కండోమ్ వాడాలి.

లేకపోతే ఆమెకు హెచ్.ఐ.వి. సంక్ర మిస్తుంది. మీరు పెళ్ళిచేసుకునేముందు మీకు హెచ్.ఐ.వి. ఉన్నట్లు ఆమెకు చెప్పాలి. ఆమెకూడా హెచ్. ఐ.వి సంక్ర మించకుండా జాగ్రత్తపడుతుంది.

ఎస్.ఎస్. నెల్లూరు

*ఒకరోజు మధ్యాహ్నం అనుకోకుండా మా ఇంటిప్రక్క పోర్షన్‌లో ఉన్న భార్యా భర్తలు సెక్స్‌లో పాల్గొంటూ ఉండగా గోడకంతలో నుంచి చూశాను. వాళ్ళు చాలాసేపు శృంగారంలో పాల్గొన్నారు. రకరకాల రతిభంగిమలు పాటించారు.*

*వాళ్ళని చూస్తూ నేను ఎంతో కామో ద్రేకానికి లోనయ్యాను. వెంట వెంటనే హస్తప్రయోగం చేసుకుని తృప్తిచెందా. ఆ రోజునుంచి నాకు కంతల్లో నుంచి ఇతరుల శృంగారాన్ని చూడాలనే ఆరా టము పెరిగిపోయింది.*

*నాకు అటువంటి అవకాశం ఎప్పుడు దొరుకుతుందా, ఎక్కడ దొరుకుతుందా అనే ఆరాటం చెందుతూవస్తున్నాను.*

*కొన్ని సందర్భాలలో ఎటువంటి శృంగారం లేకపోయినప్పటికీ నేను మాత్రం పాతజ్ఞాపకాలని గుర్తుకుతెచ్చు కుంటూ హస్తప్రయోగం చేస్తున్నాను.*

*హస్తప్రయోగం ద్వారా ఎంతగానో వీర్యం కోల్పోయాను. ఇప్పుడు నాకొక భయం పట్టుకుంది. నాకు పెళ్ళయిన తరువాత కూడా ఇంకొకరి శృంగారం చూస్తేతప్ప అంగం స్తంభించదా?! ఈ పాడు అలవాటువల్ల నా జీవితం నాశన మయిపోతుందా? ఇప్పుడు నేను ఏం చేయాలి? సలహా చెప్పండి.*

కంతల్లో నుంచి ఇతరుల శృంగా రాన్ని చూసి కామోద్రేకం చెందే పరి స్థితిని 'వాయురిజం' అంటారు. ఇది సెక్స్‌లో విలక్షణమైనది.

ఇటువంటి అలవాటు ఏ మాత్రం మంచిది కాదు. మీరు డాక్టరుకి చూపిం చుకుని సైకోథెరపీ చేయించుకోండి. తప్పకుండా బాగుపడతారు.

# వసంతసేనా చారుదత్తం

సీరియల్

"అమ్మా!అలా కూర్చోండి"అన్నాడున్యాయమూర్తి. "చిత్తం" అంటూ ఆమె ఓ పీఠంమీద కూర్చుంటూ, నేలమీద కూర్చున్న శకారుణ్ణి వింతగా చూసింది.

"వచ్చావూ, ముసలి భోగందానా! వచ్చావూ...?" వేళా కోళంగా అన్నాడు శకారుడు ఆమెని చూస్తూ.

అతడి మాటల్ని ఆమె వినీవిననట్లుండిపోయింది.

"ఏమమ్మా! నువ్వు వసంతసేన తల్లివా?" అని అడిగాడు ప్రధాన న్యాయమూర్తి. "అవునండి" అందామె.

"అయితే ఇప్పుడు మీ వసంతసేన ఎక్కడుంది? ఎక్కడికైనా వెళ్ళిందా?"

"మిత్రుడింటికి"

"ఏ మిత్రుడింటికి?"

"అయ్యయ్యో! ఎంత సిగ్గు చేటొచ్చింది! ఇంకెవరైనా అడగవచ్చుగానీ, తమవంటి వారడగకూడదు" అంది నెమ్మదిగా.

"సిగ్గుపడితే లాభం లేదు. వ్యవహారం వల్ల అలా అడగవలసివచ్చింది. లేకపోతే నేనీ ప్రశ్నను అడగాల్సిన అవసరం ఏముందనీ? అతడెవరు?" తిరిగి అడిగాడు న్యాయమూర్తి.

"అవసరం వచ్చింది. చెప్పు, తప్పు లేదు" అన్నాడు ధనదత్త.

"ఏమిటీ! వ్యవహారమా? అయితే, పెద్దలు వినండి.మేటి వర్తకుడు,వినయదత్తుని మనవడు,

సాగరదత్తుని కుమారుడు, సుప్రసిద్ధుడు ఆర్యచారుదత్తుడు, బేహారుల వాడలో ఉన్నాడు. అక్కడికి మా పిల్ల స్నేహానికెళ్ళింది" అందామె.

"అయ్యా! విన్నారా?ఆ అక్షరాలు రాయండి. చారుదత్తుడితో నాకిప్పుడు తగువు" అన్నాడు శకారుడు గట్టిగా.

"చారుదత్తుడు మిత్రుడైతే తప్పేముంది?" అడిగాడు ధనదత్త.

"ఐతే, ఈ వ్యవహారం చారుదత్తుడికి సంబంధించి వుంది..." అన్నాడు న్యాయమూర్తి దీర్ఘంగా ఆలోచిస్తూ.

"ఆలోచిస్తే, అవుననే అనిపిస్తోంది"అన్నాడు ధనదత్త. "ధనదత్తా!వసంతసేన చారుదత్తుని ఇంటికెళ్ళిందనీ పత్రంలో మొదటి వాక్యం వ్రాయి"అని,ఏమీ!పూజ్య చారుదత్తుణ్ణి కూడా మనం న్యాయస్థానానికి పిలవాల్సివచ్చిందే?

వ్యవహారం అలాంటిదని, "శోధనకా! వెళ్ళు.ఏమీ తొందరపెట్టకుండా గౌరవముగా ఈ సంగతి ప్రస్తావించి న్యాయాధికారి మిమ్ముల్ను చూడవలెనంటున్నాడు అని చెప్పి,

ఆయన్ని పిల్చుకొనిరా!" అన్నాడు ప్రధాన న్యాయమూర్తి.

శోధనకుడు చారుదత్తుడి కోసం వెళ్ళి, విషయం చెప్పాడు.

చారుదత్తుడు ఆలోచించి నా కులం, శీలంరాజుగారికి తెల్సు. ఐనా న్యాయమూర్తి తనని పిలిచిన పిలుపు ఏదో దురవస్థను శంకిస్తోందనుకున్నాడు.

చెరనుండి తప్పించుకొని,తన బండిలోకొచ్చిన అతడి సంగతేమైనా రాజుగారికి తెలిసిందా? చారులనే కళ్ళతో రాజు సర్వమూ చూడగలడు.

దోషారోపణ జరిగినవానివలే తను న్యాయస్థానానికి వెళ్ళాల్సివచ్చిందని అనుకున్నాడు. చెట్టుపైన వున్న కాకి కఠోరంగా అరుస్తోంది. చారుదత్తుడి ఎడమకన్ను అదిరింది.

ఏమిటీ అపశకునాలన్నీ బాధిస్తున్నాయని అనుకున్నాడు చారుదత్తుడు.

"అయ్యా! ఇలారండి, తొందరలేదు. నెమ్మదిగా రండి..." అని వినయంగా పలికాడు శోధనకుడు.

అతడివెంట న్యాయస్థానానికి నడవసాగాడు చారుదత్తుడు. 'ఎండుచెట్టు మీద కాకి సూర్యుడివైపు తిరిగి, ఎడమ కన్నుతో నావైపు చూస్తోంది. సందేహం లేదు,ఇది తీవ్రమైన అనర్థం కల్గిస్తుంది' అనుకొని, మరోవైపు చూశాడు. అక్కడ తనికి ఒక పాము కనిపించింది.

ఖలందర్



## జరిగిన కథ

13

వసంతసేనను తీసుకొస్తున్న బండి, శకారుడి ముందు ఆగుతుంది. వసంతసేన శకారుడిని కాలితో తంతుంది.

వసంతసేనను చంపెయ్యమని విటుడితో చెబుతాడు శకారుడు. అందుకు విటుడు, బండివాడు ఇద్దరూ కూడా ఒప్పుకోరు. శకారుడు, వసంతసేన గొంతుపిసికి ఆమెమీద ఎండుటాకుల్ని కప్పుతాడు. విటుడు శకారుడ్ని తిట్టి వెళ్ళిపోతాడు.

బౌద్ధభిక్షువు ఉతికిన తన కాషాయ వస్త్రాన్ని ఎండుటాకులమీద ఆరబెట్టేసరికి ఆ వస్త్రం నుండి పడిన నీటిబిందువులకు వసంతసేనకు స్పృహ వస్తుంది. ఆమెను తీసుకుని బయల్దేరతాడు బౌద్ధ భిక్షువు. న్యాయస్థానానికి వెళతాడు శకారుడు. వసంతసేనను ఎవరో చంపారని చెబుతాడు.

వసంత సేన తల్లిని పిలిపిస్తాడు న్యాయాధికారి. ఇక తరువాత జరగబోయేది చదవండి.





## భాష భయపెట్టింది

తొలి తెలుగు సినిమా చేస్తున్న హిమాచల్ యువతి రుహానిశర్మ సంతోషంతో పాటు సందేహాలూ ఎదుర్కొన్నానంటున్నది. "ఇంత మంచి ఛాన్స్ వచ్చినందుకు ఆనందపడ్డాను. అదే సమయంలో భయసందేహాలనూ ఎదుర్కొన్నా.

ఎందుకంటే నేను హిందీ మాట్లాడే అమ్మాయిని. తమిళ సినిమా చేయడం ఏమీ సులువు కాలేదుకాని, తెలుగు నాకు పూర్తిగా కొత్త భాష. ఓ నెల రోజులలో నా బృందం అంతా బాగా సహాయపడి భయాన్ని పోగొట్టారు.

నేను ప్రభుత్వ ఉద్యోగుల కుటుంబానికి చెందినదాన్ని. గ్లామర్ ప్రపంచంలో కెరీర్‌ని ఊహించుకోలేదు" అంటూ చెప్పుకువచ్చింది రుహానిశర్మ.

కాటుకముద్దలా దారికడ్డంగా అది పడుకొనివుంది. నాలుక చాస్తూ, కోరలతో వంకరగా త్రిప్పి, ఊరించిన పొట్టతో, కోపంగా అతడిమీదికే ఉరికినట్లనిపించింది అతనికి.

భూమిమీద తడిలేకపోయినా వేసిన కాలు జారుతున్నది. ఎడమకన్ను, భుజం మాటిమాటికి అదుర్తున్నాయి. ఈ పక్షి మాటిమాటికీ కూస్తున్నది.

ఈ అపశకునాలు అన్నీ దురంతమైన మృత్యువును సూచిస్తున్నాయి. ఇక విచారం ఎందుకు? నాకిక దేవతలే దిక్కు' అనుకున్నాడు.

చారుదత్తుడు న్యాయస్థానంలోనికి ప్రవేశించి, అంతటా కలయజూశాడు. 'ఓహోహో! న్యాయస్థానం! ఆలోచనల్లో మునిగిన మంత్రులే నీళ్ళు. దూతలే కెరటాలమీద తేలియాడే శంఖాలు.

పక్కన నిలిచిన చారులే మొసళ్ళు. ఇక్కడవున్న ఏనుగులు,గుర్రాలే క్రూర జంతువులు. పలువిధాలుగా కూసే జనులే రాపులుగులు!

ఇక్కడి రాతగాళ్ళే పాములు. రాజనీతులే దీని ఒడ్లు. వీటితో ఈ రాజసభ భయంకర సముద్రంలా వుంది. 'సరేకానీ' అనుకున్నాడు.

చారుదత్తుడు లోపలికి ప్రవేశిస్తుండగా, గడప తలకు తగిలి దెబ్బతగిలింది... 'ఆహాహా! ఇది మరో అపశకునం'అనుకున్నాడు... న్యాయమూర్తి చారుదత్తుడ్ని చూశాడు.

విశాలమైన నేత్రాలు! ఎత్తయిన ముక్కు! 'ఈ ముఖం నిష్కారణ నిందలకు తగలదు! ఏనుగులలో, ఆవులలో, గుర్రాలలో కనబడే రూపురేఖలు వానివాని యోగ్యతలు చెప్పకమానవు' అనుకున్నాడు.

"అధికారులకు మేలగుగాక! రాజోద్యోగులకు క్షేమం కలుగుగాక!" అని అక్కడివారికి నమస్కరించాడు చారుదత్తుడు. న్యాయమూర్తి చారుదత్తుడ్ని సంభ్రమంగా చూస్తూ-

"ఆర్యచారుదత్తులకు స్వాగతం! నాయనా, శోధనకా! ఈయనకు ఒక పీఠం వెయ్యి" అన్నాడు.

శోధనకుడు పీఠం తెచ్చివేస్తే, చారుదత్తుడు అందులో కూర్చున్నాడు.

"వచ్చావూ! స్త్రీఘాతుకా! వచ్చావూ, ఏమి అది...! వ్యవహారం న్యాయంగా వుండాలి.ధర్మంగా ఉండాలి.స్త్రీఘాతుకుడికి పీఠం ఇస్తున్నారా...? సరే, ఇవ్వండి.." గర్వం ఉట్టిపడ్తూ అన్నాడు శకారుడు.

అతడు ఏమి అంటున్నాడో చారుదత్తుడికి అర్థంకాలేదు. తనను స్త్రీ ఘాతుక అంటున్నాడేమిటీ అని ఆలోచనలో పడ్డాడు. "అయ్యా...! చారుదత్తా! నీకు ఈ ముసలి సాని కూతురు, పరిచయంగానీ, స్నేహంగానీ వుందా?" అని అడిగాడు.

చారుదత్తుడాశ్చర్యపోతూ "ఏ వృద్ధురాలు" అన్నాడు.

"ఈ వృద్ధురాలు" అని, వసంతసేన తల్లిని చూపించాడు ప్రధాన న్యాయమూర్తి. చారుదత్తుడు లేచి నిలబడి, "అమ్మా..! నమస్కారం" అని ఆమెకు సవినయంగా నమస్కరించాడు.

"నాయనా! చిరంజీవి కావాలి"అంది ఆమె. చారుదత్తుడి రూపలావణ్యాలను చూసి, తన కూతురు, తన ప్రేమను సరిగానే సద్వినియోగం చేసుకుందని భావించిందామె.

"అయ్యా! ఆ వేశ్య నీకు స్నేహితురాలేనా?" అడిగాడు న్యాయమూర్తి.

సిగ్గుపడుతూ, వెంటనే సమాధానం చెప్పలేకపోయాడు చారుదత్తుడు.

"అయ్యా, చారుదత్తా! చెప్పు, సిగ్గెందుకూ? ఇది వ్యవహారధర్మం!"అన్నాడు శ్రేష్ఠి. "సిగ్గుతోగానీ, భయంతోగానీ జరిగిన సంగతి దాచడానికి వీల్లేదు. ఇతడిదంతా డబ్బుకోసమే చేసివుంటాడు" అని ఫిర్యాదు చేశాడు శకారుడు.

"అధికారులారా! వేశ్య నా స్నేహితురాలని ఎట్లా చెప్పగలను?అయితే, ఈ తప్పు యవ్వనానిది అయితే కావచ్చుగానీ, నా శీలానిది మాత్రం కాదు..." అన్నాడు మెల్లగా చారుదత్తుడు.

"ఒక వ్యవహార విచారణాగిపోయింది. సిగ్గువిడిచిపెట్టు. ధైర్యంతో నిజంచెప్పు. కపటం ఇక్కడ పనికిరాదు... సిగ్గెందుకూ? వ్యవహార సందర్భంలో అడుగుతున్నాం" అన్నాడు న్యాయమూర్తి.

"అయ్యా! ఎవరితో నాకు తగవు?" అని అడిగాడు చారుదత్తుడు.

"ఒరేయ్, నాతోనే తగవు" అన్నాడు పళ్ళికిలిస్తూ, శకారుడు.

"నీతో తగవు నాకు ఏమవసరం. తగవు పెట్టుకొనేందుక్కూడా నువ్వు నాకు సరితూగలేవు" అన్నాడు చారుదత్తుడు కోపంగా!

"ఓరీ స్త్రీఘాతుకా! నీవు రత్నభూషణాలతో కళకళలాడే వసంతసేనను చంపి, ఇప్పుడు నంగనాచిలా దాపరికంతో మాట్లాడుతున్నావా?" అంటూ అరిచాడు శకారుడు. ఆ మాటలకు ఉలిక్కిపడ్డాడు చారుదత్తుడు.

"వీడి మాటలకు శుద్ధీబద్ధం లేదు. నా వసంతసేనకు ఏమయ్యింది" అని అరిచాడు చారుదత్తుడు.

"ఆర్యా! చారుదత్తా! అతనితోటేమిటి? నిజంచెప్పు, నీకా వేశ్య స్నేహితురాలే కదా...!" మరోమారు అడిగాడు న్యాయమూర్తి.

"అవును"

"అయితే వసంతసేన ఇప్పుడు ఎక్కడ వుంది?"

"ఇంటికి వెళ్ళింది"

"వెళ్ళిందా? ఎప్పుడు వెళ్ళింది? వెళుతూ ఆమె ఎవరిని వెంటబెట్టుకుని వెళ్ళింది?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు ఏం సమాధానం చెప్పాలో అతడికి తోచలేదు. వసంతసేనకు ఏమయ్యిందోనన్న ఆదుర్దా అతనిలో బయలుదేరింది. అతడి తల గిర్రున తిరగసాగింది. వసంతసేనకు ఎలాంటి ప్రమాదం సంభవించిందోనని కంగారు పడసాగింది ఆమె తల్లి.

విచారంతో కూడిన వదనంతో నిలిచివున్న చారుదత్తుడితో- "నా పుష్పకరండక ఉద్యానవనానికి నువ్వు తీసుకువెళ్ళి డబ్బులకోసం, నగలకోసం ఆమె గొంతును నులిమి చంపేశావు. ఇంటికి వెళ్ళిందేం? ఇంటికి!" అన్నాడు శకారుడు గొంతు పెద్దదిచేసి.

"ఓరీ అసంబద్ధ ప్రలాపీ! చాతకపక్షి రెక్కకొసలు మేఘజలాలతో తిన్నగా తడవవన్నట్టు నీ ముఖం నిర్మలంగా లేదు. నీ ముఖం అబద్ధాలతో శీతా

దివంగత ప్రధాని ఇందిరాగాంధీకి 'మన్ కీ బాత్' అంటే అపారవిశ్వాసం... ఆమె మదిలో మాట ఆమె వినేవారు.

-జైరామ్ రమేష్, కాంగ్రెస్ ఎమ్.పి.



కాలపు పద్మంలా వెలవెలబోతున్నది. నువ్వే వసంతసేనను ఏదో చేశావు. ఏం చేశావు...!?" అన్నాడు ఆవేశంగా చారుదత్తుడు.

"చారుదత్తుణ్ణి దూషించడమంటే- పర్వతాన్ని కదపడమూ, సముద్రాన్ని దాచడమూ, గాలిని పట్టుకోవడమూ వంటిదిగదా! ఇతడిలాంటి దుష్కార్యం చేస్తాడా?" అడిగాడు న్యాయమూర్తి.

"ఏమయ్యా! పక్షపాతంగా వ్యవహరిస్తున్నారే...?" అని ఎగతాళిగా అన్నాడు శకారుడు.

"పో మూర్ఖుడా....! పామరుడవు. వేదార్థాలు పలుకుతున్నావు. ఇంకా నీ నాలుక పడిపోలేదా? మధ్యాహ్నసూర్యుడిని చూస్తున్నావు. నీ చూపు చీకట్లు కమ్మడంలేదా? మండే నిప్పులో చెయ్యి పెడుతున్నావు. ఇంకా కాలిపోకుండా ఉన్నావా? చారుదత్తుడి శీలాన్ని కప్పిపుచ్చుతున్నావు. ఇంకా భూమి నీ శరీరాన్ని మింగివెయ్యలేదా? ఆర్యచారుదత్తుడు దుష్కార్యమెట్లా చేస్తాడూ? సముద్రాల్ని నీళ్ళతోమాత్రం ఉంచి, రత్నాలన్నీ నిష్కామంగా దానంచేశాడు. ఉత్తమ కార్యాలకు నిధివంటి పాప కార్యం చేస్తాడా?" అంటూ న్యాయమూర్తి శకారుడ్ని మందలించాడు.

"అవును, నిజమే. ఆ రాత్రి అతని దగ్గర దాచిన బంగారునగను దొంగలెత్తుకుపోతే, సముద్రసారమయిన రత్నావళిని ఇచ్చివేశాడు. అలాంటివాడు తుచ్ఛమైన డబ్బుకోసం ఈ కానిపని చేస్తాడా? అయ్యో! కూతురా! ఏమయిపోయావో కదా తల్లీ" అంటూ వసంతసేన తల్లి భోరున ఏడ్చేసింది.

"అయ్యా, చారుదత్తా!ఆమె నడిచి వెళ్ళిందా? లేక బండిలో వెళ్ళిందా...?" అడిగాడు న్యాయమూర్తి.

"అయ్యా, నా ఎదుట ఆమె బయలుదేరి వెళ్ళలేదుకనుక ఎలా వెళ్ళిందో చెప్పలేను" అన్నాడు చారుదత్తుడు.

అంతలో అక్కడికి సైన్యాధికారియైన వీరుడు ప్రవేశించాడు.

"ఇదిగో... నగర రక్షణాధికారి వీరకుడు. వీరకా! ఏం పనిమీద వచ్చావు!" అడిగాడు న్యాయమూర్తి.

"చెరనుండి తప్పించుకొని తొందరగా పరిగెత్తుకొనిపోయే ఆర్యకుణ్ణి వెదుకుతున్న సమయంలో మూసివున్న బండి ఒకటి వెళుతుండగా, చందనకుడు పరీక్షించిన బండిని, నేను కూడా పరీక్షించబోతే అతను నన్ను కాలితో తన్నాడు. అది విన్నవించేందుకే వచ్చా. రాత్రంతా దుఃఖంతో గడిపాను" అని అన్నాడు వీరకుడు.



## నాలుగు ప్రేమకథలు

వెండితెరపై అందాల విందులో ఎంతగా ముందుంటుందో రాయ్‌లక్ష్మి గురించి అందరికీ తెలుసుకాని, ప్రేమలో బోల్డెన్ని బ్రేకప్‌లు ఉన్నాయన్న సంగతి మాత్రం చాలామందికి తెలియదు.

నిజజీవితంలోని ప్రేమకథలగురించి ఆమే స్వయంగా చెప్పుకున్నది.

"నన్ను అర్థం చేసుకుని జాగ్రత్తగా చూసుకునేవారితో మాత్రమే సంతోషంగా ఉండగలను. ఎందుకంటే నేను చాలా ఎమోషనల్. కాబట్టే నా ప్రేమ వ్యవహారాలు పెళ్ళిదాకా వెళ్ళలేదు. బాయ్‌ఫ్రెండ్స్‌కు బ్రేకప్ చెప్పేశాను. అలా నాలుగు ప్రేమకథలు ఇప్పటిదాకా ముగిశాయి" అంటూ తేల్చేసింది.

"ఆ బండి ఎవరిదో నీకు తెలుసా?" అడిగాడు న్యాయమూర్తి.

"ఈ ఆర్యచారుదత్తుందే. వసంతసేన అందులో వుండి, పుష్పకరండకంలో విహారానికి వెళుతున్నదని బండివాడు చెప్పాడు" అన్నాడు వీరకుడు.

"అయ్యో! పెద్దలంతా విన్నారా?" సంతోషంగా అరిచాడు శకారుడు.

"ఏమది! స్వచ్ఛమయిన వెన్నెలగల చంద్రుణ్ణి రాహువు ఆక్రమిస్తున్నాడు. నిర్మలమైన నీరు ఒడ్డు విరిగి మలినమైపోతున్నది. వీరకా! నీ వ్యవహారం తరువాత చూస్తాం. ఈ న్యాయ మందిరం దగ్గర వున్న గుర్రం ఎక్కి పుష్పకరండక ఉద్యానవనానికి వెళ్ళి, అక్కడ మరణించిన స్త్రీ ఉన్నదేమో చూసి రావోయ్...!" అని ఆజ్ఞాపించాడు న్యాయమూర్తి.

వీరకుడు వెళ్ళి, అడవిలో చచ్చిపడివున్న స్త్రీని చూసి వచ్చి ఆ విషయమే చెప్పాడు- "అయ్యా, నేను చనిపోయివున్న స్త్రీ శవాన్ని క్రూరమృగాలు తినివేస్తుండగా చూశాను" అన్నాడు.

"అది స్త్రీ శరీరమే అని నీకెలా తెలిసింది?" అనడిగాడు శ్రేష్ఠి ధనదత్త.

"మిగిలిన తలకట్టు, చెయ్యి, కాళ్ళు మొదలయినవాటివలన కనిపెట్టాను" అన్నాడు వీరకుడు.

"ఆహా! లోకవ్యవహారం ఎంత విషమంగా ఉంటుంది! ఎంత జాగ్రత్తగా విచారణ చేస్తే, అంత చిక్కుగానూ పరిణమిస్తున్నది. ఆహా! సంకీర్ణమైన రాజనీతులు ఎంత చిక్కైనవి! నా బుద్ధి బురదలో కూరుకుపోయిన ఆవులా కొట్టుకుంటుందేమిటీ...!" అని ఆలోచించసాగాడు న్యాయమూర్తి.

వసంతసేన చనిపోయింది అంటే నమ్మలేకుండా ఉన్నాడు చారుదత్తుడు. ఏదో బలమయిన ఉచ్చుల్లో చిక్కుకొని తను హంతకుడిలా చిత్రీకరింపబడ్డం చాలా నాటకీయంగా జరుగుతుండడమే అతడికి విస్మయాన్ని కలిగిస్తోంది.

పువ్వు పీడగానే తుమ్మెదలు వచ్చిపడినట్టు మనుషులకి ఆపత్కాలంలో కష్టాలు ఉవ్వెత్తున్న వచ్చిపడతాయేమో అని బాధపడసాగాడతడు.

"ఆర్య చారుదత్తా! నిజం చెప్పు" న్యాయమూర్తి అడుగుతుంటే ఏమి సమాధానము చెప్పాలో తోచలేదతనికి! చివరికి అతడు తేరుకొని ఇలా అన్నాడు- "దుష్టుడూ... ఇతరుల గుణాలు చూచి సహించలేనివాడూ, దురభిమానగ్రస్తుడూ, పరమ హింసాపరుడూ, తన నీచ కులాన్నిబట్టి అబద్ధం చెబుతాడు.అది గ్రాహ్యం అవుతుందా? విచారించనక్కరలేదా?

తీగను పువ్వుకోసం వంచి కొయ్యలేని నేను తుమ్మెదవలె నిగనిగలాడే కేశపాశం పట్టుకొని, నేను ఎంతగానో ప్రేమించిన ఆమెను ఏడుస్తుండగా చంపగలనా? అందులో నేను గాఢంగా ప్రేమించిన కోమలాంగిని"అని కన్నీళ్ళు పెట్టుకున్నాడు.

"ఏమి న్యాయమూర్తులండీ! మీరు ఇంత పక్షపాతంగా వ్యవహరిస్తున్నారా? దుష్టుడయిన ఈ చారుదత్తుడ్నిఇంకా పీఠం మీదే కూర్చోబెట్టారు?" అని ఆరోపించాడు శకారుడు.

"నాయనా! శోధనకా! ఆక్షేపణ లేకుండా చెయ్యి.." అని ఆదేశించాడు న్యాయమూర్తి.

శోధనకుడు చారుదత్తుడిని పీఠం మీదనుంచి లేపి, కింద కూర్చోబెట్టాడు. "సరే... అధికారులారా! మీ విచారణ మీరు చేయండి" అని అన్నాడు చారుదత్తుడు నీరసంగా.

తను చేసిన పాపం చారుదత్తుడి తలమీద తను సులభంగా రుద్దగలిగినందుకు శకారుడికి లోన చాలా ఆనందంగా వుంది. చివరికి తాను కూర్చున్న నేలమీదికి చారుదత్తుడ్ని దింపి, కూర్చోబెట్టినందుకు అతడికి ఇంకా చాలా ఆనందంగా వుంది.

వ్యక్తుల జీవితాలను మార్చే శక్తి మోడరన్ సైన్స్‌కి వుంది. దానిని ఉపయోగించి పాతుకుపోయిన సమస్యలను పరిష్కరించాలి.

-కైలాస్ సత్యార్థి, నోబెల్ విజేత



# చిలిపి

మానవులందరికీ మామ ఎవరు?
చందమామ

మన అవయవాలు ఏవీ మనవికావనే వేదాంత ధోరణి ఎప్పుడు వస్తుంది?
సిటీబస్సు ఎక్కినప్పుడు.

రైలుస్టేషన్‌లోకి వచ్చేముందు గంట ఎందుకు కొడతారు?
పడుకున్న ప్రయాణీకుల్ని లేవమని.

నా పేరు అందమయిన పేరేకాని చెప్పుకోవడానికి సిగ్గుపడేది?
రతి!



చిన్నపిల్లలకి 'టాటా' ఎందుకు నేర్పుతారు?
అతిథులు రాగానే చెప్పడానికి.

దేవుడు మనకు చెవులు ఎందుకు పెట్టాడు?
కళ్ళజోడు పెట్టుకోవడానికి.

అగ్నికి ఆజ్యం తోడైనట్లు అంటే?
నిరుద్యోగిని లంచం అడిగినట్లు.

ఏంటి గురూ! ఇంతగా కండలు పెరిగాయి? వ్యాయామాలు చేస్తున్నావా?
అదేం లేదు శిష్యా! సిటీబస్సు ప్రయాణాల్లో ఊచలు పట్టుకు వేళ్ళాడి వేళ్ళాడి ఇలా అయ్యానంతే.

ఏ పాలు మంచివి కావు?
కో'పాలు', పా'పాలు'

రైల్వే టైంటేబుల్ దేనికి?
ఏ రైలు ఎంత లేటుగా నడుస్తోందో తెలుసుకోవడానికి.

బస్ డ్రైవర్! కామెంట్ ప్లీజ్!
బస్సు ఎంత కిక్కిరిసివున్నా తన సీటుకు ఢోకా లేనివాడు.

"దుష్టుడు శకారుడు వెనకటి మాటలే అంటున్నాడు. నెచ్చెలీ. మైత్రేయా...! ఇప్పుడు నాకీ వినాశం తప్పేటట్లు లేదు. వినాశనం ఏమిటి? ఓ ఇల్లాలా! ఎంత స్వచ్ఛమయిన బ్రాహ్మణ కుటుంబంలో పుట్టావు. నాయనా! రోహసేనా! నాకు వచ్చిన ఆపద నువ్వెరుగవు గదా! ఓరీ రాజ్యపాలకా! నిత్యమూ ఒకరి కష్టాలు చూచి ఆనందిస్తావా?

వసంతసేన వార్త కనుక్కోవటానికీ, బండి సంగతి తెలుసుకోవడానికీ ఆమె నగలు తిరిగిచ్చేయడానికి వసంతసేన దగ్గరకి మైత్రేయుణ్ణి పంపాను. అతనింకా రావడంలేదు ఎందుచేతనో!" అనుకోసాగాడు చారుదత్తుడు.

ధూతాంబ వసంతసేన నగల్ని తీసి, వసంతసేనకు ఇచ్చి రమ్మంటే, ఆ నగల మూటని చంకలో పెట్టుకొని మైత్రేయుడు బయల్దేరాడు. దారిలో అతడి స్నేహితుడు రేభిలుడు చారుదత్తుడ్ని న్యాయస్థానంలో విచారిస్తున్నారు అన్న సంగతి చెప్పడంతో, మైత్రేయుడు పరుగుపరుగున న్యాయస్థానం చేరుకున్నాడు.

మైత్రేయుడు చారుదత్తుడ్ని చూసి, "మిత్రమా! నీకు మేలే జరుగుతుంది" అని అన్నాడు.

"మున్ముందు..." అన్నాడు వైరాగ్యంతో చారుదత్తుడు.

"మిత్రమా! ఆందోళనగా కనిపిస్తున్నావేమీ?" అడిగాడు అతను.

"మిత్రమా! నేను క్రూరుడనై ఇహపరం అనే ఆలోచన చేయకుండా సాక్షాత్తూ రతీదేవివంటి స్త్రీని- ఏమి చెప్పను? తక్కినది ఇతడు చెబుతాడు విను..." అని అన్నాడు బాధపడుతూ చారుదత్తుడు.

"ఏమిటేమిటి?"

జరిగిన సంగతిని మైత్రేయుడి చెవిలో చెప్పాడు ధనదత్తు.

"ఎవడు అన్నాడు ఇట్లా?" అడిగాడు మైత్రేయుడు.

చారుదత్తుడు శకారుడివైపు చూస్తూ "ఇతడు నిమిత్తమాత్రుడు, విధి అతని చేత ఇలా చెప్పిస్తోంది" అన్నాడు.

మైత్రేయుడు మెల్లగా చారుదత్తుడితో, "ఇంటికి వెళ్ళిందని ఎందుకు చెప్పలేదూ?" అడిగాడు.

"చెప్పినా నా దురవస్థ వారిని విననియ్యలేదు" అన్నాడు చారుదత్తుడు విచారంగా.

"అయ్యా! అనేక విహారాలు, తోటలు, దేవాలయములు, చెరువులు, యూపస్తంభాలు మొదలయినవాటితో ఈ ఉజ్జయినీ నగరాన్నే అలంకరించిన సుజనుడు తుచ్ఛమైన ధనంకోసం కాని పని చేశాడనే నమ్ముతారా?" అంటూ కోపంగా శకారుడ్ని చూస్తూ-

"ఒరే నీచుడా! రాజశ్యాల సంస్థానకా! పొగరుబోతా! తప్పుల కుప్పా! బండెడు బంగారు నగలనలంకరించుకున్న కోతీ! చెప్పు! నాదగ్గర చెప్పు. నా ప్రియమిత్రుడు పూచిన మాధవీలతను కూడా వంచి పూలుకోయనివాడు.

వంచితే ఆ తీగ చిగురు తెగుతుందేమోననీ భయపడేవాడు. అట్టివాడు ఇహపరాలకు దూరమయి, ఈ పాపిష్ఠి పనిని ఎందుకు చేస్తాడు? నీ మనస్సులా ఈ వంకరతిరిగిన ఈ కర్రతో నీ బుర్ర ముక్కలు చేస్తాను..." అని అన్నాడు మైత్రేయుడు కోపంగా.

"విన్నారా! నందయ్యా! పెద్దలు అంతా వినండి. నాకేదైన మోదమూ, తగవూ వుంటే అది చారుదత్తుడితో. ఈ పిలకబుర్రవాడు నా తలని ముక్కలు చేస్తాడట! కానివ్వండి...! ఒరే తొత్తు కొడుకా! దుష్టబ్రహ్మచారీ...!" అంటూ శకారుడు కేకలు వేశాడు.

మైత్రేయుడు శకారుడి జుట్టుపట్టుకొని కర్రతో రెండు బాదాడు. ఆ సమయంలో అతడి చంకలోని నగలు కింద పడ్డాయి. "అయ్యా...! చూడండి...! చూడండి! ఈ నగలు వసంతసేనవే! ఈ తుచ్ఛమైన ధనంకోసమే ఆమెను చంపాడు" అనసాగాడు శకారుడు.

శకారుడి మాటల్ని విన్న అధికారులు అందరూ తలదించుకున్నారు ఒక్కసారిగా. నా దురదృష్టంకొద్దీ ఈ సమయములోనే నగలు కిందపడ్డాయనీ చారుదత్తుడు చింతించాడు.

"ఏమయ్యా! జరిగిన సంగతెందుకు చెప్పవూ?" గట్టిగానే అడిగాడు మైత్రేయుడు.

**ఇంకా ఉంది**



> రాజకీయాల్లో వైఫల్య భయం నాకు లేదు. సినిమాలలాగా రాజకీయాలు ధనార్జనతో ముడిపడిన అంశం కాదుకదా.
>
> -కమల్‌హాసన్, నటుడు

# ఫర్ U

It is love that makes the world go round



Courtesy : HELLO!

## ప్రతిరోజూ ఒకటి

మిగతా పండ్లన్నీ అడపాదడపా మార్కెట్‌లో కనపడినా సీతాఫలంమాత్రం సీజనల్‌గానే దొరుకుతుంది. శీతాకాలం ఆరంభంనుంచీ దొరికే ఈ పండును లభించినంతకాలం రోజుకు ఒకటి తింటుంటే కొద్దిరోజుల్లోనే చర్మంలో కొట్టొచ్చినట్లు మార్పు కనపడుతుంది.

కొలాజిన్ స్థాయిలను మెరుగుపరిచే తత్వం సీతాఫలాల్లో వుంటుంది కాబట్టి చర్మంపై ముడతలు, గీతలను నివారించగలదు.

సీతాఫలాల్లో ఉండే యాంటీ ఆక్సిడెంట్‌లు శరీరంలోని ఫ్రీర్యాడికల్స్‌తో పోరాడతాయి. దీని వల్ల చర్మం టోనింగ్ మెరుగవుతుంది.

చర్మకణాల పునరుత్పత్తి మెరుగవుతుంది. అంటే వృార్ధక్య ప్రక్రియను నెమ్మదింపజేసి, యవ్వన రూపాన్ని ఇచ్చే శక్తి సీతాఫలాల్లో ఉంటుందన్నమాట.పీచుకూడా ఎక్కువగా లభిస్తుందికనుక లివర్, కలోన్‌ల పనితీరు మెరుగ్గా ఉంటుంది. ◆

## అల్లం తింటే చాలు

వ్యాయామాలు చేసినప్పుడు మరీ కష్టంగా, కండరాలు పట్టేసినట్లు నొప్పులుగా ఉన్నట్లయితే కొద్దిగా అల్లం తింటుంటే ఉపశమనంగా ఉంటుంది. ప్రతిరోజూ కేవలం రెండు గ్రాములు పచ్చి లేదా ఉడికించిన అల్లం తింటుంటే వ్యాయామాలవల్ల కలిగిన కండరాల సలపరం 25 శాతం తగ్గిపోతుందని నిపుణులు సిఫార్సు చేస్తున్నారు.

అల్లంలో యాంటీ ఇన్‌ఫ్లమేటరీ గుణాలుండడమే ఇందుకు కారణం. ◆

## ఎడమవైపునకు

గుండెలో మంట, అసౌకర్యాల నుంచి ఉపశమనం కలగాలంటే నిద్రించే సమయంలో కుడివైపుకుకాక ఎడమపక్కకు తిరిగి పడుకోవాలి.

ఎడమవైపుకు తిరిగి పడుకున్నప్పుడు ఉదరం ఒంగి, ఇసోఫగస్ కంటే ఓ భాగము కిందుగా ఉంటుంది. దీనివల్ల ఆహారం, ఆమ్లాలు వెనక్కు తన్నడం, ఇసోఫగస్‌కు చేరకుండా ఉండడం జరుగుతాయి. ఫలితంగా గుండెమంటవంటి సమస్యలు తలెత్తవనేది నిపుణుల అభిప్రాయం. ◆

## మట్టి మంచిదే

చిన్న చిన్న తోటపనులు చేయాలన్నా మట్టిలో చేతులు పెట్టడానికి సందేహిస్తూ, చేతులకు తొడుగులు వేస్తుంటారు. కొందరికి మట్టిలో చేతులు పెట్టాలంటేనే అసహ్యం.

మట్టిలో సూక్ష్మక్రిములుంటాయని, వాటిలో చేతులుపెట్టడంవల్ల రుగ్మతలు రాగలవని అపోహ పడుతుంటారు. ఇవన్నీ అపోహలుమాత్రమే. మట్టిలో చేతులు పెట్టి పనిచేయడంవల్ల మూడ్ చాలా బావుంటుందని, ఒత్తిడిని ఎదుర్కోగలరని ఇంగ్లండ్ పరిశోధకులు గుర్తించారు.

మట్టిని ఇష్టపడే సూక్ష్మక్రిమికీటకాలు మెదడులోని మూడ్‌ను మెరుగుపరిచే రసాయనాల విడుదలను ఉద్దీప్తం చేస్తాయి.

కనుక మట్టిలో చేతులు పెట్టి పని చేయడం ఆరోగ్యభంగం కాదు-లాభదాయకం. ◆

## ఇంటి పనులు

వంటగదిలో స్విచ్ నొక్కితే అన్ని పనులూ ఇట్టే పూర్తయిపోతుంటాయి. అయితే మహిళలు ముఖ్యంగా 65 సంవత్సరాలు దాటినవాళ్ళు రోజుకు ఒక్క అరగంటయినా ఇంటి పనులు చేసుకోవడం మంచిదని నిపుణులు సూచిస్తున్నారు.

ఈ వయస్సువారికి శారీరక కదలికలు చాలా మంచివి అనేది వారి అభిప్రాయం.

చుట్టుపక్కల కొద్దిగా అటూ ఇటూ నడవడం, తోటివారితో కబుర్లు చెప్పడం, దుస్తులు మడత పెట్టడం, వంట చేయడంవంటి పనులు అన్నీ వారి శరీరాన్ని కదిలిస్తుంటాయి. ఇవన్నీ కూడా వారి ఆరోగ్యానికి మేలుచేసే పనులే.

ఇక రోజూ నడక, సైక్లింగ్‌వంటి వ్యాయామాలు చేసేవారికి కూడా దీర్ఘకాలిక వ్యాధులు అంత త్వరగా దరిచేరవు.

# వ్యక్తిత్వ వికాసం

శుక్లాంబరధరం విష్ణుం... శశివర్ణం... ఆలయంలో వినాయకుని విగ్రహంముందు తలవంచి ప్రార్థించి... "స్వామీ... వినాయకా... నాకు పదిలక్షలు కలిసొచ్చే మార్గం చూపు తండ్రీ... నా కోరిక సిద్ధించగానే నీకు నూటొక్క కొబ్బరికాయలు కొడతాను" మొక్కుకున్నాడు కృష్ణమూర్తి.

కృష్ణమూర్తి ప్రభుత్వరంగ సంస్థలో చిరుద్యోగి. భార్య సుమతి డిగ్రీ చదివినాకూడా ఇంటిబాధ్యతల నిర్వహణకే పరిమితమయింది. వారికి ఇద్దరు పిల్లలు. అబ్బాయి నాలుగో తరగతి, అమ్మాయి ఒకటో తరగతి చదువుతున్నారు.

కృష్ణమూర్తి మధ్యతరగతి కుటుంబీకుడు. ధనదాహంలేదుకాని తీరని కోరికలు చాలా ఉన్నాయి.

తీరిక సమయంలో మనసు ఊహలపందిరిలో ఉయ్యాలలూగుతుంది. మనసు మాయలోపడి కృష్ణమూర్తి అసంతృప్తితో అప్పుడప్పుడు రగులుతుంటాడు. ఇవన్నీ ఇలా వుంటే కృష్ణమూర్తికి స్వంత ఇల్లు ఏర్పరచుకోవాలనేది బలమయిన కోరిక.

అప్పుకోసం బ్యాంకు అధికారులను సంప్రదించాడు. స్థలంకొని ఇల్లుకట్టడం అసాధ్యమని అర్థమయింది. అపార్ట్‌మెంట్ కావాలని తాపత్రయం మొదలైంది. కనీసం పాతిక లక్షలు కావాలి.

పదిలక్షలు మార్జిన్ మనీ సమకూర్చుకుంటే పదిహేను లక్షలు అప్పుగా లభించవచ్చని బ్యాంకులు ఆశచూపాయి. అతని జీతానికి అంతకన్నా అప్పు లభించడం కష్టమన్నారు బ్యాంకు అధికారులు.

ఉన్నపళంగా పదిలక్షలు సమకూరాలంటే ఏదో అద్భుతం జరగాలి. అదృష్టం కలిసిరావాలి. అంటే భగవంతుని కృప ఉండాలి. భగవంతుని అనుగ్రహం ఉంటే పదిలక్షలు కాదు పదికోట్లయినా కలిసివస్తాయని కృష్ణమూర్తి నమ్మకం.

తన ఆరాటం భగవంతుని ఆరాధనతో తీరుతుందని కార్యసిద్ధి కోసం సిద్ధివినాయకుని పూజించడం మొదలుపెట్టాడు కృష్ణమూర్తి. వినాయకుని ఆలయదర్శనం నిత్యకృత్యమయింది. ఆరునెలలు గడిచినా కృష్ణమూర్తి ఆశించిన అద్భుతాలేం జరగలేదు.

శివశంకరం కృష్ణమూర్తి బావమరిది. అతను ఓ ఆదివారం ఉదయం కృష్ణమూర్తి ఇంటికి వచ్చాడు. అతను వచ్చేసరికి కృష్ణమూర్తి గుడికి వెళ్ళాడు.

"బావగారికీ మధ్య భక్తి పెరిగినట్లుందే" అన్నాడు కుశలప్రశ్నలు అయ్యాక- సుమతి విషయం వివరించింది. వాళ్ళు మాట్లాడుకుంటూ ఉండగానే కృష్ణమూర్తి ఆలయంనుండి వచ్చాడు.

"వినాయకుడు విఘ్ననాశకుడు. శివుడు భోళాశంకరుడు. భక్తుల కోరికలు తీర్చేది శివుడు. వరాలను గ్రహించేది శంకరుడే కదా... ప్రతిరోజూ శివాలయం దర్శించుబావా... అతి త్వరలో నీ కోరిక తీరుతుంది" అని సలహాఇచ్చాడు శివశంకరం.

అతను శివభక్తుడు. ఆ రోజు నుండి బావమరిది సలహాను అక్షరాలా పాటించసాగాడు కృష్ణమూర్తి. అతనిప్పుడు ప్రతిరోజూ శివాలయానికి వెళుతున్నాడు. ప్రతి సోమవారం శివునికి అభిషేకం చేయిస్తున్నాడు. మరో ఆరునెలలు కాలగర్భంలో కలిసిపోయాయి.

కృష్ణమూర్తి ఆర్థిక పరిస్థితి అంతంత మాత్రంగానేఉంది.

భాగ్యలక్ష్మి కృష్ణమూర్తి అక్కయ్య. ఆమె తనభర్త, పిల్లలతో వేసవి సెలవులకు తమ్ముడి ఇంటికి వచ్చింది. కృష్ణమూర్తి రోజూ శివాలయానికి వెళ్ళడం గమనించి "ఏమిటి విశేషం" అడిగింది సుమతిని.

విషయం వివరించింది సుమతి.

తమ్ముడు శివాలయం నుండి రాగానే...

"తమ్ముడూ... పరమశివుడు భక్తుల కోరికలు తీరుస్తాడు. నిజమే... కాని... నీకు కావలసింది లక్ష్మీప్రసన్నం. నీ కోరిక సిద్ధించాలంటే శ్రీ వెంకటేశ్వరుని కృప ఉండాలి.

లక్ష్మీదేవి దయతలచాలి. అందుకే ప్రతిరోజూ శ్రీ వేంకటేశ్వరుని పూజించాలి.

లక్ష్మీదేవిని ఆరాధించండి. త్వరలో నూతనగృహప్రవేశం తథ్యం" సలహా ఇచ్చింది భాగ్యలక్ష్మి.

వారం రోజులు ఆనందంగా గడిపి, భాగ్యలక్ష్మి కుటుంబం వెళ్ళిపోయారు. కృష్ణమూర్తి నిత్యం శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం చదవడం మొదలుపెట్టాడు. అష్టలక్ష్మీ స్తోత్రం,కనకధారా స్తోత్రం నిత్యపారాయణ ప్రారంభించాడు. ప్రతి శనివారంనాడు శ్రీనివాసుని ఆలయం దర్శిస్తున్నాడు.

వారంలో ఒకరోజు కనకమహాలక్ష్మి అమ్మవారి గుడికి విధిగా వెళ్ళివస్తున్నాడు.

కాలం పరుగెడుతూనే ఉంది... కృష్ణమూర్తిని నిరాశ వెంటాడుతోంది.

ఆ రోజు... ఆఫీసులో... లంచ్ టైములో...

కృష్ణమూర్తి కొలీగ్ షిర్డీ సాయిబాబా మహాత్యం వివరించాడు. సాయిబాబాను భక్తితో కొలిస్తే అనుకున్న పనులు అనుకున్నట్టు నెరవేరుతాయని చెపుతా, తన జీవితంలో జరిగిన కొన్ని విచిత్రాలు, సంఘటన్లి వివరించాడు.

"ఆ బాబా దయ" అన్నాడు చివరగా.

కృష్ణమూర్తి మెదడులో ఆ మాటలు నిక్షిప్తం అయ్యాయి.మరునాడు కృష్ణమూర్తి గృహంలోపూజా మందిరంలో సాయిబాబాగారి ఫోటో అమరింది.



ఇంద్రగంటి నరసింహమూర్తి

కృష్ణమూర్తి బాబాను భక్తిశ్రద్ధలతో పూజించడం మొదలుపెట్టాడు. ప్రతి గురువారం సాయినాథుని గుడికి వెళుతున్నాడు.

నాలుగునెల్లతర్వాత చిన్ననాటి మిత్రుడుకలిసి యోగక్షేమాలడిగి, అయ్యప్పస్వామిని అర్థిస్తే, అన్ని కోరికలు తీరుతాయని ఉపదేశించాడు.

కృష్ణమూర్తి అయ్యప్పస్వామి దేవాలయానికెళ్ళడం అలవాటు చేసుకున్నాడు. రోజులు యధావిధిగా దొర్లిపోతున్నాయి... కాలం కరిగిపోతోంది... కలిసి రావడంలేదు.దీంతో కృష్ణమూర్తికి చిరాకు, కోపం పెరిగాయి.



ఆదివారం మధ్యాహ్నం ఎక్స్ టి.వి. చూస్తున్నాడు కృష్ణమూర్తి.

మహాలక్ష్మి యంత్రం మహిమను వర్ణిస్తున్నారు ప్రాయోజిత కార్యక్రమంలో.

"హిమాలయాల్లో ప్రత్యేకంగా పూజలుచేసితెచ్చిన మహాలక్ష్మి యంత్రం... మీ ఇంట్లో ఉంటే, మీరు కోటీశ్వరుడు అవడం ఖాయం. ఈ యంత్రం ఎంతో మహిమ గలది. దీని వెల పాతికవేలరూపాయలు. అయినా ఎక్స్ టి.వి. ప్రేక్షకులకు కేవలం అయిదువేల రూపాయలకే అందిస్తున్నాం. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోండి. కోటీశ్వరులు కండి..." ప్రకటన పూర్తిగా విన్నాడు కృష్ణమూర్తి.

వెంటనే ఐదువేలు వెచ్చించి మహాలక్ష్మి యంత్రం తెప్పించుకుని పూజామందిరంలో ఉంచి ప్రతినిత్యం పూజించసాగాడు.

మూడు నెలలు గడిచాయి... బ్యాంకు బాలెన్స్ రూపాయి కూడా పెరగలేదు... కృష్ణమూర్తిని నిస్పృహ ఆవహించింది.

ఆ రోజు ఆదివారం... కృష్ణమూర్తి పుట్టినరోజు...

సాయంత్రం కొత్త బట్టలు తొడుక్కుని అయ్యప్ప స్వామి ఆలయానికి వెళ్ళాడు. దైవదర్శనం ముగించుకుని ఆలయం బయటకు వచ్చాడు.

ఆలయ ప్రాంగణములో భక్తులు అధిక సంఖ్యలో కూర్చునివుండడం గమనించాడు.

విషయం ఆరాతీస్తే ఆ రోజునుండి వారంరోజులు బ్రహ్మశ్రీ కామేశ్వరరావుగారి ప్రవచనాలని తెలిసింది. ఆయన గురించి వినడమే కాని ప్రవచనాలు వినలేదు కృష్ణమూర్తి.

"కాసేపు ఆయనచెప్పేదివిందాం" మనసు హెచ్చరికతో భక్తుల మధ్య కూర్చున్నాడు కృష్ణమూర్తి.

కామేశ్వరరావు గారు సరిగ్గా ఆరున్నరకు విచ్చేసి, ప్రార్థనచేసి, ప్రవచనం ప్రారంభించారు. ఆయన ముఖంలో గొప్పతేజస్సు గమనించాడు కృష్ణమూర్తి. "అష్టపుష్పపూజ" విషయంమీద ఆ రోజు ప్రవచనం.

అహింసా ప్రథమం పుష్పం - పుష్పమింద్రియ నిగ్రహః

సర్వభూత దయాపుష్పం - క్షమాపుష్పం విశేషతః

జ్ఞానపుష్పం - తపఃపుష్పం - ధ్యానపుష్పం తథైవచ

సత్య - మష్టవిధ పుష్పం విష్ణోఃప్రీతికరమ్ భవేత్.

శ్లోకంచెప్పి భగవంతుని పూజించే మార్గం తెలియజేశారు కామేశ్వరరావు గారు. ఏ జీవన విధానం అవలంబిస్తే భగవంతుడు సంతోషిస్తాడో వివరించారు.

మనిషి ఎలా జీవించాలో భారతం, రామాయణం, భాగవతాల్లోని శ్లోకాలు, పద్యాలు సందర్భోచితంగా ఉదహరిస్తూ, రెండు గంటలు అద్భుతంగా సాగిన ప్రవచనాన్ని మనసుపెట్టి విన్నాడు కృష్ణమూర్తి.

ఆ వాగ్ధాటికి మైమరచాడు. ఆనందానుభూతిలో పరవశించాడు.

"రెండు గంటలు రెండు నిముషాల్లా గడిచాయి" అనుకుంటూ ఇంటికి చేరాడు.

ఎనభై లక్షల జీవరాసుల్లో కేవలం మానవుడు మాత్రమే భగవంతుని స్మరించి పూజించగల ఏకైక ప్రాణి... అంతటి ఉత్కృష్ట జన్మ ప్రసాదించిన భగవంతుని సేవించడమంటే ధర్మబద్ధంగా జీవించడమే.

భగవంతుని ప్రసన్నం చేసుకోవడానికి మన జీవన విధానమే ప్రాతిపదిక... అహింసాయుత జీవనం గడపాలి... సమస్త జీవులను ప్రేమించగలగాలి... సత్యదీక్ష విడనాడకూడదు. ఇంద్రియ నిగ్రహం ఉండాలి.

కోరికలు ధర్మబద్ధంగా తీర్చుకోవాలి. కట్టుకునే బట్ట, తినే తిండి, భగవంతుని ప్రసాదంగా స్వీకరించాలి. తృప్తికి మించిన ఆనందంలేదు... స్వార్థచింతన విడనాడాలి. శివకేశవ భేదం మనిషి కల్పించుకున్నదే.

వివిధ రూపాలలో కొలవబడుతున్న భగవంతుడొక్కడే... పరమభక్తితో మన కార్యం, కర్తవ్యం చేసుకుంటూ వెళుతూ... మనం భగవంతుని కోరికలు కోరకుండా ఉండాలి.

భక్తితో భగవంతుని అడగడం మనకు చేతకాదు... ఈశ్వరుడు మనకు సముద్రం ఇవ్వగలడు... మనం నీటిబొట్లేఅడుగుతాం. అందుకని భగవంతుణ్ణి ఏమీ అడగవద్దు అన్నారు శంకరభగవత్పాదులు... మనకెంత ప్రాప్తమో అంతే అనుగ్రహించబడుతుంది"

ఇంటికి వచ్చిన చాలాసేపటివరకు ప్రవచన సారాంశం మనసులో మారుమ్రోగుతూనే ఉంది కృష్ణమూర్తికి. తరువాత వారంరోజులు గురువుగారి ప్రసంగాలు క్రమంతప్పక విన్నాడు కృష్ణమూర్తి.రెండో రోజు నుండి భార్యకూడా తోడు వెళ్ళింది.

కామేశ్వరరావుగారి ప్రవచనాలు భార్యాభర్తలు ఆలోచనాధోరణిలో చాలా మార్పు తెచ్చాయి.

"మంచి ఉద్యోగం..అనుకూలవతి అయిన భార్య.. ఇద్దరు పిల్లలు... నాకేం లోటు" అనుకుంటే ఎంతో తృప్తిగా అనిపిస్తోంది కృష్ణమూర్తికి. జీవితం ఉల్లాసభరితంగా ఉంది. స్వార్థచింతన లేకుండా భగవంతుని పూజించడం అలవాటు చేసుకున్నాడు కృష్ణమూర్తి. ఆనందంగా రోజులు గడుస్తున్నాయి.

సాయంత్రం ఆఫీసునుండి ఇంటికి వచ్చాడు కృష్ణమూర్తి.



## తప్పు ఏంటిట?

తెరపై తాము కనిపించే తీరూతెన్నులపై తమకు లేని అభ్యంతరాలు ఇతరులకు ఎందుకని కొందరు తారలు ప్రశ్నిస్తే, వినడానికి సబబుగానే ఉంటుంది. కృతీకర్బందా కూడా అదే సంగతిని అడిగింది.

"హీరోయిన్లు కనిపించే తీరుపై అదేపనిగా చర్చలు జరుగుతుంటాయి. అలా కనిపించడంలో మాకు ఇబ్బందిలేనంతవరకు ఇతరులు చర్చ జరపడం అనవసరం. హీరోలను షర్టు లేకుండా చూపినప్పుడు లేని అభ్యంతరం హీరోయిన్లను అందంగా చూపినప్పుడు ఎందుకట" అంటూ సూటిగా అడిగేసింది.

"విజయానికి సోపానాలు" పుస్తకం టేబుల్ మీద కనపడింది. చేతిలోకి తీసుకుని పేజీలు త్రిప్పాడు.

"నా స్నేహితురాలు ఇచ్చింది. నేను చదువుతున్నాను. మీరూ చదవండి... పట్టుదల, కృషి వుంటే సాధించలేనిదేమీ లేదని తెలుసుకున్నాను"

భర్తకి కాఫీ కప్పు అందిస్తూ చెప్పింది సుమతి.

సురేంద్రనాథ్ రాసిన ఆ పుస్తకాన్ని ఆసక్తిగా ఆ రాత్రి చదివాడు కృష్ణమూర్తి. మరునాడు ఆఫీసు నుండి వస్తూ పుస్తకాల షాపుకు వెళ్ళి సురేంద్రనాథ్ రాసిన వ్యక్తిత్వ వికాసానికి సంబంధించిన పుస్తకాలు మరికొన్ని కొని తెచ్చాడు కృష్ణమూర్తి.

భార్యాభర్తలిద్దరూ ఆ పుస్తకాల్ని చదివారు. ఆ పుస్తకాల్లోని విషయాలు చర్చించుకున్నారు.

**వా**రం తరువాత ఆ రోజు రాత్రి భార్యాభర్తలిద్దరూ భోజనం చేసి తీరికగా కబుర్లు కలబోసుకుంటున్నారు.

"నెలరోజులుగా నా ఆలోచనాక్రమంలో మార్పు వచ్చింది. మనసు ప్రశాంతంగా ఉంటోంది. ఇన్నాళ్ళూ అయాచితంగా ఏదో నిధి లభిస్తుందనే భ్రమలో బ్రతికాను. నిర్మాణాత్మకంగా కృషిచేస్తే నీ లక్ష్యం సిద్ధిస్తుందని నాకర్థమయింది.

నేను ఎమ్.బి.ఏ. ప్రైవేటుగా కడదామనుకుంటున్నాను. ఎమ్.బి.ఏ. చేస్తే ప్రమోషన్ వచ్చి ఆదాయం పెరుగుతుంది లేదా ఇంతకంటే మంచి ఉద్యోగానికి మారవచ్చును. రేపే పుస్తకాలు తెస్తాను" అని అన్నాడు కృష్ణమూర్తి.

"నా మనసులో మాట మీ నోట వింటున్నాను. మీలో ఏదో సాధించాలనే తపన గమనిస్తున్నాను. మీకు నా సహాయం పూర్తిగా ఉంటుంది" భరోసా ఇచ్చింది భార్య.

"పిల్లలు ఇద్దరూ పెద్దవాళ్ళవుతున్నారు... పిల్లలు స్కూలుకి వెళ్ళినతర్వాత నాకేం తోచడంలేదు.నాకు టైలరింగ్ తెలుసుకదా. మా ఊళ్ళో ఫ్యాషన్ టెక్నాలజీ సెంటర్‌లో మూడునెలలు ట్రైనింగ్ తీసుకుంటాను. మోడరన్ డ్రెస్‌లు కుట్టడంలో మెళకువలు తెల్సుకుంటాను. లేడీస్ టైలరింగ్ మొదలెడదామనుకుంటున్నాను. ఏమంటారు" అడిగింది సుమతి.

ఆమెకి తన ఖాళీ సమయాన్ని సద్వినియోగం చేసుకోవాలని తహతహగా ఉంది.

"శుభస్య శీఘ్రం... రేపే ఆ సెంటర్‌లో చేరు" ప్రోత్సహించాడు భర్త.

**మ**రో నాలుగు నెలలతరువాత...

మార్కెట్ సెంటర్‌లో గది అద్దెకు తీసుకుని 'సుమతి లేడీస్ టైలరింగ్ షాపు' తెరచింది.

భగవంతునికి నమస్కరించి, తన ప్రయత్నం సఫలమవ్వాలని కోరుకుంది.

తన ఇంటిచుట్టుప్రక్కల అందరికీ తను టైలరింగ్ షాపు తెరుస్తున్నట్లు ప్రచారం చేసింది. కృష్ణమూర్తి ఆఫీసులో కొలీగ్స్‌కి విషయం చెప్పాడు.

మరో రెండు నెలల తరువాత...

సుమతి చేతినిండా పని... క్షణం తీరిక లేకుండా... రాత్రి చాలాసేపటివరకు ఆమె తన పనిలో నిమగ్నమయ్యేది.

**కాంగ్రెస్‌తో నాది రాజకీయ ఒప్పందం కాదు... మా సామాజిక వర్గానికి రిజర్వేషన్ల ఒప్పందం.**

**-హార్దిక్ పటేల్, పటేల్ కుల నేత**



పనిభారం పెరగడంతో షాపులో ఇద్దరు అసిస్టెంట్స్‌ను టైలరింగ్ పనికి చేర్చుకుంది. సంవత్సరంలో సుమతి బ్యాంకు బ్యాలన్స్ లక్షరూపాయలు దాటింది.

ఆ కుటుంబం ఆర్థికంగా ఓ మెట్టు ఎదిగింది. మరో ఇద్దరికి ఉపాధి కల్పిస్తోంది...

**మా**రుతున్న అభిరుచులకు అనుగుణంగా కొత్త కొత్త డిజైన్స్‌లో కస్టమర్స్‌కి బట్టలు కుట్టడం, అనుకున్న టైముకి డెలివరీ ఇవ్వడం సుమతి పెట్టుకున్న నియమాలు. కస్టమర్స్‌తో స్నేహంగా మెలగడం ఆమె అలవరచుకుంది.

కొద్దికాలంలోనే లేడీస్ టైలర్‌గా సుమతి మంచి పేరు సంపాదించింది. వ్యాపారమూ అభివృద్ధిపథంలో సాగిపోతోంది. మరో సంవత్సరంలో మరో నలుగురు టైలర్స్‌ని చేర్చుకుని మరింత విశాల ప్రాంగణంలోకి షాపు మార్చింది సుమతి.

**నా**లుగు సంవత్సరాలతర్వాత... కృష్ణమూర్తి ఎమ్.బి.ఏ. పూర్తిచేశాడు. ఆఫీసర్‌గా ప్రమోషన్ పొందాడు. సుమతి సంవత్సరాదాయం నాలుగు లక్షలకు చేరింది. వచ్చిన ఆదాయం జాగ్రత్తగా బ్యాంకులో డిపాజిట్టు చేస్తోంది సుమతి.

భార్యాభర్తల ఆదాయం లెక్కించి, ఓ ప్రైవేటు బ్యాంకువారికి ఏభై లక్షలు హౌసింగ్ లోన్ మంజూరు చేసింది. పదిలక్షలు మార్జిన్ మనీ సమకూర్చుకుని, త్రీ బెడ్‌రూమ్ అపార్ట్‌మెంట్ స్వంతం చేసుకున్నారు కృష్ణమూర్తి దంపతులు. గృహప్రవేశానికి బంధుమిత్రులు విచ్చేసి అభినందించారు.

భక్తిశ్రద్ధలతో శ్రీ సత్యనారాయణస్వామి వ్రతం చేసుకున్నారు దంపతులు.

"**నా**లుగైదేళ్ళ క్రితం టూ బెడ్‌రూమ్ అపార్ట్‌మెంట్ కొనడానికి తాహతులేని మనం అప్రయత్నంగా అదృష్టం కలిసొచ్చి డబ్బు సమకూడుతుందని కలలు కన్నాం. మానవ ప్రయత్నంలేకుండా లక్ష్యం సిద్ధించదని ఆ రోజుల్లో తెలుసుకోలేకపోయాం.

ఆ పరమేశ్వరుడే మనకో మార్గం చూపించాడు. కార్యసిద్ధికి ప్రణాళికను మన మనసుల్లో రగిలించాడు. భగవంతుడు చూపిన మార్గంలో పయనించి విజయం సాధించాం... 'కష్టేఫలే' అన్నారందుకే" చెప్పాడు కృష్ణమూర్తి సామాన్లు సర్దుతూ.

"అవునండీ... మీరన్నది నిజం... కలలు కనండి. అవి నిజం చేసుకోండి అన్న అబ్దుల్ కలామ్‌గారి సందేశం మనకెంతో స్ఫూర్తిదాయకం.

మనలాంటివారిలో జ్ఞానజ్యోతి వెలిగిస్తున్న ప్రవచనా చక్రవర్తులకు, వ్యక్తిత్వ వికాస నిపుణులకు నమస్సుమాంజలులర్పిద్దాం. భగవంతుడు ఇచ్చిన మేధను, శక్తిని సక్రమమార్గంలో వినియోగించి పదిమందికి సహాయపడదాం. భగవంతుని కృపకు పాత్రులవుదాం" ముక్తాయించింది సుమతి వంటింట్లో పాలు పొంగిస్తూ.



# గిల్లికజ్జాలు తెచ్చుకునే అమ్మాయి

## ఆత్మబలం

ప. అ. గిల్లికజ్జాలు తెచ్చుకునే అమ్మాయి -
నీ కళ్ళల్లో వున్నదీ బలే బడాయి
గిల్లికజ్జాలు తెచ్చుకునే అమ్మాయి -
నీ కళ్ళల్లో ఉన్నదీ బలే బడాయి

ఆ. బుల్లికారున్న షోకిల్లా అబ్బాయి -
నీ ఫోజుల్లో వున్నదే బలే బడాయి
బుల్లికారున్న షోకిల్లా అబ్బాయి -
నీ ఫోజుల్లో వున్నదే బలే బడాయి

చ. అ. వయసు తోటి దోర దోర సొగసులొస్తాయి
సొగసులతో ఓర ఓర చూపులొస్తాయి ॥2॥
చూపులతో లేనిపోని గీరలొస్తాయి
ఆ గీరలన్నీ జారిపోవు రోజులొస్తాయి ఆ. ॥బుల్లికారున్న॥

చ. ఆ. కుర్రకారు కోరికలు గుఱ్ఱాల వంటివి
కళ్ళాలు వదిలితే కదం తొక్కుతాయి ॥2॥
పట్టు తప్పినంతనే పరుగే తీస్తాయి
ఒళ్ళు దగ్గరుంచుకుంటే మంచిదబ్బాయి అ. ॥గిల్లి॥

చ. అ. మొదట మొదట కళ్ళతోటి మొదలుపెట్టి లడాయి
హృదయమంత పాకుతుంది హుషారైన హాయి
కలకాలం వుండదు ఈ పడుచుబడాయి
తొలినాడే చల్లబడి పోవునమ్మాయి ॥బుల్లికారున్న॥

చ. ఆ. కళ్ళుచూసి మోసపోయి కలవరించకూ
ఓరచూపు కోరచూపు ఒకటనుకోకు ॥2॥
ఇస్తేను హృదయమెంతో మెత్తనైనదీ...
ఎదురు తిరిగితే అదే కత్తివంటిదీ...
అ. ॥గిల్లికజ్జాలు॥ ఆ. ॥బుల్లికారున్న॥

సంగీతం కె.వి.మహదేవన్ గానం ఘంటసాల, సుశీల




# తగిలిందయ్యో తగిలింది పైరగాలి

## బంగారు బాబు

ప. తగిలిందయ్యో తగిలింది పైరగాలి
ఎగిరిందమ్మా ఎగిరింది పైటకొంగు
తగిలింది - ఎగిరింది - అయ్యయ్యయ్యో
మనసే వురకలు వేసింది
నా మనసే వురకలు వేసింది

చ. కొమ్మ కొమ్మనా జంటలు చూస్తే
పువ్వు పువ్వునా తుమ్మెదలుంటే
గుండెలుడ రెపరెపమంటుంటే
అమ్మమ్మమ్మో - వయసే బుసబుసపొంగిందీ
నా మనసే వురకలు వేసింది... ॥తగిలిందయ్యో॥

చ. మబ్బును మబ్బు ముద్దులాడితే
సిగ్గున నింగి ఎర్రబారితే
ఎన్నడు చూడని అందాలు
చూశానమ్మా ఈనాడు
అమ్మమ్మమ్మో - వయసు మనసూ ఒకటూ
నా ఉసురు పోసుకున్నాయి..... ॥తగిలిందయ్యో॥

చ. అమ్మా!
తులశమ్మా! హారతులందుకొమ్మా!
కల్పవల్లివి - తల్లివి
కన్నెమనసు నెరిగి
దీవించి వరమిచ్చి యేలవమ్మా!

సంగీతం కె.వి.మహదేవన్ గానం పి.సుశీల

# జ్యోతికను కలవండి

పిల్లల్ని పెంచడమనేది ఏ తల్లిదండ్రులకు అయినా గొప్ప ఛాలెంజ్. ఎన్నెన్నో రకాల ప్రభావాలనుంచి వారిని కంటికిరెప్పగా కాచుకోవడమన్నది చిన్న విషయం కాదు. ఎప్పుడూ కెరీర్ పరుగులో, నిరంతర షూటింగ్‌లలో వుండే సెలబ్రిటీల జంట తమ పిల్లల్ని ఎలా తీర్చిదిద్దుతారు? తెలుసుకోవాలన్న కుతూహలం అనేకమంది అమ్మలకు ఉంటుంది.



సెలబ్రిటీ జంట జ్యోతిక-సూర్యలు తమ పిల్లల్ని ఎలా పెంచుతారు? ఇదే విషయాన్ని ప్రశ్నిస్తే, కెరీర్‌లో రెండో ఇన్నింగ్స్ ఆరంభించిన జ్యోతిక తన పదేళ్ళ కూతురు దియా, ఏడేళ్ళ కొడుకు దేవ్‌ల గురించి, తాను వారిని పెంచేతీరు గురించి ముచ్చటయిన కబుర్లు చెప్పుకొచ్చింది.

## సూర్య లిబరల్

"పిల్లల నియంత్రణకు సంబంధించి నేను స్ట్రిక్ట్. సూర్య మంచి కాప్. వాళ్ళకు ఏది నచ్చితే అది చేయడానికి అనుమతి ఇస్తుంటాడు. అమ్మలు అలా కాదు కదా! (నవ్వేస్తూ) నేనో నిబంధనల పుస్తకాన్ని. అతను మంచివాడు. నేను ప్రతిదానికి 'నో' చెప్తా.

ఐస్‌క్రీమ్‌ల నుంచి హోమ్‌వర్క్‌లదాకా-జాబితా చాలా పెద్దది. వాళ్ళ నాన్న మాత్రం చాలా విషయాలను సమ్మతిస్తుంటాడు. కాబట్టి, నేను ఎప్పుడైనా షూటింగ్‌లతో ఆలస్యంగా వస్తే, వాళ్ళిద్దరూ వాళ్ళ నాన్నతో రాత్రి తొమ్మిదిన్నరదాకా కథలతో సంతోషంగా కాలక్షేపం చేసేస్తారు.

మా పిల్లలు పియానో తరగతులకు వెళ్ళడానికి వీకెండ్స్‌లోకూడా ఉదయాన్నే నిద్రలేస్తారు. మరీ ఆరింటికి కాకుండా, కొంచెం ఆలస్యంగా లేస్తారు"

## సెలవుల సరదాలు

"వారాంతాల్లో, సెలవుల్లో ప్రయాణాలు చేస్తుంటాం. ట్రెక్కింగ్ వారికిప్పుడు కొత్త సరదా. తొమ్మిది వేల అడుగుల ఎత్తున్న పర్వతానికి తీసుకువెళ్తే, ఆరుగంటలు ట్రెక్కింగ్ చేశారు.

దేవ్ బాగా ఎక్కాడు. ప్రతి ఏటా వారితో ట్రెక్కింగ్‌కు వెళ్ళడానికి సూర్య, నేను ప్లాన్ చేస్తుంటాం. ప్రతి సంవత్సరం ఇండియాలో ఓ మంచి ప్రదేశాన్ని మా పిల్లలకు చూపిస్తుంటాం.

మా కుటుంబసభ్యులందరం కలసి టబూ, స్ట్రాటజీ వంటి అనేక ఆటలు ఆడుతుంటాం. ఐప్యాడ్‌లో ఆడుకుంటూ తండ్రీ కొడుకులు కలసి బోలెంత సమయం గడుపుతుంటారు.

నేను మాత్రం పిల్లలు వీడియోగేమ్స్ ఆడడానికి రోజుకు అరగంట మాత్రమే కేటాయిస్తుంటా. చాలా క్లాసులకు వెళ్తుంటారు. మా అమ్మాయి బాడ్మింటన్ ఆడుతుంది. భరతనాట్యం నేర్చుకుంటున్నది.

నా కొడుకు కరాటే చేస్తాడు. ఇటువంటి అదనపు కార్యకలాపాలు వారికి గొప్ప ఎక్స్‌పోజర్ ఇస్తాయి. నాకు చిన్నతనంలో ఇన్ని అవకాశాలు లేకపోయాయి. ఇవన్నీ తమకు గల సమయాన్ని నిర్మాణాత్మకంగా ఉపయోగించుకోడానికి వీలు కల్పిస్తాయి.

క్రమంతప్పని రొటీన్ క్రమశిక్షణ నేర్పుతుంది. విభిన్న స్కూల్స్‌కు చెందిన పిల్లలను కలుస్తారు కాబట్టి, ఇతరులతో కలివిడిగా వుండడం అలవడుతుంది. టీవీ, ఐప్యాడ్‌లకు వారిని పరిమితం చెయ్యకూడదన్నది నా అభిప్రాయం. అదనపు తరగతులు వీటికి దూరంగా వుంచుతాయి"

## మా దైనందిన కార్యక్రమాలు

"ఉదయం పిల్లల్ని స్కూల్‌లో దింపిరావడంతో మొదలవుతుంది. షూట్ వుంటే వెళ్ళిపోతా. లేకుంటే ఫ్రెండ్స్‌తో కాఫీకి వెళ్తా. లేదా నా రూమ్‌లో ఉండిపోతా. ఏం చేయాలనిపిస్తే అది చేస్తాను-

టీవీ చూడడం, సంగీతం వినడం లేదా యోగా చేయడం లాంటివి. ఒంటిగంట దాకా నా స్వంత టైమ్ వుంటుంది. పిల్లలు వచ్చేస్తే, ఇక వారిదే టైమ్. వారితో కలసి కూర్చోవడం, లంచ్ చేయడం, వారి ఎక్స్‌ట్రా కెరిక్యులర్ కార్యకలాపాలకు పంపడం లాంటివి. వారితో హోమ్‌వర్కులు చేయించడం ఓ గంట ఉద్యోగం. తర్వాత డిన్నర్, తర్వాత నిద్ర.

అర్ధరాత్రులదాకా బయటకువెళ్ళే అలవాటు మాకు లేదు. ఒకవేళ మేం ఇద్దరం కలసి బయటకు వెళ్ళాలనుకుంటే మధ్యాహ్నం లంచ్‌కు వెళతాం. అందరం చాలా త్వరగా నిద్రపోతాం. వినేవారికి ఇది బోరింగ్ రొటీన్" (నవ్వేస్తూ).

## సూర్యతో సమయం

"పని లేకపోవడం తక్కువ. ఆదివారాలుమాత్రం పనిలేకుండా జాగ్రత్తపడుతుంటాడు. ఉదయాన్నేజిమ్ చేస్తాడు. సాయంత్రం ఆరున్నర ఏడింటికల్లా ఇంటికి వచ్చేస్తాడు. అప్పటినుంచి రాత్రి తొమ్మిదింటివరకు మా ఫ్యామిలీటైమ్. స్కూలుకు వెళ్ళాల్సిన ముఖ్యమైన కార్యక్రమాల తేదీలు సూర్య నోట్ చేస్తాడు.

ఒక్క స్పోర్ట్స్‌కాని, వార్షికోత్సవంకాని మిస్సవడు. పని ఉన్నప్పుడు మినహా, మిగతా సమయం అంతా పిల్లలతోనే గడుపుతాడు. వారిని నిద్రపుచ్చుతాడు. వారిపట్ల ఎంతో జాగ్రత్తగా వుంటాడు"

## ప్రత్యేక క్షణాలు

"ఓ తల్లిగా 'అమ్మ' అని పిలిపించుకోవడమే స్పెషల్. అత్యంత ప్రత్యేక సందర్భం వాళ్ళు పుట్టిన క్షణాలు.సూర్య, నేను బిడ్డనుపట్టుకుని చూసుకోవడం. ఈ మధురక్షణాన్ని వర్ణించే మాటలు లేవు. రోజులో నాకు నచ్చే ప్రత్యేకత పిల్లల్ని నిద్రపుచ్చడం. నిద్రించడానికి పదినిమిషాలముందు కథలు చెప్తాను.

వాళ్ళు ఎన్నో విషయాలు నాతో షేర్‌చేసుకుంటారు. వాళ్ళేంచేయాలనుకుంటున్నారో చెపుతారు. నచ్చిన పుస్తకం చదవమంటారు. రోజులో అదో ప్రత్యేక సందర్భం. పిల్లల నోటివెంట వినపడే 'ఐ లవ్ యు అమ్మ' అన్నపదం నాకెంతో ఉత్తేజాన్నిస్తుంటుంది.

"మేం నలుగురం ఒకే గదిలో పడుకుంటాం. వారిని వారి గదికి మార్చే ప్రయత్నం చేస్తున్నాం.



Courtesy : PARENT CIRCLE

ఈమధ్య కొత్త ఇంటికి మారాం. వారికోసం అందమైన గది ఏర్పాటుచేశాం. కాని, మా పిల్లలు మమ్మల్ని వదిలిపడుకోవడానికి ఇష్టపడరు.

బహుశా అందుకు ఇంకో రెండు మూడేళ్ళు పడుతుందేమో. మాలో ఎవరు కూల్‌గా వుండే పేరెంట్ అనడిగితే- మా అబ్బాయికి వాళ్ళ నాన్న, మా అమ్మాయికి నేను" అని చెప్పింది.

## సెలబ్రిటీ స్టేటస్

"మా కుటుంబంలో అందరం సెలబ్రిటీలమే. మా మామగారి దగ్గరనుంచి. కానీ, మా పిల్లల్ని మా సినిమాలు అన్నింటికీ ఎక్స్‌పోజ్ చేయలేదు. వాళ్ళు కూడా పెద్దగా సినిమాలు చూడరు.

కొన్నింటిని మాత్రమే చూపుతాం. స్కూల్లో మా సెలబ్రిటీ స్టేటస్ అస్సలు కనపడదు. వాళ్ళ ఫ్రెండ్స్ గ్రూపులో కూడా. పిల్లలతో తల్లిదండ్రులు తప్పనిసరిగా ప్రతిరోజూ ఓ గంటయినా పూర్తి సమయాన్ని గడిపితీరాలి. రాత్రి భోజనం కలిసి చేయాలి.

కబుర్లు చెప్పుకోవాలి. ఆడుకోవాలి. దీనివల్ల వారి ఆలోచనలను తల్లిదండ్రులు స్వేచ్ఛగా చెప్పగలుగుతారు. పిల్లలతో కలసి ప్రయాణాలు చేస్తుండాలి. కుటుంబబాంధవ్యం చాలా బావుంటుంది. తల్లిదండ్రులు పిల్లలకు ఓ ఉదాహరణగా నిలవాలి"

**పెంపక ప్రభావం :** నేను పెరిగిన తీరు నన్నెంతో ప్రభావితం చేస్తుంటుంది. నాకు ఇద్దరు సోదరీలు, ఓ సోదరుడు ఉన్నారు.మా అమ్మానాన్నలు మా అందరినీ సమానంగా చూసేవాళ్ళు. ఎంతో విశ్వాసాన్ని పెంపొందించారు. స్వతంత్రంగా ఉండడాన్ని మా అమ్మ నేర్పేది. దృఢమయిన తండ్రికంటే దృఢంగా ఉండే తల్లి ముఖ్యమని నాకు అనిపించేది.

సూర్య, కార్తీలను తీసుకుంటే మహిళలపట్ల వారికి ఎనలేని గౌరవం. సూర్య నన్నెప్పుడూ తనతో సమంగానే భావిస్తాడు.

మనకు మనమే స్ఫూర్తి కావాలి. పదేళ్ళు పని చేశాను. కొన్నేళ్ళు ఇంట్లో ఉండిపోయాను. బహుళ పనులు చేయగలమని మహిళలు గర్వించాలి"

## విజయబాట

"తల్లిదండ్రులు ఎప్పుడూ సంతోషంగా ఉంటే పిల్లలూ సంతోషంగా ఎదుగుతారు. సక్సెస్ సాధిస్తారు. పిల్లలముందు ఏ సమస్యలనూ చర్చించకూడదు. అది పిల్లలకు సంబంధించినదే అయినా సరే. పెద్ద నిర్ణయాల్లో భార్యాభర్తలు ఇద్దరూ ఒకే అభిప్రాయంతో ఉండాలి.

ఒకవేళ ఇద్దరికీ భిన్నాభిప్రాయాలు ఉంటే విడిగా చర్చించుకోవాలి. పిల్లలకు సంబంధించి ఏకాభిప్రాయం వ్యక్తంచేయాలి. అప్పుడే పిల్లల మానసిక, శారీరక ఎదుగుదల ఆరోగ్యపూరితంగా ఉంటుంది" అంటూ ముగించింది జ్యోతిక.

వి.లావణ్య



# వారఫలం

డిశంబరు 14 నుండి 20, 2017 వరకు

పిడపర్తి వీరేశ్వరశాస్త్రి,
పిడపర్తి భాస్కర సుబ్రహ్మణ్యశాస్త్రి
సెల్ : 94921 56064

Courtesy : MERI SAHELI

**మేషం:** అశ్విని, భరణి, కృత్తిక 1వ పా. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించుకునే వారికి అనుకూలతలుంటాయి. సాహస కార్యాలకు దూరంగా ఉండండి. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలందు సాధారణతలు కొనసాగుతాయి.ఆదాయము, ఖర్చులు సమానంగా ఉంటాయి. అవగాహన లేని వ్యవహారాలకు దూరంగా ఉండుట ఉపకరించగలదు. ఆరోగ్యం సహకరించగలదు. భాగస్వామితో సంయమనము లతో వ్యవహారించుకోవాలి. వీరిక గురు, శుక్ర వారాలు మేలైనవి.

**వృషభం:** కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా. ముఖ్యం అనుకున్న పనులను మాత్రమే చేపట్టుకోవాలి. సమస్యలు కొన్ని అధికం అవ్వగలవు. మంచి చేసినా చెడుగా మారుతుంది. వృత్తి, వ్యాపారాలందు చేతిదాకా వచ్చిన పనులు చివర నిమిషంలో ఆగిపోగలవు. పెద్దల సలహాలు, కుటుంబ వ్యక్తుల సలహాలు పాటించుకోవాలి.నూతన వస్తు కొనుగోళ్ళ విషయంలో అవసరాలకుమించి కొను గోలు చేయు సూచనలున్నాయి. ప్రయాణాలు సౌఖ్యదాయకంగా ఉంటాయి. ఈ రాశివారికిగురు, శుక్ర, శని, ఆది వారములు మేలైనవి.

**మిథునం:** మృగశిర 3, 4పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3పా. పట్టుదలలతో పని చేసుకుని పనులను సకాలంలో పూర్తిచేసుకోగలుగుతారు. కుటుంబ వ్యక్తుల, బంధుమిత్రుల మాటలు ఆలోచనల్ని ఏర్పరచగలవు. పెట్టుబడులందు వివేకం చూపుకోవాలి. ఖర్చులకు తగిన ఆదాయములువుంటాయి.ఇంటిసమస్యలు పైకిరాకుండా లౌక్యవ్యవహారాలు అవసరం. భ్రాతృ వర్గమున స్వార్థపూరితంగా ఆలోచనలు చేయగలరు. ఆదిత్య, దుర్గారాధనలుపకరించగలవు. శని, ఆది, సోమ, బుధ వారాలు అనువైనవి.

**కర్కాటకం:** పునర్వసు 4వ పా, పుష్యమి, ఆశ్లేష. ప్రయత్న కార్యములను ముమ్మరము చేయగలరు. కష్టానికి తగిన ప్రయోజనాలు పొందుతారు. కీర్తి-ప్రతిష్ఠలను ఏర్పరచుకోగలరు. వృత్తి, ఉద్యోగములందు ఆశించిన ఫలితాలు ఉంటాయి. ఖర్చులకు తగిన ప్రయోజనాలు పొందుతారు. నూతన ప్రయోజనాలు నూతన పరిచయాలవలన ఏర్పడతాయి. పూర్వార్జితాలనుండి, స్థిరాస్తులనుండి ప్రయోజనాలు ఏర్పరచుకోగలరు. ఈ రాశివారు ముఖ్యమైన పనులు చేపట్టుటకు ఆది, సోమ, బుధ వారాలు అనువైనవి.

**సింహం:** మఖ, పూర్వఫల్గుని,ఉత్తరఫల్గుని 1వ పా.చిన్నతరహా ఘర్షణాత్మకంగా వ్యవహారాలను సాగించవలసి ఉంటుంది. అవకాశాలను కొన్నిటిని మీ అంతట మీరుగా దూరం చేసుకొను సూచనలున్నాయి. జాగ్రత్తలు అవసరం. అవసరాలకు కావలసినట్లు డబ్బు సర్దుబాటు అవుతుంది. విద్యార్థులు, నిరుద్యోగులు అన్య విషయాసక్తతలు వుండకుండా వ్యవహరించుకోవాలి. భ్రాతృవర్గంచే ప్రయోజనాలు, మెచ్చుకోలు వాక్యాలు ఉంటాయి. సంతానంచే శుభవార్తలుంటాయి. ఈ రాశివారికి గురు, శుక్ర, శని వారములు అనువైనవి.

**కన్య:** ఉత్తరఫల్గుని 2, 3, 4పా, హస్త, చిత్త 1, 2పా. మీ యత్నాలకు సంప్రదింపులు తోడుచేయుట మేలుచేయగలదు. బంధుమిత్రుల రాకపోకలు-కొన్ని పరామర్శలకు ప్రాధాన్యతనీయవలసి ఉంటుంది.ఆరోగ్యమందు జాగ్రత్తలతో వ్యవహరించుకోండి. అధికారులు పెడసరితనంగా సాగినా మీకు మేలును ఏర్పరచగలరు. ఆదాయాలను పెంచగలరు. స్థిరాస్తులను పెంచు ఆలోచనలు కొందరికి ఉపకరించగలవు. నిరుద్యోగుల భవిష్యత్‌కు పునాదులు ఏర్పరచుకోగలరు. నిర్ణయాలందు స్పష్టతలేర్పడతాయి. శని, ఆది, సోమ వారాలు అనువైనవి.

**తుల:** చిత్త 3, 4పా, స్వాతి, విశాఖ 1, 2, 3పా. జన్మకుజేతర గ్రహాలు అనుకూలం. సమస్యలను క్రమంగా అధిగమించగలుగుతారు. అభీష్టసిద్ధికై యత్నాలను చురుకుగా చేయగల్గుతారు.మిత్ర సహకారాలు, ఉత్సాహమునిచ్చు వార్తలు వింటారు. ఖర్చులు ఒకింత ఎక్కువుగా ఉంటాయి. ముఖ్య వ్యవహారాలందు సమయానుకూలంగా వ్యవహరించుకోగల్గుతారు. కుటుంబమున ఆహ్లాదకర వాతావరణం ఉంటుంది. ఆవేశపూరిత వాతావరణంలో మౌనంగా సాగండి. వాహన, యంత్రాదుల వాడకంలో మెలకువలు అవసరం. ఈ రాశివారు ముఖ్యమైన పనులు చేపట్టుటకు గురు, శుక్ర, శని, ఆది వారాలు అనువైనవి.

**వృశ్చికం:** విశాఖ 4వ పా, అనూరాధ, జ్యేష్ఠ. నమ్మకంగా వ్యవహరించుకోగలరు. ప్రయత్నాలు ప్రయోజనాలను ఇస్తాయి. రాబోయే కాలానికి తగినట్లు ప్రణాళికలను రూపొందించుకోగలుగుతారు.ప్రతీది సొంతంగా ఆలోచించి నిర్ణయాలు తీసుకోవడం మేలు. ఆర్థికపరమైన అంశాల్లో శుభఫలితాలు ఉన్నాయి. బంధుమిత్రులతో తగుమాత్రంగా వ్యవహరించుకోవడం మేలుచేయగలదు. మెడిటేషన్‌లకు, ఆధ్యాత్మికతలకు ప్రాధాన్యతనీయండి. ఈ రాశివారికి శని, ఆది, సోమ వారాలు అనువైనవి.

**ధనుస్సు:** మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వపా. అన్నిటా అప్రమత్తంగా సాగాలి.పొరపాట్లు జరగకుండాపనులు చేపట్టుకోవాలి. ఆర్థికావసరాలకై తగు ఏర్పాట్లు అవసరమవుతాయి. చెల్లింపులకు ప్రాధాన్యతనీయండి. చెడు ఊహించుకుంటూ మంచికై యత్నాలను సాగించాలి. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలందు తడబాటువ్యవహారాలుండకుండా జాగ్రత్తలు అవసరం. గురు, శుక్ర, సోమ, బుధ వారాలు అనువైనవి.

**మకరం:** ఉత్తరాషాఢ 2, 3, 4పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2పా. పని ఒత్తిడులు పెరుగుతాయి. ఏకాగ్రతలు, పట్టుదలలు ప్రదర్శించి ఖర్చులు కూడా కొన్ని పెరుగుతాయి. కుటుంబవ్యక్తుల సలహాలు ఉపకరించగలవు. కుటుంబ వ్యవహారములందు సమిష్టినిర్ణయాలకు ప్రాధాన్యతనీయండి.వృత్తి,ఉద్యోగాలందు ఎప్పటి పనుల్ని అప్పుడు పూర్తిచేసుకోండి. వ్యాపారాలందు కాలానుగుణంగా వ్యవహరించుకోవాలి. బంధువర్గంనకు చేయూతనీయవలసిరావచ్చును. విద్యార్థులకు అనుకూల సమయం. గురు, శుక్ర, శని, ఆది వారములు అనువైనవి.

**కుంభం:** ధనిష్ఠ 3, 4పా, శతతార, పూర్వాభాద్ర 1, 2, 3పా. పరిస్థితులు అనుకూలంగా ఉంటాయి. ధనలాభ సూచితములున్నాయి. సందర్భానుసారంగా వ్యవహరించుకోగలరు. శుభకార్యాలందు పాల్గొనగలరు. కొన్ని గత సమస్యలకు శాశ్వత పరిష్కారాలను ఏర్పరచు దిశగా సాగుతారు. కుటుంబమున ఉత్సాహాలు ఏర్పడతాయి. నిరుద్యోగులు తొందరపడవలసిన సమయం-విజయావకాశాలు ఎక్కువ. ఉద్యోగాలందు తగిన గుర్తింపులేర్పరచుకోగలరు. ఖర్చులు ఒకింత ఎక్కువ. ఈ రాశివారికి శని, ఆది, సోమ, బుధ వారాలు అనువైనవి.

**మీనం:** పూర్వాభాద్ర 4వ పా, ఉత్తరాభాద్ర, రేవతి. ఆలోచనలందు ఊగిసలాటలకు గురికాకుండా యత్నించుకోవాలి. మీ ప్రయత్నాలకు పట్టుదలలు జోడించాలి. అవసరాలను దృష్టిలో పెట్టుకుని పనిచేయాలి. అధికారిక కార్యక్రమంలో పాల్గొనగలరు. వాహన, యంత్రాదుల వాడకంలో నియమ-నియంత్రణలకు ప్రాధాన్యతనీయండి. ఆత్మీయుల రాకపోకలుంటాయి. ఋణ సమస్యలు కొన్ని ఇరకాటం పెట్టు సూచనలున్నాయి. ఋణదాతలకు అందుబాటులో ఉండండి. వీరికి గురు, శుక్ర వారములందు అన్నిటా యోచనలు అవసరం.

# సత్యాన్వేషణ

## శ్రీ వేంకటేశుని సేవ

(తేది : 16.12.2017)

తిరుమల శ్రీ వేంకటేశ్వరుని ఆలయంలో కూడా ఈ డిశంబరు 16 నుండి జనవరి 14 అంటే మకర సంక్రమణం వరకూ వేంకటేశ్వరుడిని కృష్ణునిగా అలంకరిస్తారు.

ప్రతినిత్యం జరిగే సుప్రభాత సేవ (సుప్రభాతాన్ని వినిపించే కార్యక్రమం) బదులు గోదాదేవి పాడిన పాశురాలనే గానం చేస్తారు.

శ్రీ వేంకటేశుని వక్షఃస్థలంలో కుడివైపున ఎర్రనికెంపులుపొదిగిన బంగారు చిలుక బొమ్మనీ, ఎడమవైపున ఆకుపచ్చని తమలపాకుల్తో చేసిన చిలుక బొమ్మనీ స్వామికి అలంకరిస్తారు.

నడుంకికూడా తిరుప్పావై బంగారు పతకమాలని అలంకరిస్తారు. తులసి దళార్చనకి బదులుగా మారేడు దళాలతో అర్చన జరుగుతుంది తోమాల సేవ తర్వాత. ❐

## నెల పట్టడం

(తేది : 16.12.2017)

సూర్యుడు మకరరాశిలోకి రాబోతూ మకర సంక్రాంతిని చేయబోతున్నాడని తెలియజేయబోతూ- సూచిస్తూ- ఈ డిశంబరు 16 నుండి అన్నీ దైవసంబంధ కార్యాలనే చేయాలని నిర్ణయిస్తూ ఈ రోజు నుండి 'నెలపట్టడం' (ఒక నెల రోజుల దీక్షని చేపట్టాం) అని ఓ ప్రకటనని దేవాలయాల్లో విన్పిస్తారు.

అంటే- ఈ రోజు నుండి ఓ నెల రోజులు మానవులకి సంబంధించిన ఏ తీరు శుభకార్యక్రమాలూ ఉండకూడదని నిషేధించటం. ఈ నెలరోజులూ దైవకార్యక్రమాల్లోనే గడపాలని తీర్మానించడం అన్నమాట! ❐

## హోమం ప్రధానం

'అక్షరానికి లక్షమార్లు చొప్పున ఫలాని మంత్రాన్ని మేం మననం చేశా' మంటూ కొందరు అనడాన్ని మనం వింటుంటాం. నమశ్శివాయ మంత్రం ఐదు అక్షరాలదైతే ఆ మంత్రాన్ని ఐదు లక్షలమార్లు మననంచేయడాన్నే 'అక్షర లక్ష జపం' అంటారు.

అయితే ఆ మంత్రం అంతమాత్రం చేత ఫలించెయ్యదు- అంటే ప్రయోజనాన్ని మనకి అందించదు.

దాంట్లో పదవవంతు అంటే- ఐదు లక్షల్లో 10వ వంతు 50 వేలు కాబట్టి, 50 వేలమార్లు తర్పణం (పురోహితులకి తెలుస్తుంది). ఆ తర్వాత దీంట్లో పదవవంతు అంటే అయిదువేల పర్యాయాలు అదే మంత్రంతో హోమాన్ని చేయాలి. అప్పుడే ఆ మంత్రం తన ఫలితాన్ని విడుదల చేసి పనిచేసేలా చేయగలుగుతుంది.

'అగ్నిముఖా వై దేవాః' దేవతలు అంతా అగ్నిద్వారానే విషయాలనితెల్సుకుంటూవుంటారు కాబట్టి హోమాన్ని గాని చేసినట్లయితే, ఆ అగ్ని ఆ విషయాన్ని గ్రహించిఫలానిదైవానికిసంబంధించిన మంత్రం సక్రమంగా మననం చేయబడింది! అని ఆ దైవానికి స్వయముగా తెలియజేస్తాడు. కాబట్టి హోమం చాలా ప్రధానం. ❐



### శ్రీ వేంకటేశ్వరుని స్తుతి

లక్ష్మీనివాస నిరవద్యగుణైక సింధో
సంసారసాగర సముత్తరణైకసేతో,
వేదాంతవేద్య నిజవైభవ భక్తభోగ్య
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్॥

ఓ కళ్యాణ గుణసాగరా! నీవు ఈ సంసార సముద్రమును దాటుటకు వంతెనవంటివాడవు. ఉపనిషత్తులచే తెలిసికొనదగిన వైభవంగలవాడవు. ఓ భక్తభోగ్యా! వేంకటాచలపతీ! నీకు శుభోదయమగునుగాక! ❐

{త్యాగం లేనిదే భాగ్యం లభించదు. కావున త్యాగమూర్తులు కండి.}

## ముద్రణ దోషం

మనం చదివే పుస్తకాలలో కొన్ని ముద్రణ దోషాలు కన్పిస్తుంటాయి. ఎక్కువ భాగం దోషాలు అర్థాన్ని చెడగొట్టేవిగా ఉండవుగాని, ఒక్కో దోషం మరింత బాధని కలిగించే తీరులో అర్థంలో తేడా కలిగిఉంటుంది.

ఉదాహరణకి లలితా సహస్రనామాలలో ఓ నామం- పంచవక్త్రా- అనేది. 'పంచ = ఐదు, వక్త్రా = ముఖములు కలది' అని దీని అర్థం.

అయితే దీన్ని 'పంచవక్రా' అని ముద్రించిన పుస్తకాన్ని చదువుతూ పారాయణ చేస్తూవుంటే 'పంచ =ఐదు, వక్రా = వంకరలు కలిగినది' అనే అర్థంతో అమ్మని పూజించడం కాక మరోలా చేస్తున్నట్టవుతుంది.

ఇలా చదివించిన దోషంలో ఎక్కువ శాతం (75 పాళ్ళు) ముద్రించినవారిదే తప్ప మనది కాదు. అయితే ముందు దిద్దించుకుని చదవాలనే ఊహ మన క్కూడా తప్పనిసరిగా ఉండాలి. ❐

## త్రి జ్యేష్ఠ

జ్యేష్ఠమాసంలో (1), వధూవరులిద్దర్లో ఏ ఒక్కరు జ్యేష్ఠా నక్షత్రంవారైనా (1+1), ఆ వధూవరుల్లో ఏ ఒక్కరు ఆ తల్లిదండ్రులకి జ్యేష్ఠ (మొదటి) సంతానమైనా (1+1+1) మూడు జ్యేష్ఠా పద్ధతులు ఉన్నాయి.

కాబట్టి దీన్ని 'త్రిజ్యేష్ఠ' దోషంగా చెప్పారు పెద్దలు.

'జ్యేష్ఠాత్రయే న కుర్వీత' అనేసూత్రం ప్రకారం మూడు తీరుల జ్యేష్ఠా ధోరణి ఉన్న సందర్భంలో పెళ్ళిని మరో మాసానికి మార్చుకోవాలన్నారు ఋషులు.

ఇది పెళ్ళిని చెడగొట్టే పద్ధతి కాదు, అయిన పెళ్ళిని సక్రమంగా ఉండేలా చేసే విధానం.

సీరియల్

# అఆఇఈ

## పుట్టగంటి గోపీకృష్ణ

"ఎప్పుడో గమనించాను..."

"ఇక్కడ ఇప్పుడో ఒక ప్రహసనం జరిగింది..." అని ఏం జరిగిందో కూడా వివరించింది ఈషిక.

"ఇది మొదటిది. ఇంకా జరగాల్సినవి చాలా ఉన్నాయ్. నేను తరువాత మాట్లాడతాను.ఎవరోవస్తున్నారు"అని సంభాషణముగించాడు ఆదిత్య.వ్యాఘ్రం బృందాన్ని పలుకరించడానికి వాళ్ళ ఇంటికి వచ్చాడు కాంతారావు.

"అసలు మీరు రావటమే ఘనమనుకుంటే, చాలామంది స్నేహితులను వెంటేసుకువచ్చారే..." అన్నాడు కాంతారావు, వ్యాఘ్రంతో.

**జరిగిన కథ** (17)

'త్వరలోనేను ఆత్మహత్య చేసుకోబోతున్నాను' అని కిరణ్ చెప్పేసరికి అతడి రూమ్‌కి వెళ్తాడు ఆదిత్య. నక్కలదొడ్డిలోని కాంతారావు కూతురు గౌరిని ప్రేమించానని, తమ పెళ్ళికి కాంతారావు ఒప్పుకోవటంలేదని చెప్పేసరికి ఆదిత్య కిరణ్‌ని ఓదారుస్తాడు.

కిరణ్ శాంతిస్తాడు. తను వెళ్ళాలనుకునే నక్కలదొడ్డి గ్రామానికి కిరణ్‌ని తీసుకు వెళ్ళాలని నిర్ణయించుకుంటాడు.

ఆదిత్య కిరణ్‌కి మారువేషం వేసి వ్యాఘ్రం, ఆదిత్య అతనితో ఆ ఊరు వెళతారు.

వినాయకరావుకు వేపపుల్ల కావాలంటే మురారి నిచ్చెన వేసుకుని వేపచెట్టు ఎక్కి అక్కడనుండి నిచ్చెన పట్టుకున్న మృదుల మీద పడిపోతాడు. అందరూ వాళ్ళిద్దరికీ ఏమైందో అని ఆదుర్దాపడుతుంటే మురారి మాత్రం తనమీద మృదుల పడటంతో చాలా ఆనందిస్తాడు. ఈషికకు ఫోన్ చేస్తాడు ఆదిత్య. తర్వాత జరిగింది చదవండి.

"అవునండీ! వీళ్ళందరికీ ఒకసారి మన ఊరు చూపించాలని తీసుకువచ్చాను"

"ఏముంది చూపించటానికి మనూర్లో. ఇదేమన్నా కోనసీమా,కులూమనాలా?... ఎక్కడబట్టినా కొండలు గుట్టలూ, పంట పండే భూమి ఎకరం ఉంటే, బంజరు పదెకరాలు. ఏముందంట చూడటానికీడ..."

"కాకిపిల్ల కాకికి ముద్దని మన ఊరుని మనం చిన్నబుచ్చుకోకూడదు కదండీ. ఉన్నదే చూసిపోతారు. ఈయనేమో ఆదిత్య అని నా పార్ట్‌నర్..."

"నమస్కారమండీ!... నేను ఏదో అన్నాను కానీ ఏమున్నా లేకపోయినా, ఈ పండగకి ఊరంతా కళకళ్ళాడిపోతుంటందండీ. ఈ సంక్రాంతి పండగ మా ఊర్లో ఘనంగా జరుగుద్ది. ఎక్కడెక్కడో సెటిలైనవోళ్ళందరూ ఊరికి వస్తారు.

ఈ మూడు నాలుగు రోజులూ ఉన్న జనాభాకి అంతకి అంత చుట్టాలొస్తారు. మీకు కూడా సందడే సందడి. మీదేమో ఆడదిక్కులేని ఇల్లాయే! అందుకే మీరున్నన్ని రోజులూ వంటచేసిపెట్టటానికి ఒక మనిషిని కుదిర్చాను"

"వంటమనిషినే కాదు, వంటకి కావలసిన సంభారాలూ ఏర్పాటుచేసిపెట్టారు.మీ మేలు మర్చిపోలేం"

"అయితే వీటన్నిటికీ డబ్బులియ్యవా ఏంటీ?" అంటూ తన జోకుకు తనే పెద్దగా నవ్వుతూ అన్నాడు కాంతారావు.

"భలేవారే!..." అని వ్యాఘ్రం, కిరణ్‌వైపు చూసి, "ఉరేయ్ లోపలకి వెళ్ళి ఒక పదివేలు తెచ్చి అయ్యగారికి ఇవ్వు..." అన్నాడు.

పదివేలు ఎక్కడనుండి తేవాలో అర్థంకాక అయోమయంగా చూసిన కిరణ్ ఆ డబ్బు తను ఇవ్వాలని అర్థమై లోపలకు వెళ్ళాడు.

"ఇప్పుడివ్వకపోతే ఏం పోయిందిలే అబ్బాయ్" జేబు తడుముకుంటూ అన్నాడు కాంతారావ్.

'మీకు ఏంపోదు. నాకే కొంతలో కొంతన్నా వసూలవుతుంది' అనుకున్నాడు వ్యాఘ్రం.

"ఏంటండీ వెతుక్కుంటున్నారు?" అడిగాడు ఆదిత్య, ఇంకా జేబులో వెతుక్కుంటున్న కాంతారావుని చూసి.

"పొగాక్కాడ మర్చిపోయొచ్చానబ్బాయ్!"

ఇంతలో కిరణ్‌లోపల నుండి పదివేలు తెచ్చి కాంతారావుకి ఇచ్చాడు. ఒకసారి కిరణ్‌ని పైనుండి కిందదాకా పరికించి చూసి, "ఇతనెవరో చెప్పలేదే?" అన్నాడు కాంతారావు. "ఆ మీసాలేంటి అలా పెంచుకున్నాడు?" అన్నాడు.

"అలా పెంచుకోవటం వాళ్ళ వంశ ఆచారం. పై పనులకి సాయంగా ఉంటాడని తెచ్చుకున్నాములెండి..." అని చెప్పాడు వ్యాఘ్రం.

"ఏం పేరో?" డబ్బులు లెక్కపెట్టుకుంటూ అడిగాడు కాంతారావు.

"కిరణ్..." ఆటోమాటిగ్గా చెప్పాడు కిరణ్.

అతనికి తను చేసిన పొరపాటు అర్థంకాలేదు. కానీ మిగిలిన అందరికీ అర్థమయింది. ఠక్కున తలెత్తాడు కాంతారావ్.

"అది పనిచేసుకునేవోడి పేరులా లేదే! నిన్ను ఎక్కడో చూసినట్లుందోయ్..." అని అన్నాడు కాంతారావు.

"అతన్నెక్కడ చూస్తారండీ! అతను మొన్నే దుబాయ్‌నుండి వచ్చాడు"చెప్పాడు వ్యాఘ్రం.

"మొన్నటిదాకా ఈ ఊర్లో ఒక దగుల్బాజీ ఉండిపోయాడులే. పైగా ఆడో పెద్దకంపెనీ ఓనరంట కూడా... ఆడి పేరుకూడా కిరణే!..."

"ఇతనికీ, అతనికీ సాపత్యం ఏముందండీ? అతనేమో కంపెనీ ఓనరంటుండ్రి. ఇతనేమో వేలిముద్ర బ్యాచీ" వ్యాఘ్రం వెనక్కితిరిగి చూడకుండా అబద్ధంమీద అబద్ధం చెపుతున్నాడు.

"వేలిముద్రగాడైతే అక్కడ దుబాయ్‌లో ఏం చేస్తాడు?" అన్నాడు కాంతారావు.

"అరబ్ షేకులదగ్గర పనిచేసేవాడు. అక్కడ పని చెయ్యటానికి కండ లుంటేచాలు, కలం ఉండనవసరం లేదు" ఇక ఆలోచించటం మాని





'పద్మావతి' సినిమా వ్యతిరేకించేవారికి తగిన సమాధానం ఆ సినిమాని ప్రేక్షకులు సూపర్ హిట్ చెయ్యటమే. -ట్వింకిల్ ఖన్నా, నటి

ఏదోకటి చెప్పేస్తున్నాడు వ్యాఘ్రం.

మళ్ళీ అడిగినపుడు కంటిన్యుటీ తప్పకుండా అదే అబద్ధం ఆడాలికాబట్టి జరుగుతున్న సంభాషణని ఆదిత్యజాగ్రత్తగా ఫాలో అవుతున్నాడు.

"అది తెలుసులేవయ్యా...! దుబాయ్‌లో పనిచేస్తున్నప్పుడు అరబ్ షేకులదగ్గరకాక మరింకెక్కడ పని చేస్తాడు? ఏం పనిచేసేవాడు అని అడుగుతున్నాను"

వ్యాఘ్రం తననితాను తిట్టుకున్నాడు. 'అనవసరంగా ఈ విషయంలో కల్పించుకున్నాను. వీడి ప్రశ్నలకి అంతం కనపడటంలేదే...' అనుకుంటూ అతని ప్రశ్నకి ఏం సమాధానం చెప్పాలా... అని ఆలోచించాడు.

ఈ మధ్య చాలా సినిమాల్లో అరబ్ డ్రెస్‌లో ఉన్న హీరో చేతిమీద గద్దని ఎక్కించుకుని పాటలు పాడుతూ కనిపించటం గుర్తొచ్చి, "గద్దలకి ట్రైనింగ్ ఇస్తాడు"అని చెప్పాడు కసిగా, ఆ తరువాత ఇక ఏ ప్రశ్నలకీ తావుండదని.

అయితే కాంతారావ్ తక్కువ తినలేదు.కిరణ్‌వైపు తిరిగి "గద్దలకి ట్రైనింగిస్తావా?"అనడిగాడు అనుమానంగా.

ఔనన్నట్లు తలూపాడు కిరణ్.

"ఏం ట్రైనింగ్ ఇస్తావంట?"





## హద్దులుంటాయ్

ఎవరైనా చూడడానికి ఎబ్బెట్టుగా లేని పాత్రలకే తన ప్రాధాన్యం అంటోంది నాజూకు తేలిన రాశీ ఖన్నా. "హద్దులు మీరే అందాలు కొందరికి నచ్చ వచ్చు. కాని, కుటుంబసభ్యులతోకలిసి చూడడానికి ఇబ్బందిపెడుతుంటాయి.

నా వరకు నాకూ యువతరం ఎంత ముఖ్యమో కుటుంబ ప్రేక్షకులూ అంతే ముఖ్యం. గ్లామర్‌గా కనిపిస్తా- కాని అందుకు కొన్ని హద్దులుంటాయి. ప్రేక్షకులు ఎప్పుడూ ఇంత దారుణంగా వుందేంటి అనుకోకూడదు" అని కొత్త కబుర్లు చెప్పింది.

కిరణ్‌కి ఏం సమాధానం చెప్పాలో తెలియలేదు. ఆదిత్యవైపు చూశాడు.

"ఇందులో రహస్యం ఏముంది? ఆ మాట చెప్ప టానిక్కూడా వాళ్ళ అనుమతి తీసుకోవాలా ఏంటి?"

ఆదిత్య కల్పించుకున్నాడు. "మా అనుమతికోసం కాదండీ అతను చూసింది. అతను చేసేపని అలాం టిది. అందరికీ చెప్పుకునేది కాదు.

ఆ షేకులకి తెలిస్తే అసలు ఊరుకోరు! షేకు లకి డబ్బులు ఎక్కువా, పని తక్కువా కదా! వాళ్ళు తీరిక సమయాల్లో గద్దలతో ఫైటింగ్ చేయించి ఆనం దిస్తారు. ఆ గద్దలకి ఈయన ట్రైనింగ్ ఇస్తాడు"

"అంటే మేం పండక్కి కోళ్ళ పందాలు వేసుకున్న ట్లన్నమాట..." అన్నాడు కాంతారావు.

"ఔనవును"అందరూ ముక్తకంఠంతో అన్నారు.

"ఒక పని చేస్తావటోయ్..." కిరణ్‌ని అని అడిగాడు కాంతారావ్.

"చెప్పండి..."

"మా ఇంటికెళ్ళి నా పొగాక్కాడ తెచ్చి పెడతావా?" అన్నాడు కాంతారావు.

ఆ మాట అనటం ఆలస్యం కిరణ్ సుడిగాలిలా అక్కడనుండి మాయమై పోయాడు. "ఇతనికి మరీ తొందర ఎక్కువలా ఉందే? అట్టా పోయాడేంది? మా ఇళ్ళెక్కడో తెలియకుండా పొగా క్కాడ ఎట్టా తెస్తాడు?" అనుకుంటూ గొణుక్కున్నాడు కాంతారావ్.

"గాల్లో ఎగిరే గద్దలకి ట్రైనింగ్ ఇచ్చే వాడు నేలమీద మీ ఇంటి అడ్రస్ తెలుసుకోలేడా?" అన్నాడు ఆదిత్య. వీళ్ళ మాటలు ఇలా సాగుతుండగానే సరాసరి తనకు బాగా తెలిసిన కాంతారావు ఇంటివైపు దూసుకువెళ్ళాడు కిరణ్.

ఆ ఇంటికి చేరువవుతుంటే కమ్మటి వాసన వస్తోంది. కాంతారావు ఇంటిముందు అప్పుడే కళ్ళాపి చల్లి ముగ్గులు వేసి ఉన్నాయి. అది కౌడంగ్ వాసన అంటే అతనికి నమ్మబుద్ధికావటంలేదు.

ముగ్గువంక తదేకంగా చూస్తుంటే, "ఏయ్! ఏం చేస్తున్నావ్?" గౌరి గొంతు గదమాయిస్తున్నట్లులోపల నుండి వినిపించింది.

"మీ నాన్నగారు పంపారండీ! పొగాక్కాడ మర్చి పోయారంట... తెమ్మన్నారు"

"ఇస్తాను కానీ, ముగ్గు తొక్కకుండా లోపలకు రా!..." అంది గౌరి.

ఇంట్లోకి వెళ్ళి పొగాక్కాడ తీసుకుని బయటకు వచ్చిన గౌరి, "ఇదుగో" అంది. దాన్ని అందుకోవటానికి బదులు ఆమె చేతిని అందుకున్నాడు కిరణ్.

"ఏయ్! వదులు..." అని విదుల్చుకుంది గౌరి. "మా ఇంటికి వచ్చి నా చెయ్యే పట్టుకుంటావా...?" అని కోపంగా అరిచింది.

"ఈ పొగాకు పలుచగా ఉందా, తమలపాకు లాంటి నీ చెయ్యి పలుచగా ఉందా?... అని చూస్తు న్నాను" చెప్పాడు కిరణ్.

"ఎవడ్రా నువ్వు? ఏదో తెలియకచేశావనుకున్నాను. కావాలని నా చెయ్యి పట్టుకునే మగాడొకడు తయా రయ్యాడన్నమాట" కాలికి ఉన్న చెప్పు విప్పుతూ అంది గౌరి. అయితే ఆ చెప్పు చూసి కూడా భయపడ కుండా, "గౌరమ్మో... నీ మొగు డెవరమ్మా? ఎవరమ్మా, వాడెవ రమ్మా, గౌరమ్మో నీ మొగుడు ఎవరమ్మా?" అని రాగయుక్తంగా పాడుతున్న కిరణ్‌వైపు అనుమానంగా చూసింది గౌరి.

"కాస్త మీసం మొలుచుకువస్తే కాబోయే మొగుడ్నే గుర్తుపట్టలేదన్నమాట..." అన్నాడు కిరణ్.

అతన్ని పరీక్షగా చూసిన గౌరి ఎగిరి అతన్ని కౌగ లించుకుంది. "మళ్ళీ నిన్ను చూస్తాననుకోలేదు"అంది. "అయినా అదేం మీసం? బూచాడి మీసంలాగా?"

"మీ నాన్న గుర్తుపట్టకుండా ఉండాలంటే కనీసం ఈమాత్రం మీసాలు ఉండొద్దూ..."

"ఇక రావేమో అనుకున్నాను"

"అంత తేలిగ్గా వదలటానికా నిన్ను ఇంత గాఢంగా ప్రేమించింది..." ఆమెని తనమీదకి లాక్కుంటూ అన్నాడు కిరణ్.

"మా నాన్న చూస్తే చంపేస్తాడు"

"మీ నాన్నే పొగాక్కాడ తెమ్మని పంపింది"

"నిజంగా నిన్ను గుర్తుపట్టలేదా?"

"గుర్తుపడితే, నన్ను ఇక్కడకి పోయిరమ్మని ఎందుకు పంపుతాడు?"

"ఎక్కడుంటున్నావ్? ఎవరితో ఉంటున్నావ్?" చెప్పాడు కిరణ్. చాలాసేపు అతన్ని పట్టుకుని అతని కళ్ళలోకి చూస్తూవుండిపోయింది గౌరి.

"ఇక వెళ్ళకపోతే మీ నాన్నే వస్తాడు..." అని అన్నాడు కిరణ్.

ఆమె కళ్ళలో గిర్రున నీళ్ళు తిరిగాయి. "నేనంటే నీకు ఎందుకు అంత ఇష్టం? నా దగ్గర ఏముంది...? నా కోసం ఎందుకింత కష్టాలు పడటం?"

"దీనికి సమాధానం చెప్పాలంటే ప్రేమకి డెఫినిషన్ చెప్పాలి. నాకు అంత సామర్థ్యం లేదు. ఆఖరికి మా ఆదిత్యకి కూడా ఉంటుందనుకోను. సింపుల్‌గా చెప్పాలంటే నీమీద ప్రేమ పుట్టింది. దానికి కారణం మాత్రం తెలియదు"

అతనికి గట్టిగా ఒక ముద్దు ఇచ్చి, "ఇక వెళ్ళు" అంది గౌరి. "నువ్వు లోపలకు వెళ్ళు. నువ్వు ఇక్కడే ఉంటే నాకు వెళ్ళబుద్ధి కాదు..." చెప్పాడు కిరణ్.

గౌరి ఇంట్లోకి వెళ్ళిపోయింది. కిరణ్ బయటకు నడుస్తూ, వీధిగుమ్మం బయటకి నడిచాడు.

ఇంటి బయట ఒక డెకరేటివ్ పీస్ అతనికి కనిపిం చింది. అది అక్కడ ఎందుకు ఉందో అతనికి అర్థం కాలేదు. గిఫ్ట్ ప్యాక్‌చేసిన బుజ్జిపెట్టె ముద్దొస్తోంది. ఎవరికీ అక్కర్లేక పారేసినట్లున్నదానిని తీసి, ఎవరూ చూడకుండా జేబులో పెట్టుకున్నాడు. ఆ తరువాత వచ్చినంత వేగంగా తిరిగి వ్యాఘ్రం ఇంటికెళ్ళాడు.

అప్పటికే కాంతారావ్ వ్యాఘ్రం ఇంటి అరుగుమీద కూర్చుని అసహనంగా ఎదురుచూస్తున్నాడు.

"ఏదన్నా పనిచెప్తే చిటుక్కునచేసుకు రావాలి. అంతేకానీ ఇక్కడనుంచీ పక్క వీదికెళ్ళిరావటానికి ఎంతసేపు చేస్తావ్?" అని కోప్పడుతూనే పీక్కుపోతున్న నాలి కను సంతృప్తిపరచటానికి పొగాక్కాడ



ఆర్థిక ప్రగతి పరంగా, ఈ శతాబ్దంలోనే భారత్ అమెరికా, చైనాలను వెనక్కి నెట్టివేస్తుంది.

-ముఖేష్ అంబానీ, పారిశ్రామికవేత్త

కోసం చెయ్యి చాచాడు. కిరణ్ జేబులో నుండి పొగాక్కాడ తీసి ఇచ్చాడు.

"ఏంట్రా? ఇది తడిసినట్లుంది?" అంటూనే అలవాటుగా దాన్ని ముక్కుకు రాసి వాసనచూసి, 'కెవ్వు'మని కేకేశాడు కాంతారావు. తరువాత చేతిలోని పొగాక్కాడని దూరంగా విసిరేశాడు.

బిలబిలమంటూ పోగయ్యారు ఆదిత్య, వ్యాఘ్రం. "ఏమయింది?" అని ముక్తకంఠంతో అడిగారు.

పొగాకు పారెయ్యటంతో ఆగలేదు కాంతారావు. పిచ్చికుక్క కరిచినట్లు, జెర్రిపోతు ఒంటిమీద పాకినట్లు చిందులు వేస్తూ వెళ్ళి దోసిలినిండా నీళ్ళు తీసుకుని ముక్కూ, మూతీ కడుక్కోసాగాడు.

ఎవరికీ ఏమీ అర్థంకాక అతనివెంట భయం భయంగా ముందుకు వచ్చాడు కిరణ్.

"ఆ జేబులో ఏముందో తియ్..." ముందే ముక్కు మూసుకుంటూ అన్నాడు కాంతారావు.

తను దొంగతనముగా జేబులో పెట్టుకువచ్చిన వస్తువు సంగతి ఈయనకు ఎలా తెలిసిందో అర్థంకాక జేబులో నుండి తను గిఫ్ట్ ప్యాక్ అనుకున్న వస్తువు బైటకు తీశాడు కిరణ్. గుప్పున కొట్టింది పేడవాసన.

అందరూ ముక్కుమూసుకున్నారు. చీదరగా చూశాడు కాంతారావు కిరణ్ వైపు. "అదేదో బంగారం ముద్దన్నట్లు గొబ్బెమ్మని జేబులో పెట్టుకొస్తావా? పైగా నా పొగాక్కాడని దాంట్లో ముంచి తెస్తావా?" అన్నాడు.

అప్పుడర్థమైంది అందరికీ కాంతారావు బాధకి కారణం. అందరూ ముక్తకంఠంతో కిరణ్ చేసినదానిని ఖండించారు. "ఇంతకీ ఏం రోగం వచ్చింది? ఎందుకు చేశావీ పని?" అని అడిగాడు వ్యాఘ్రం.



ఏ దేశమయినా తమ దేశంలోని మైనారిటీ వర్గాలను కలుపుకుని ముందుకెళ్ళటం అవసరం. -బరాక్ ఒబామా
అమెరికా మాజీ అధ్యక్షుడు

"అది కొడంగ్ అనుకోలేదు" అని మాత్రం అన్నాడు కిరణ్.

"మరేమనుకున్నావ్?"

"చక్కగా అలంకరించివుంటే గిఫ్ట్ ప్యాక్ అనుకున్నాను. మెత్తగా ఉందేమిటా అని అనుమానం వచ్చింది. అయినా, ఎవరైనా కొడంగ్‌కి ఇంత అలంకంణెందుకు చేస్తారు?"

కాంతారావు మూడంతా పాడయినట్లుంది, విసుక్కుంటూ బయటకు వెళ్ళిపోయాడు.

"ఇప్పుడన్నా చెప్పు. ఎందుకు చేశావీ పని?" అడిగాడు చాటుగా ఆదిత్య.

"గౌరిదగ్గర వచ్చే వాసన దీనిదగ్గర కూడావచ్చింది. అది కొడంగ్ అనుకోలేదు.అప్పుడప్పుడూ ఆ వాసన పీల్చుకోవచ్చు కదాని... తెచ్చుకున్నాను"

"ఆ అమ్మాయిని పెళ్ళిచేసుకుని సిటీకి తీసుకెళితే అప్పుడేం చేస్తావ్...?" అని అడిగాడు ఆదిత్య.

తిరుగుతూ "ఏం జరిగింది, ఏం జరిగింది..." అని అడుగుతున్నారు.

కాంతారావుమాత్రం ఎవరికీ సమాధానం చెప్పటంలేదు.

ఎట్టకేలకు తన కడుగుడు కార్యక్రమం ముగించిఅటూ ఇటూ చూసి దగ్గర్లో కనిపించిన కొడవలి తీసుకుని వీరావేశంతో కిరణ్‌మీదకి పోయాడు.

ఏం జరిగిందో తెలియక అందరితో పాటు తను కూడా కాంతారావుచుట్టూ తిరుగుతున్నాడు కిరణ్.

కాంతారావ్ కొడవలి తీసుకుని తన మీదకి రావటముతో గావుకేక పెట్టి వ్యాఘ్రంవెనుక దాక్కున్నాడు.

అందరూ కలసి అతికష్టంమీద అతన్ని శాంతింపచేశారు.అప్పుడు అడిగారు అందరూ మరొకసారి ఏమైందని.

"ఉరేయ్! ఇటురా!!..." అని పిలిచాడు కాంతారావ్ కిరణ్‌వైపు చూస్తూ.

కిరణ్ తల అడ్డంగా ఊపాడు భ్రమరం చాటునుంచి.

"వస్తావా? నన్ను రమ్మంటావా..?" అంటూ చేతిలోని కొడవలి చూపిస్తూ అన్నాడు కాంతారావు.

"ఒక ఆవును పెంచుకుంటాడు..." చెప్పాడు వ్యాఘ్రం. "ఐడియా బాగుంది..." అన్నాడు కిరణ్.

తలపట్టుకు కూర్చున్నాడు ఆదిత్య.

దినమణి తమిళనాడులో ప్రముఖ స్మగ్లర్. వీరప్పన్ బతికివుండగా అతనితోకలసి ఏనుగు దంతాల స్మగ్లింగ్ చేసేవాడు. తన గురువును అనుకరిస్తూ అతనిలానే గుబురుమీసాలు కూడా పెంచుకున్నాడు. ప్రస్తుతం ఆ పని అంత లాభదాయకం కాకపోవటంతో లేటెస్ట్ ట్రెండ్ అయిన ఎర్రచందనం స్మగ్లింగ్‌మొదలు పెట్టాలని నిర్ణయించుకున్నాడు.

అతను ఏ పని చేసినా చాలా పెద్ద ఎత్తున చేస్తాడు. అందుకే చేసేదేదో నాలుగయిదు లారీల ఎర్రచందనం స్మగ్లింగ్ ఒకేసారి చేసేస్తే ఇక ఈ దంధానుంచి తప్పుకోవచ్చని ఆలోచించాడు అతను.

సంక్రాంతి సమయంలో పల్లెటూర్లన్నీ దూర ప్రాంతాల నుండి ఇళ్ళకు తిరిగొచ్చిన బంధువులతో కళకళలాడుతూ ఉంటాయి.

కోడిపందాలు, ఎడ్ల పందాలు వంటి సంబరాలతో గ్రామీణులూ, వాటిని జరగనివ్వకుండా చూడాలన్న తపనతో పోలీసులూ హడావుడిగా ఉంటారు. కాబట్టి ఈ పండుగ సమయాన్ని ఎంచుకున్నాడు దినమణి. తమ రాష్ట్రానికి చేరువలో ఉన్న ప్రాంతమైన నక్కల దొడ్డిని అనువైన స్పాట్‌గా సెలెక్ట్ చేసుకున్నాడు.

ఆ పనిలో భాగంగా నాలుగు లారీలు ఆ రాత్రి నక్కలదొడ్డిమీదుగా అడవిలోకి ప్రవేశించాయి. వాటి నిండా తమిళనాడు నుంచి వచ్చిన కూలీలు పాతిక మంది ఉన్నారు. రెండు మూడు రోజులపాటు వాళ్ళు అడవిలోనే ఉండి చెట్లుకొట్టటానికి వీలు కల్పించేలా వంటసామాను కూడా ఆ లారీలలోనే ఉంది.

ఫారెస్ట్ డిపార్టుమెంట్ స్టాఫునీ, దారిలో వచ్చే చెక్ పోస్టు స్టాఫునీ మేనేజ్ చేసి, ఇక తనకు ఎదురులేదన్న ధైర్యంతో దినమణి ఆ రాత్రి నక్కలదొడ్డిమీదుగా ఎవరికీ అనుమానంరాకుండా అడవిలోకిప్రవేశించాడు.

"ఇవాళ భోజనాలు మన మామిడితోటలో చేద్దాం" అన్నాడు వరసిద్ధి.

"అబ్బ! తోటలో భోంచేసి ఎన్నాళ్ళయిందో? చేద్దాం, చేద్దాం..." ఓటేశాడు వినాయకరావు.

"తోటలో భోజనాలా..." అని మొహం చిట్లించింది ఈషిక.

"అన్‌హైజెనిక్ కాదా?" ప్రశ్నించింది మృదుల.

"ఒక్కసారి ఆస్వాదించి చూడండి. ఆ భోజనాల్లో మజా ఏంటో తెలుస్తుంది" అన్నాడు వినాయకరావు.

"భోజనం ఎక్కడయినా బానేవుంటుంది..." వంత పాడాడు మురారి.

రమేష్‌మాత్రం అప్పుడే స్నానంచేసి తయారైవచ్చిన సౌందర్య సౌందర్యాన్ని ఆస్వాదించటంలో నిమగ్నమై ఉన్నాడు. టైగర్ తోక ఊపుకుంటూ అతనిచుట్టూ తిరుగుతోంది. రమేష్ ఈ ఇంటికి వచ్చినప్పటినుంచి అది మిగిలినవారిని పట్టించుకోవటం మానేసింది.

రమేష్‌చుట్టూ తిరుగుతూ, అవకాశం దొరికినప్పుడల్లా అతనిమీదకి దూకుతూ, శరీరాన్ని అతనికి రుద్దుతూ ఆనందపడుతోంది.



"నేను కోడిపందాలకి వెళ్ళాలి... రాలేను" చంకలోని కోడిపుంజుకి బాదంపప్పు తినిపిస్తూ చెప్పాడు రామ్మూర్తి.

"వేళకి వచ్చి ఇంత తినిపోవటమేగా నువ్వు చేసేది. పైగా, ఆ పందాలేసేది మన మామిడితోట పక్కనేనాయే! నీ పని నువ్వుచూసుకో. మా పని మేం చూసుకుంటాం" కొడుకుని గదమాయించాడు వరసిద్ధి.

"అమ్మాయిలూ, అబ్బాయిలూ ఇంట్లో తినటం ఎప్పుడూ ఉండేదే! ఇలా బయట తినటంలో ఉండే మజానే వేరు. నా మాటవిని అందరూ బయల్దేరండి" అని వినాయకరావు ఆబ్లిగేషన్ పెట్టటంతో ఎవరికీ ఎదురు మాట్లాడ్డానికిఅవకాశంలేకుండా పోయింది.

ఒకసారి ఆ నిర్ణయం తీసుకున్నాక పనులు అన్నీ చకచకా జరిగిపోయాయి. మామిడితోటలో ఒక పక్కగా చిన్న కొట్టం ఉంది. అక్కడ పొయ్యి వెలిగించి వంటపనులు మొదలుపెట్టారు పనివాళ్ళు. ఆడవాళ్ళంతా అలంకరణలో మునిగిపోయారు.

"నీకీ విషయం తెలుసా?" రమేష్ మురారీని పలకరించాడు, ఒక చేత్తో మీదకి దూకుతున్న టైగర్ని దూరంగా ఉంచటానికి ప్రయత్నిస్తూ-

"ఇద్దరు మగవాళ్ళు పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నప్పుడు వారిమధ్య యథేచ్ఛగా తిట్లు దొర్లుతుంటాయి. కానీ అవి నిజంగా ఒకరినొకరు ఉద్దేశించుకున్నవి కావు. అలానే ఇద్దరు ఆడవాళ్ళు పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నప్పుడు ఎక్కువగా ఒకరినొకరు పొగుడుకుంటారు. మగవాళ్ళ తిట్లలో ఎంత నిజం ఉందో ఆడవాళ్ళ పొగడ్తలో కూడా అంతే నిజం ఉంది..." లోకాన్ని కాచి వడపోసినట్లు చెప్పాడు.

"ఈ పరిజ్ఞానం మా చెల్లి పరిచయం కాకముందు కూడా ఉండేదా? తరువాత వచ్చిందా?" అడిగాడు మురారి. సౌందర్య మాట రావటంతో రమేష్ తిరిగి కలల్లోకి వెళ్ళిపోయాడు.

"అంతకుమించి పనిలేదా? సౌందర్య పేరు మాట్లాడటం ఆలస్యం అలా కళ్ళు అరమోడ్పులు చేసి కలల్లోకి వెళ్ళటమేనా?". ఆ పని తనకు కూడా నచ్చనట్లు అతని పిర్రమీద లైటుగా కొరికింది టైగర్.

కెవ్వుమన్నాడు రమేష్. "మా టైగర్ ఫేవరేట్ అయిపోయావ్. మా చెల్లెల్ని ఇచ్చినా ఇవ్వకపోయినా వెళ్ళేటప్పుడు కావాలంటే ఈ టైగర్ని తీసుకువెళ్ళవచ్చు" టైగర్ చేతిలో అతను పడుతున్న బాధచూసి నవ్వుకుంటూ చెప్పాడు మురారి.

"నా సంగతి పక్కనపెట్టు. నీ సంగతి చెప్పు. నీ ప్రేమ ఎంతవరకు వచ్చింది?" అడిగాడు రమేష్.

"చూస్తున్నావుగా! అసలు నేనంటూ ఒకడ్నున్నానని ఆ ఈషికకి ఏమన్నా ధ్యాస ఉందా?" ఆక్రోశంగా అన్నాడు మురారి మొక్కజొన్న కండెని పరపరా నములుతూ.

"ప్రేమ గుడ్డిది అంటే ఏమో అనుకున్నాను. ఎంతసేపూ ఈషిక గోలతప్ప నిన్ను ప్రేమిస్తున్నవాళ్ళగురించి పట్టించుకోకపోవటమే నువ్వు చేస్తున్న తప్పు" చెప్పాడు రమేష్. అవకాశం దొరికినప్పుడల్లా వల్లవేయటానికి అతనికి కొన్ని మాటలు చెప్పివున్నాడు ఆదిత్య.

వాటిలో కొన్ని మాటలను ప్రస్తుతం బయటకు తోశాడు రమేష్, టైగర్ పెడుతున్న చిత్రహింసలను తట్టుకుంటూ కూడా...

"ఆ విషయం నీకు కూడా తెలిసిందా?" ఆశ్చర్యంగా అడిగాడు మురారి.

ఇంకా ఉంది

కామెడీ కథ



# నా ఆయుష్షు కూడా పోసుకుని

తులసి బాలకృష్ణ

“నా ఆయుష్షు కూడా పోసుకుని నూరేళ్ళూ బతుకు నాయనా” అంది బంగారమ్మ... సన్నని కరివేపాకు కట్టని అపురూపంగా అందుకుని, అర్ధనిమీలిత నేత్రాలతో దీవిస్తూ.

ఆవిడ కొన్న కూరలకి బోనస్‌గా కేవలం ఓ కరివేపాకు రెబ్బని ఉచితంగా పడేసిన కూరలబండి నూకరాజు 'పిచ్చి మామ్మగారూ... కూరలు అన్నిట్లో ఒక్కొక్కదానికి కనీసం వందగ్రాములు అన్నా తూకంలో నొక్కేసాననీ... మీకు ఫ్రీగా పడేసిన ఆ కరివేపాకు రెబ్బ నాకు ఒక్కరూపాయి కూడా చెయ్యదనీ మీకు ఎప్పటికీ అర్థం కాదుకదా' అని లోలోనే పంటి బిగువున కిసకిస నవ్వుకున్నాడు.

ఈ ఆయుష్షు మార్క్ దీవెన అలవాటు బంగారమ్మకి ఇప్పటిది కాదు. గత నలభై ఏళ్ళుగా... అంటే ఆవిడకి యాభై ఏళ్ళున్నప్పట్నుంచీ... అలా అనాఘాతంగా సా..గి..పో..తూ..నే ఉంది.

ఓసారి... మూడు దశాబ్దాల క్రిందటి మాట.

ఆవిడకి ఇష్టమయిన హీరో సినిమా ఫస్ట్ డే ఫస్ట్ షో చూడ్డానికి భర్తతో బాటు 'బంధుమిత్ర శత్రు సపరివారంగా' బయల్దేరింది. తన అభిమాన నటుడి సినిమాకి తన తరఫున కంట్రీబ్యూషన్ ఆ మాత్రమైనా ఉండితీరాలనేది ఆవిడ నిర్ణయం. అరడజను ఆటోల్లో అరగంట ముందే హాలుదగ్గర దిగిన బంగారమ్మ పరివారాన్ని “హౌస్‌ఫుల్” బోర్డ్ వెక్కిరించింది.

అంతే! “మా హీరో సినిమాకి... ఆయన వీరాభిమాన వనితా రత్నాన్ని నాకు, నా వాళ్ళకి ప్రవేశం లేకపోవడమా” అని ప్రారంభించి, టిక్కెట్లు అడ్వాన్సు బుకింగ్ చేయించని భర్తని -

'విఘ్నేశ్వర పూజగా' ముందు చీవాట్లతో అభిషేకించి, అవరోహణ పద్ధతిలో రెచ్చిపోయి, “నాకిప్పుడు ఈ సినిమా టిక్కెట్లుదొరక్కపోతే ప్రభుత్వాలు కూలిపోతాయి జాగర్త” అనేంతవరకూ వెళ్ళిపోయింది.

దెబ్బతో హాలు మేనేజరు చెమటలు కక్కుతూ గాభరాగా పరుగెత్తుకువచ్చి-

“అమ్మా అమ్మా! మీరు శాంతించాలి. టిక్కెట్లు అయిపోయాయి. అయినా ప్రయత్నిస్తాను తల్లీ...” అంటూ మైండ్ బ్లాక్ అయిపోయి, మిట్ట మధ్యాహ్నం మండుటెండలో చెప్పుల్లేకుండా నిప్పులమీద కాలేసిన వాడిలాగెంతుతూ అటూ ఇటూ పోయి-

అయిదు నిముషాలలో చిచ్చుబుడ్డిలా వెలిగిపోతూన్న మొహంతో తిరిగొచ్చి, ఆవిడ గ్యాంగ్ మొత్తానికి సరిపోయే టిక్కెట్ల బొత్తిని, ఆమె కరకమలాల్లో ఉంచి-

చందనంలాంటి చల్లని నవ్వు సాయంతో, సవినయంగా తలవంచుకున్నాడు.

బంగారమ్మ అమందానంద కందళిత హృదయారవిందయై, అర్ధనిమీలిత నేత్రాలతో, “నా ఆయుష్షు కూడా పోసుకుని నూరేళ్ళూ బతుకు...” అని మేనేజర్ని దీవించి, భర్తవైపు తిరిగి, “చూస్తారేం? టికెట్లకి డబ్బులు చెల్లించండి” అని హుంకరించి, హాలులోకి ఠీవిగా గజగమనంతో సాగిపోయింది.

వెనక మిగిలిపోయిన భర్త అనబడే ఆ పూర్‌మానవుడి జేబుల నిండా ఉన్న నోట్లు ఆ టిక్కెట్ల ఖర్చు చెల్లించడానికే ఊడ్చి పెట్టుకుపోయాయయనీ, అవి ఆ మేనేజరు 'అతి వినయం' ప్రదర్శిస్తూ -

త్రిబుల్ రేట్లలో అమ్మిన 'బ్లాక్ టిక్కెట్ల'నీ ఆవిడగారికేం తెలుసూ? వద్దంటే అక్కడ భార్యామణి డైరెక్షన్‌లో ప్రదర్శితమవబోయే భీభత్స రస ప్రధాన సుందర దృశ్యంగురించి ఆ భర్తగారికి మాత్రం అనుభవంమీద చా... లా... బా... గా తెలుసు.

మరోసారి బుక్ చేసిన రోజే గ్యాస్ సిలిండర్ తెచ్చిచ్చేసిన కుర్రాడిని కూడా ఇలాగే ఆనందభాష్పాలతో తడిసిన కళ్ళతో దీవించింది.

“నా ఆయుష్షు కూడా పోసుకుని నూరేళ్ళూ బతుకు నాయినా” అని. అంతటితో ఊరుకోకుండా, ఓ వంద నోటుని కూడా బలవంతంగా అతని జేబులో కుక్కింది. ఈవిడ గారి స్వభావం ప్లస్ అర్జెన్సీ కని పెట్టిన ఆ పుణ్యాత్ముడు... పైకి ఆ నోటుని తీసుకోవడానికి ఎంతో సిగ్గుపడిపోతున్నట్టు నటించిన ఆ మహానటుడు... సగం గ్యాస్‌ని వాడేసిన సిలిండర్‌ని అంటగట్టి, మిగిలిన సగం గ్యాస్ డబ్బులూ కొట్టేశాడని అతగాడికే తప్ప ఈవిడగారికేం తెల్సు?

ఒకసారా రెండుసార్లా... ఒకర్నా ఇద్దర్నా.. ఎన్నిసార్లో... ఎంతమందినో... బంగారమ్మ “నా ఆయుష్షు కూడా...” ఎట్సెట్రా ఎట్సెట్రా పవిత్ర పదాలతో కూడిన వాక్యాల్తో ఆశీర్వదించెయ్యడంజరిగిపోతూనేఉంది.

నేటికి బంగారమ్మ వయసు తొంభై సంవత్సరాలు. ఆయుష్షు మేటర్‌తో నిండిన ఆవిడ దీవెన వయస్సు నలభై సంవత్సరాలు. ఇప్పటివరకూ ఆవిడ సెల్ఫ్ ఆయుష్షుకి గాని, ఆవిడ స్టాండర్డ్ దీవెనకి గాని ఎటువంటి అడ్డంకీ తగల్లేదు.

కాని ఈరోజు తొంభై నిండి ఆవిడ తొంభై ఒకటో సంవత్సరంలోకి పాదం మోపిన రోజు... రోజూలాగే తూర్పు తెల్లారకమునుపే ఇంటిలో అందరికంటే రెండు గంటలు ముందే పెంద్రాళే మెలకువ తెచ్చుకునే అలవాటున్న బంగారమ్మ నిద్రలేచి, మంచం మీద కూర్చుని, మొహం రెండు చేతులతో రుద్దుకుంటూ, 'కృష్ణా రామా' అని చిన్న స్వరంతో స్మరించుకుంది.

వెంటనే పెనుగాలికి కోట గుమ్మం చెదలు పట్టిన మెయిన్ డోర్ మూసుకుంటున్న




ధ్వనితో కూడిన స్వరంతో-

"కాదు! నాపేరు వైడి. రాజా" అని వినిపించింది.

ఉలిక్కిపడి, చటుక్కున కళ్ళు తెరిచింది.ఎదురుగా... పైన ఇంటి రూఫ్‌కి తగిలేంత ఎత్తుతో, ముంజికాయల్లాంటి కనుగుడ్లతో, ఒళ్ళంతా ఓ బంగారపు కొట్టులోని మొత్తం నగలన్నీ దిగేసుకుని, పట్టుబట్టల్లో ఉక్కతో చెమటలుకక్కుతూ, ఓ కారు నల్లని భారీ శరీరపు మీసాలాసామి!

అంత భీకరాకారుడూ మళ్ళీ మర్యాదగానే చెప్పాడు. "నా పేరు రాముడూ, కృష్ణుడూ కాదు బంగారమ్మా... వైడి. రాజా. అంటే యమధర్మరాజు" అని. ఇంకా ఇలా అన్నాడు కూడా, "వేసంకాలం కదా! ఈ వయసులో చక్కగా బయట ఆరుబయట పడుకోవచ్చుగా తల్లీ.

**నా** ఈ భారీకాయంతో లోపలికి రావడానికి ఎంత ఇబ్బందిపడ్డానో తెల్సా? నా ఎనుబోతయితే "నా వల్లకాదు. మీరు దిగి లోపలికి పోయి రండి మహారాజా" అని తన నిస్సహాయతని ప్రకటించి గుమ్మం ముందే ఉండిపోయింది" అని.

కించిత్తు కూడా తొణక్కుండా, "అవన్నీ సరే నయ్యా. ఇలా వచ్చావేమిటి తూర్పు తెల్లారకుండా? అజ్జెప్పక మిగతా సోదంతా నాకెందుకూ?" అంది బంగారమ్మ చిరాకు ప్రదర్శిస్తూ.

"చిరాకుపడకండి బామ్మగారూ..." అన్నాడు యముడు ఆవిడ నిర్భయత్వానికి విస్తుపోతూ.

"ఆ...య్.." అంది బంగారమ్మ తనని బామ్మ అన్నందుకు కోప్పడుతూ.

"అ.. అదే... బంగారమ్మ గారూ. ఎప్పుడూ నా సర్వెంట్స్‌నీ, అసిస్టెంట్స్‌నీ పంపించే నేను స్వయంగా వచ్చానంటే... మీకు ఎంత గౌరవం ఇచ్చానో మీరు అర్థం చేసుకుని... నన్ను కూర్చోమని రెండు మాటలూ కుదిర్తే కప్పు కాఫీ ఇచ్చి మర్యాద చెయ్యడం మీకు భావ్యం కదా?" అన్నాడు చిన్నబుచ్చుకుని, గారంగా నీలుగుతూ. "ఉద్ధరించావ్ నీ గారం గారెలు తినా, అసలు ఎందుకొచ్చావో చెప్పు. కారణం నచ్చితే కాఫీ ఏం ఖర్మ... కారప్పొడి నంజుకోడానికి వేసి, ఉప్పిడి పిండి కూడా పెడతాను" అంది బంగారమ్మ.

గొంతు సవరించుకున్నాడు యముడు. "అమ్మా! అంటే అన్నానన్నారంటారుగాని... నేనెందుకొస్తానో తెలీక ఈ ప్రశ్నేశారాతల్లీ మీరు?" అన్నాడు 'మీ నోటితోనే చెప్పేద్దురూ' అన్న ధోరణిలో బెల్లించిచూస్తూ.

"ఇదుగో ఈ శషభిషలూ, ఎదురుప్రశ్నలూ ఒద్దు... నసపెట్టొద్దు. పాయింటుకి రా. నేను మొహం కడుక్కుని, నా తవ్వ సైజు కంచు గ్లాసుతో కాఫీ తాగాలి తొరగా. ఆలిస్యమయితే తిక్కెక్కుతుంది నాకు. ఆ తిక్కలో ఎదురుగా ఎవరుంటే వాళ్ళని గూబలు వాయగొట్టేస్తాను తర్వాత నీ ఇష్టం" చాలా నిజాయితీతో బెదిరించింది బంగారమ్మ.

"అమ్మ తల్లో... చెప్పాను ఇంకా నయం... ఏం లేదమ్మా... నిన్ను తీసుకుపోవడానికి స్వయంగా వచ్చానన్నమాట" అన్నాడు యముడు. ఏదో ఫంక్షన్‌కి ముఖ్య అతిథిగా ఆహ్వానిస్తూ, కారు తెచ్చానన్నంత మర్యాదగా... చిరునవ్వు సాయంతో.

ఉలిక్కిపడింది బంగారమ్మ "నన్నా... తీసుకుపోవడానికొచ్చావా... అంటే లేపుకుపోదామనే?" అంది ఆశ్చర్యంతో కూడిన కోపంతో చురచుర చూస్తూ.

ఠక్కున ముక్కుమీద వేలుంచుకున్న యముడు, "అయ్య బాబోయ్ ఎంత మాటన్నావమ్మా... పాపులందరికీ మా నరకంలో నేను రుచి చూపించే రౌరవాది నరకాలని నేనే అనుభవించాల్సిన ప్రారబ్ధం ఉంటే అప్పుడు అటువంటి దిక్కుమాలిన ఆలోచన్లు రావాలి నాకు.

నా ఉద్దేశ్యం ఏంటంటే పెద్దవారు, మిమ్మల్ని మా లోకానికి తీసుకెళ్ళడానికి మా మనుషుల్ని పంపిస్తే వెహికిల్ లేక, సున్నితంగా హ్యాండిల్ చెయ్యాల్సిన నేర్పు లేక, మొరటుగా ప్రవర్తించి మిమ్మల్ని ఇబ్బంది పెడతారేమోనని భయంతో అవతల ఎంత బిజీ షెడ్యూల్ ఉన్నా, నా ఎనుబోతుకి ఒంట్లో అంత బావు లేకపోయినా... నేనే రావాల్సి..." అని అంటూండగానే బంగారమ్మ అందుకుంది.

"అసలు ఇప్పుడు నన్ను అంత అర్జెంట్‌గా మీలోకానికి తీసుకుపోయి, కొన్నిరోజులు గెస్ట్‌గా ఉంచుకుని, నాలుగు ప్రదేశాలూ చూపించి తీసుకొచ్చి మళ్ళీ ఈ ఇంట్లో దింపాలన్న సరదా బుద్ధి నీకెందుకు పుట్టిందట?" వెంటనే యముడు రెండు చేతుల్లో పొట్టపట్టుకుని నవ్వుతూ-

"అమ్మమ్మా! బ్రేక్‌ఫాస్ట్ పడక పొట్ట పూర్తిగా ఎప్టీగా ఉంది. జోకులతో చంపకండి. నవ్వుతూంటే లోపల పేగులు కదిలి మెలేసుకుపోయి 'యమబాధ'ని అనుభవిస్తున్నాను.

**స** బ్జెక్ట్ ఏంటంటే...భూమ్మీద మీ ఆయుష్షు తీరిపోయిందీ... అందుకని మిమ్మల్ని జాగ్రత్తగా నా ఎనుబోతుమీద బ్యాక్‌సీట్లో కుదేసి, మా లోకానికి తీసుకుపోవడానికొచ్చానన్నమాట" అన్నాడు సిన్సియర్‌గా. అంతే! చర్రున నిటారుగా అంటించిన జువ్వలా లేచింది బంగారమ్మ.

"ఏదో పెద్దమనిషివని నిదానంగా మాట్లాడుతూంటే ఏం మాట్లాడుతున్నావయ్యా నువ్వు? అహా... అసలేం మాట్లాడుతున్నావ్? నా ఒంట్లో ఒక్క కీలు అరగలేదు. కంట్లో చూపు తగ్గలేదు. నోట్లో ఒక్క పన్నూ ఊళ్ళేదు. మరి ఏం రోగం నాకొచ్చిందని తీసుకుపోతానంటున్నావు... నీదిఅర్ధాయుష్షు పోకడ కాకపోతే" అని అరిచింది. భయపడ్డాడు యముడు ఆ అరుపులకి.

"అమ్మాఅమ్మా కొంచెం మీ కథాకళి ఆపి, స్థిమితపడండి... నా మాటలు వినండి కాస్త. ప్లీ... జ్" అన్నాడు రిక్వెస్టింగ్‌గా మొహంపెట్టి.

"సరే... చెప్పు. కాని నా ఆయుష్షు అప్పుడే తీరిపోయిందంటేమాత్రం దవడ..."

"కాదు తల్లీ... నా మాటలు పూర్తిగా ఆలకించ ప్రార్థన" "సరే...కానియ్" ఏ మాటలతో ప్రారంభించి, వాక్యాలను ఏ విధంగా కన్‌స్ట్రక్ట్ చేసి, ఆవిడకి పరి

## దేనికైనా రెడీ

**ము**ద్దులపాప షాలినీ పాండే 'అర్జున్‌రెడ్డి' తర్వాత తమిళంలో '100% లవ్' రీమేక్‌లో నటిస్తూ 'ముద్దు' కబుర్లు మహబాగా చెపుతున్నది. 'అర్జున్‌రెడ్డి'లో ప్రీతిగా ముద్దులు పెట్టానుకానీ షాలినిగా కాదు.

ఓ నటిగా ఎంతో ప్యాషన్‌తో ఆ సన్నివేశాలు చేశాను. హీరోయిన్ కావాలన్నది నా కల.

కథ డిమాండ్‌చేస్తే ఏది చేయడానికయినా నేను సిద్ధమే. అయితే ఇక్కడ దర్శకుడు ఎలా తీస్తారు అన్నది ముఖ్యం. నన్ను ఇబ్బందిపెట్టేదిగా వుంటే చెయ్యను. చౌకబారు దుస్తులు ధరించను" అని స్పష్టంగా చెప్పింది షాలినీ పాండే.





## హార్ట్ ఎటాక్

**తొం**గి తొంగిచూసే అందాలతో తొలిసారే ప్రేక్షకులకు 'హార్ట్ ఎటాక్' తెప్పించినా అదాశర్మకు మంచి అవకాశాలు తలుపు తట్టనేలేదు.

లీడ్ హీరోయిన్ పాత్రే చేస్తానంటూ గిరిగీసుకు కూర్చుంటే కుదరదన్న వాస్తవాన్ని బాగా జీర్ణించుకున్నదేమో ఏ అవకాశం వచ్చినా వదలడంలేదు.

సైడ్ క్యారెక్టర్లు కదా అని సైడైపోకుండా సర్దుకుపోతూనే, హాటెస్ట్, లేటెస్ట్ ఫొటో షూట్‌లనూ ఎంచక్కా చేసేస్తున్నది. ఘాటయిన స్టిల్స్‌తో మరోమారు 'హార్ట్ ఎటాక్' తెప్పిస్తున్నది.

స్థితి అర్థమయ్యేలా చెయ్యగలనూ అనే మీమాంసలో లోలోనే తర్జనభర్జన చేసుకోసాగాడు యముడు.

"చెప్పూ... ఏదో సంతాప సభలో ఉన్నట్టు ఈ మౌనం ఏమిటీ... తిక్కెక్కిపోతోంది నాకూ" అరిచింది బంగారమ్మ ఆలస్యాన్ని సహించలేక.

అదిరిపడి, "చె...చ్చెబ్తున్నానమ్మా. సమయానికి సరైన వర్డ్స్ దొరక్క కొంచెం లేట్ అవుతోంది. అంతే. ఆలస్యానికి క్షంతవ్యుణ్ణి.

అసలు విషయం ఏమిటంటే... మీది ఒక విచిత్రాతి విచిత్రమయిన జాతకమమ్మా. అసలు మీ జాతకం ప్రకారం మీ ఆయుష్షు ప్రపంచకంలో మానవులెవ్వరికీ లేనంత ఏకంగా రెండువందల సంవత్సరాలు" అని యముడు ఎక్స్‌ప్లెయిన్ చేస్తూండగానే మధ్యలో కట్ చేస్తూ ఆనందంగా "మరింకేం... అంటే ఇంకా నూటపది సంవత్సరాల ఆయుష్షు ఉందన్నమాట.

వేసవిలో తరవాణీ అన్నవంత చల్లని మాట చెప్పావు. నీ అమ్మ కడుపు చల్లగా... నా ఆయుష్షు కూడా పోసుకుని" అని బంగారమ్మ పలుకుతూండగా యముడు "ఆ.. ఆ.. ఆగుతల్లీ. తొందరపడి దీవించెయ్యకు" అంటూ గాభరాగా వారించాడు.

అర్థంగాక భ్రుకుటి ముడిచిన బంగారమ్మ "ఏం? దీవిస్తూంటే వొద్దంటావేం రోగం?" అంది.

"రోగం కాదు తల్లీ... అనురాగం. మీపట్ల అభిమానం. మీరు ఆ దీవెన ఇంకొక్కసారి ఎవర్నన్నా దీవిస్తే, వెంటనే, ఎట్ ఒన్స్, తురంతూ, శీఘ్రమే, మిమ్మలను తీసుకుపోవాల్సివస్తుంది.

ఇంక ఒక్క రెండు మాటలు కూడా మాట్లాడుకోలేం మనం. అదీ సంగతి" అని హెచ్చరించాడు. ఆశ్చర్యంతో నోరు వెళ్ళబెట్టిన బంగారమ్మ "ఇదేం పోయేకాలం పోకడా దారుణంగా...?!" అంటూ కీచుమంది అసహనంగా.

"చె..బ..తా. సావధానంగా వినండి. మీ ఒరిజినల్ ఆయుష్షు రెండొందల యేళ్ళని చెప్పాకదా. అంతెందుకు ఉందంటే... బ్రహ్మగారు మీ నొసట ఆయుష్షు వంద సంవత్సరాలు అని తలరాత రాస్తూండగా గాలి దుమారం వచ్చి ఆయన కంట్లో నలకలు పడి గంటం పట్టుకున్న చెయ్యి కదిలి ఒకటి అంకె వంకర్లు తిరిగి రెండు ఆకారాన్ని సంతరించుకుంది.

ప్రక్కన రెండుసున్నాలు చక్కగానేపడ్డాయి. ఇహ ఓసారి రాసిన రాతని మార్చే పవర్స్‌లేకనూ "పోనీలే పాపం ఆడపిల్ల" అనే జాలితోటి మరేం ప్రయత్నాలూ చేయకుండా ఆ అంకెని ఫైనలైజ్ చేసేశాడాయన"

"పోనీలే పుణ్యాత్ముడు. నా ఆయుష్షు కూడా పోసుకుని ఆ బ్రహ్మ...."

"వద్దూ.. దీవించవద్దు బాబోయ్. చాలా డేంజరు"

"సరే అననులే. ఇహ దయచెయ్"

"నేను చెబుదామనుకున్న అసలు విషయం చెప్పందే? నేను చెప్పొచ్చేదేవిటంటే మీ ఆ "నా ఆయుష్షు కూడా పోసుకుని...." దీవెనే మీ ఆయుష్షుని తగ్గించేసింది. ఒకర్నా ఇద్దర్నా గత నాలుగు దశాబ్దాలుగా ఎంతమందిని అలా ఫ్రీగా దీవించిపారేశారనీ మీరు! దెబ్బతో అవతలి వాళ్ళ పుణ్యాల్ని కూడా పరిగణనలోకి తీసుకుంటూ, మీ ఆయుష్షుని కొద్దికొద్దిగా తగ్గించుకుంటూ వాళ్ళకు యాడ్ చేసుకుంటూ వచ్చేసరికి, నూటపదేళ్ళు కట్ అయిపోయి, ఈ ఉదయంతో మీఆయుష్షు పూర్తైపోయిందన్నమాట.

అమ్మా... అదీ సంగతి. లేచి మొహం కడుక్కుని తయారవ్వండి. పొద్దెక్కకముందే మన లోకానికి జేరుదాం. ఎండలు మండిపోతున్నాయ్" అన్నాడు.

ఎప్పుడూ అడ్డమయినవాళ్ళనీ "నా ఆయుష్షుకూడా పోసుకుని" అంటూ ఉదారంగా దీవించేసే బంగారమ్మలో ఇప్పుడు ఆందోళన ప్రవేశించింది. అహాన్ని, కోపాన్ని అణచుకుని, "అదికాదు నాయనా.. ఏదో మనసుకి ఆనందం కలిగినప్పుడు ఖర్చులేని పనికదాని అలా దీవిస్తాంగాని.. నిజంగా 'నా ఖాతాలోని ఆయుష్షు నీకు జమవ్వాలనే ఉద్దేశ్యంతోనా ఏమిటీ?" అంది.

"ఏ ఉద్దేశ్యమైనా లెక్కలెక్కేనమ్మా. ముహూర్తం దాటకముందే బయల్దేరాలి మీరు"

"నిజానికి నాకు వంద ఏళ్ళు చాలయ్యా బాబూ. ఆ ప్రకారం మెదడుని సిద్ధం చేసేసుకున్నా. రెండొందలని నువ్వేఆశపెట్టావు. ఈ పదేళ్ళూ హ్యాపీగా గడిపేసుకుని పేచీ పెట్టకుండా వస్తాన్నేను. బాబ్బాబూ... ఓకే అను. మా బాబువి కదూ" బ్రతిమలాడింది.

"ఇంక మాటలనవసరం తల్లీ... తప్పదు. అయినా కంగారు పడకండి. ఈ జన్మలో మీరు చేసిన పుణ్యకార్యాలకి ప్రతిఫలంగా మీకు కొంతకాలం స్వర్గప్రాప్తి కూడా వుంది.

ఇంకో విశేషం... మీమీద జాలితో ఓ సీక్రెట్ లీక్ చేస్తున్నా... స్వర్గం ఛాన్స్ ఉన్నవాళ్ళకి ఈ మధ్యనే కొత్త అవకాశం కూడా వచ్చింది.

అదేమిటంటే స్వర్గంలో ఉండడానికి శాంక్షన్ అయిన పీరియడ్‌లో నైంటీ పర్సెంట్ సరెండర్ చేసేసినవాళ్ళకి ఒక్కసారి తమకి ఇష్టంలేని వ్యక్తులకి ఎంతటి నష్టమయినా కలగాలని శపించేసి, కసితీర్చుకునే ఫలితం పొందవచ్చుని. కనుక ముందు మన లోకంలో మీ టర్మ్ కానిద్దురు గాని నడవండి. అక్కడ్నుంచటే స్వర్గానికి వెళ్ళుదురు గాని"

యముడి మాటలకి అరడజను బాటిల్స్ ఎనర్జీ టానిక్‌తాగినంత శక్తివచ్చింది. బంగారమ్మకి. "టర్మా బర్మా? ఉచిత సమాచారమిచ్చి నీ జుట్టు అందించావు నాకు. ఇప్పుడే... ఈ క్షణమే... నాస్వర్గం ఎలిజిబిలిటీ టర్మ్‌లో తొంభై శాతం పంచభూతాల సాక్షిగా సరెండర్ చేసేస్తున్నా. ఆ ఫలితంతో నీ చిత్రగుప్తుడి చిట్టా వర్జా దొంగలెత్తుకుపోవాలి అని శపించేస్తా..."

అంటూండగా ఒక్కసారిగా ఒళ్ళంతా ముచ్చెమటలు పట్టేసిన యమధర్మరాజు. "అమ్మ తల్లో. ఎరక్కపోయి లీక్ చేసేశాను. కొంపముంచేస్తావ్.

నేనేదో అడ్జస్ట్ చేసుకుచస్తాగాని, నువ్వుమాత్రం నీలెక్కలప్రకారం మిగిలిన పదేళ్ళూ పూర్తయ్యాకే రా తల్లీ" అంటూ లెంపలేసుకుని బేర్‌మన్నాడు.

"మరయితే కదులూ" అంది బంగారమ్మ.

"చిత్తం" అంటూ మాయమైపోయాడుయముడు.

"అదీ బుద్ధిమంతుడి లక్షణమంటే మరి" అని మెచ్చుకుని, అంతటితో ఆగలేక,

"అమాయకపు కుంకా! నా ఆయుష్షు కూడా పోసుకుని.." అంటూ నవ్వుతూ దీవించబోయి, చటుక్కున నాలుక్కరుచుకుని, లెంపలేసుకుని, గుండెలమీద చెయ్యుంచుకుని స్థిమితపడుతూ... "హమ్మో! ఇహ రాబోయే పదేళ్ళలో ఛస్తే ఎవర్నీ ఈ దీవెనతో దీవించను బాబోయ్" అని ఒట్టేసుకుంది బంగారమ్మ.



ప్రభుత్వం చేసే చట్టాలలో తప్పులుంటే కోర్టు సరిదిద్దవచ్చు... కాని చట్టాలు చేసే హక్కు ప్రభుత్వానిదే.

-రవిశంకర్ ప్రసాద్, కేంద్రమంత్రి

# అంతా రాజకీయమే

## వందేళ్ళ పండుగ వుండదా!

రష్యాలో కమ్యూనిస్టు విప్లవం వచ్చి వందేళ్ళు అయింది. 1917 నాటి విప్లవం తర్వాత తెరమీదికి వచ్చిన సోవియట్ యూనియన్ విచ్ఛిన్నమైంది. సోష లిజం అనే పదం మరుగునపడింది.

అసలు మార్క్స్ సిద్ధాంతానికే కాలం చెల్లిందేమో నన్న సందేహం కలుగుతోంది. అటువంటి సమ యంలో వందేళ్ళ రష్యా విప్లవం ఎవరికీ పట్టని సంబ రంగా మిగిలిపోయింది.

తాము చేసిన తప్పులమీద ఇటీవల ఒక ఆంగ్ల వార పత్రికలో సీతారామ్ ఏచూరి ఒక వివరణాత్మక వ్యాసం రాసుకున్నాడు.

అయితే సోవియట్ పతనానికి కారణాలు అనేకం. అందులో అసలు ఆ విప్లవం, సోషలిజం నినాదాల వెనుక పార్టీ పెద్దలు నిర్మించిన ఏకపార్టీ నియంతృత్వం వుందన్న వాస్తవాన్ని అంగీకరించ లేకపోయారు.

వందేళ్ళ కమ్యూనిస్టు విప్లవం సెలబ్రేట్ చేసుకోలేక పోయిన పరిస్థితిలో, ఆ విప్లవం స్ఫూర్తితో భారత్‌లో ఏర్పడిన కమ్యూనిస్టు పార్టీ శత సంవత్సర పండుగ అస్సలు సాధ్యంకాదేమోనన్న భయం కమ్యూనిస్టులో మొదలైంది. 2019 ఎన్నికల్లో తిరిగి నరేంద్రమోడీ అధికారంలోకి వస్తే ఇక వందేళ్ళ ఎర్ర పండుగ ఆశలు నిండుకున్నట్టే. ◆

## టైమింగ్ కుదరక

సినిమా నటనలో టైమింగ్ అవసరమన్న సంగతి పవన్‌కళ్యాణ్‌కి బాగానే తెలుసు.కాని అంతే టైమింగ్ రాజకీయాలలో కూడా అవసరం అని పవన్‌కి అర్థం కావటంలేదు.రాజకీయం అనేది 24 గంటలు చెయ్యా ల్సినది. నా సినిమా షూటింగ్‌లు అయిన తర్వాత, ఆ సినిమా విడుదల ముందు ప్రమోషన్‌గా 'జన సేన'ను నడుపుతానంటే నెట్టుకురావటం కష్టం.

తనను నమ్ముకుని వెంట నడిచేవారికి, పవన్ వస్తాడని ఎదురుచూసే వర్గాలకి అతని రాకడ ఆల స్యం భరించలేనిదిగా వుంటున్నది.

ఇప్పుడు చంద్రబాబు వేసిన రాజకీయ రిజర్వేషన్ వలను ఛేదించుకుని రావటం కష్టమవుతున్నది.తమ మనిషి అని ఒక సామాజికవర్గం అనుకుంటున్నది.

తానేమో అందరి మనిషి అనిపించుకోవాలన్న తపనగలవాడు. మరి ఇప్పుడు కొత్తగా వచ్చిన రిజర్వే షన్ రొంపిలోకి దిగి ఒక వర్గానికి దగ్గరై, మిగిలిన వర్గాలను దూరం చేసుకుంటాడా! అందరివాడు అనే ఇమేజ్‌కోసం తనవాళ్ళను వదులుకుంటాడా!

సరైన సమయంలో రాజకీయ రంగప్రవేశంచేసి వుంటే ఈ గందరగోళం వుండేది కాదు. ◆

## రంగు మారనుంది

ఎన్నికలకు మరో సంవత్సరంన్నర వున్న వేళ బి.జె.పిలో అసమ్మతివర్గం రంగు మార్చుకునేందుకు సిద్ధమవుతున్నది.

తాము అనుకున్న పదవులు దక్కలేదన్న నాయ కులు ఇటీవల నరేంద్రమోడీమీద పరోక్షంగా, ప్రత్య క్షంగా విమర్శలు కుప్పిస్తున్నారు.

అటువంటి నాయకుల్లో ముఖ్యులైన యశ్వంత్ సిన్హా, శత్రుఘ్న సిన్హాలు ఇప్పటికే కాంగ్రెస్ గూటివైపు వెళ్ళేందుకు సిద్ధంగా వున్నారు.

ఒకప్పుడు ఎల్.కె.అద్వానీకి ఆప్తుడుగా వున్న సుధీంద్ర కులకర్ణి ఇప్పుడు హఠాత్తుగా కాబోయే ప్రధాని రాహుల్‌గాంధీనే అనే పల్లవి ఎత్తుకున్నాడు. ఈ జాబితాలో అరుణ్‌శౌరి కూడా వున్నాడు.

ఇదే పద్ధతిలో పార్టీని వదిలి, కాంగ్రెస్ కండువా కప్పుకుని, గెలిచి పంజాబ్‌లో మంత్రి ఐన నవజ్యోత్ సింగ్ సిద్దూ వారి కళ్ళముందు కనిపిస్తున్నాడు.

మరో క్రికెటర్ కీర్తి ఆజాద్‌ది కాంగ్రెస్ బాటనే అంటున్నారు. ఇలా పార్టీని వదిలేందుకు సిద్ధంగా వున్నవారంతా గుజరాత్ ఎన్నికల ఫలితాలకోసం ఆసక్తిగా ఎదురుచూస్తున్నారు.

భారతీయ జనతా పార్టీ గుజరాత్‌లో ఓడితే రాజ కీయ భూకంపం సృష్టిస్తాం అంటున్నాడు యశ్వంత్ సిన్హా, శత్రుఘ్న సిన్హాలు. ◆

## ఫలితం... ఏదీ!

2014 నాడు నరేంద్రమోడీ చేసిన వాగ్దానాల చిట్టాచాలా పెద్దది. అందులో ఎన్ని సాకారమయ్యాయి అనే ప్రశ్న గుజరాత్‌లో వేస్తున్నారు.

ఎంతో గొప్పగా ప్రారంభించిన స్మార్ట్ సిటీలు ఏమయ్యాయో ఎవరికీ తెలియటంలేదు.

'మేక్ ఇన్ ఇండియా' పరిస్థితి ఏమిటో ఏ మంత్రీ మాట్లాడటంలేదు. ఎన్ని ఉద్యోగాలు కొత్తగా సృష్టిం చిందీ లెక్కలు చెప్పటంలేదు.

నల్లడబ్బు వెనక్కి తెచ్చే యత్నం ఎంతవరకు వచ్చిందో అర్థంకావటంలేదు. ఇవన్నీ తేల్చకుండానే కొత్త సమస్యలు స్వయంగా సృష్టించుకున్నవి వున్నాయి. వీటన్నిటికీ సమాధానం చెబితేగాని అచ్చే దిన్ అన్న మాటకు అర్థం పూర్తవదు.

ప్రస్తుతంవరకు అవినీతిరహిత ప్రభుత్వం అనే ఇమేజ్ నరేంద్రమోడీకి రక్షణగా వుంది.

ఏ ఒక్క మంత్రి తప్పుచేసినా ప్రజలంతా ఒక్క సారిగా ఎదురు తిరగాల్సి వస్తుంది. ◆

## తిరిగి తిరిగి గుడికి

మతాన్ని, రాజకీయాలను మిళితం చెయ్య కూడదు అంటూ సెక్యులర్ పార్టీలు తమ ఎన్నికల ప్రచారం తిరిగి తిరిగి గుడి ముంగిట నిలవటం విచారకరం. ఎప్పుడైతే గుడి అంశం, మతం అనేది బి.జె.పికి అందిస్తారో అప్పుడు ఆ పార్టీ ఉధృత ప్రచా రాన్ని అడ్డుకోలేరు.

అయినా తెలిసి తెలిసి కాంగ్రెస్ నేతలు తమ ఎన్నికల ప్రచారాన్ని మతం దగ్గరికి, అయోధ్య రామ మందిరంవైపుకు మళ్ళించారు. లేకుంటే కపిల్ సిబాల్ వంటి నాయకుడు అయోధ్య దేవాలయ అంశంపై సుప్రీమ్‌కోర్టులో వున్న కేసును 2019 ఎన్నికల తర్వాతగాని చేపట్టవద్దని అడుగుతాడా!

అది నరేంద్రమోడీ ప్రభుత్వానికి అనుకూలమని నిండు కోర్టులో చెప్పిన తర్వాత ఇక బి.జె.పి దుమ్మెత్త కుండా వుంటుందా! సెక్యులరిస్టులమని చెప్పుకునే కాంగ్రెస్, తమ నేత రాహుల్‌గాంధీని గుడిగుడికి తిప్పుతున్నారు. శివభక్తుడినని ప్రకటన చేయించారు. కోర్టులో రాముడు లేనే లేడని అఫిడవిట్ ఇచ్చారు.

వెరసి చివరికి గుజరాత్ ఎన్నికల పోలింగ్‌కి ముందు విషయమంతా గుడిచుట్టూ తిరిగేలాచేశారు కాంగ్రెస్‌వారు. ◆

## చిక్కుకున్నారు

తమకు తాముగా తెలివిగా ఎత్తుగడలు వెయ్య గలగాలి... లేదా ప్రత్యర్థుల ఎత్తుగడలకు సరిగ్గా స్పందించి వాటిని భగ్నం చెయ్యగలగాలి. అలా కాకుండా తమకు తామే తప్పుడు ఎత్తుగడలు వేసి నప్పుడు రాజకీయంగా దిగజారతారు.

అందుకు ఉదాహరణ వై.కా.పావారి శాసనసభ సమావేశాల బహిష్కరణ. ఆ బహిష్కరణకు కారణం ఫిరాయింపుదార్లకు మంత్రి పదవులు కట్టబెట్టటం. వారిని అనర్హులుగా చేసేవరకు సభకు రాము అని భీష్మించుకున్నారు. ఫిరాయించినవారిమీద చర్య తీసుకోకపోవటం అనైతికం.

అయినా దానిని అలాగే నడిపిస్తారు అధికారంలో వున్నవారు. దీని తర్వాత వచ్చేది బడ్జెట్ సమావేశాలు. ఆ సమావేశాల వేళకు ఫిరాయింపుదారులమీద చర్యలు లేకుంటే వాటిని బహిష్కరించాల్సిందే కదా!

ఎన్నికల ముందు వచ్చేటువంటి బడ్జెట్‌ని అలా అధికార పార్టీకి ఏకపక్షంగా వదిలివేయొచ్చా?

ఎంత తప్పు! అధికార పార్టీని నిలదీయాల్సిన ప్రతిపక్షం శాసనసభ నుండి వెళ్ళిపోవటంద్వారా ప్రజలకు కలిగే మేలు ఏమిటి!



# హార్డ్‌వర్క్ గుర్తింపునకు ఆరేళ్ళు

అనేకసంవత్సరాలు యశ్‌రాజ్‌ఫిల్మ్స్‌కు కాస్టింగ్ డైరెక్టర్‌గా పనిచేసిన భూమిపడ్నేకర్ మూడు చిత్రాల డీల్‌తో తెరపైకి వచ్చింది.

రెండేళ్ళనాడు 'దమ్‌లాగా కె హైసా' సినిమాతో తొలిసారిగా నటించింది. ఈ సినిమాకోసం బోల్డన్ని కిలోలు బరువు పెరిగి, తిరిగి దాన్ని వదిలించుకున్నది. రెండో సినిమా 'టాయ్‌లెట్ ఏక్ ప్రేమ్‌కథ' సినిమాతో బాగా పాపులరయిపోయింది.

'శుభ్‌మంగళ్ సావధాన్' ఆమె మూడో సినిమా. ఆమెతో ఇంటర్వ్యూ విశేషాలు :

**రెండోచిత్రంలోనే అక్షయ్‌కుమార్‌తో కలిసి నటించగలగడం ఎలా ఉంది?**

ఇది నా అదృష్టం. ఆయనకు 25 సంవత్సరాల అనుభవం వుండికూడా ఎంతో బాగా వ్యవహరిస్తారు. తన జీల్‌ను,ప్రొఫెషనలిజాన్ని బాగా మెయిన్‌టెయిన్ చేస్తారు. పంక్చువాలిటీకి ప్రాధాన్యం ఇచ్చే వ్యక్తి. పరిశ్రమకు కొత్తదానిగా నేనెంతో నేర్చుకున్నాను.

నేను సౌకర్యంగా ఫీలయ్యేందుకు సహకరించారు. తనతో సమానంగా చూశారు.

నేనెంతో స్వేచ్ఛగా సందేహాలు నివృత్తి చేసుకోగలిగాను. స్పాట్ దాదానుంచి డైరెక్టర్‌దాకా ఆయన ప్రవర్తన సమానంగా వుంటుంది.

**పెరిగిన బరువు బాగా వదిలించుకున్నారే?**

(నవ్వేస్తూ) అవును. ఇందుకోసం చాలా పదార్థాలు మానేశా. రిఫైండ్ షుగర్స్, ఫ్యాటీ ఫుడ్, శాచురేటెడ్ ఫ్యాట్స్,మీట్స్-ఇలా ఎన్నో.వాటికి తోడు వర్కవుట్లు.

**కెరీర్ బావుందా?**

చాలా సంతృప్తిగా సాగుతున్నది. ప్రేక్షకులు, పరిశ్రమ చూపే ప్రేమ, ప్రశంసలకు కృతజ్ఞురాలిని. పరిశ్రమ నన్నెంతో ఆదరిస్తున్నది.

**మీ తొలి సహనటుడు ఆయుష్మాన్ ఖురానాతో మీ స్నేహం ఎలా ఉంది?**

నాకు ఆయుష్మాన్ ఖురానా మంచి స్నేహితుడు. నా చిన్నతనం నేస్తంవంటివాడు. సోదరుడివంటివాడు. తనతో చాలా కంఫర్ట్‌గా ఫీలయ్యా. ఎన్నో సృజనాత్మక ఆలోచనలు పంచుకుంటాం.

ఎప్పుడైనా ఫోన్ చేసుకుంటాం. అతనితో మరో సినిమా చేయడం మరీ బావుంది.

**ఎటువంటి ఆకృతి అందంగా ఉంటుందంటారు?**

ఒంపులు తిరిగిన శరీరంగల మహిళలు అందంగా వుంటారన్నది నా అభిప్రాయం. రాణీముఖర్జీ, కాజోల్, మాధురీదీక్షిత్‌లు ఇందుకు ఉదాహరణలు.

ఇటువంటి ఒంపులు తిరిగిన శరీరాకృతి విషయంలో భారతీయ మహిళలు అదృష్టవంతులు.

**సైజ్ జీరోపై మీ అభిప్రాయం?**

'సైజ్‌జీరో'పట్ల నాకు నమ్మకంలేదు.కాని,పాత్రకు అవసరమైతే నాకు అభ్యంతరంలేదు.

**నటించాలన్న కోరిక మొదటినుంచీ ఉండేదా?**

ఉండేది. కాని, నా కలను పండించుకోవడానికి చాలా టైమ్ పట్టింది. చిన్నతనంలోనే నాన్నగారు పోయారు. స్వంతకాళ్ళపై నిలబడగలగడం తొలి ప్రాధాన్యమయింది. కాస్టింగ్ డైరెక్టర్‌ను అయినప్పుడు నాకు పదిహేడేళ్ళు.

యశ్‌రాజ్‌ఫిల్మ్స్‌లో షానూశర్మతో కలిసి పనిచేశా. ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్‌కు హాజరైనట్లుగా వుండేది. రోజుకు 100-150 ఆడిషన్లు చేసేదాన్ని.



**మీకు యశ్‌రాజ్ ఫిల్మ్స్‌వల్ల సినిమా అవకాశం వచ్చిందా?**

ఈ మాట చాలామంది అన్నారు. అనేకమందిలో ఇదే అభిప్రాయం వుంది. కాని, ఇది నిజంకాదు.

నా హార్డ్‌వర్క్‌ను గుర్తించి, సినిమా కోసం నన్ను ఆడిషన్ చెయ్యడానికి ఆరేళ్ళ సమయం పట్టింది. తొలి సినిమా కోసం నేను ఇతర అమ్మాయిల్ని ఆడిషన్ చేస్తుండగా, నన్ను విడిగా రెండున్నర నెలలు ఆడిషన్ చేశారు.

ఉదయం నా దర్శకుడు రెండు గంటలు నన్ను ఆడిషన్‌చేస్తే,మధ్యాహ్నం 12 గంటల నుంచి నేను అదే పాత్రకోసం ఇతర అమ్మాయిల్ని ఆడిషన్ చేసేదాన్ని. వాళ్ళపట్ల ఫెయిర్‌గా వుండడానికి చాలా కష్టంగా వుండేది.

**ఎటువంటి సినిమాలు చేయడానికి ఇష్టపడతారు?**

అన్నిరకాలు. దృఢమయిన ఫీమేల్ పాత్రల అవకాశాలు రావడం నా అదృష్టం.

ఒకవేళ రేపు నా స్క్రీన్ టైమ్ చాలా తక్కువగా వున్న అవకాశం వచ్చినా, స్క్రిప్ట్ బావుంటే తప్పకుండా చేస్తానుకాని తిరస్కరించను.

**మీ తత్వం ఎటువంటిదంటారు?**

(నవ్వేస్తూ) గర్లీగా వుండే టామ్‌బాయ్‌ని. లక్ష్యాలు ఎక్కువ. మనిషిగా, నటిగా భవిష్యత్తులో చాలా సాధించాలనుకుంటున్నాను.

**మీ దృష్టిలో ప్రేమంటే?**

సంతోషం కలిసివుండగలగడం, నమ్మకం, పారదర్శకత, ప్రేమ అనేది బేషరతుగా వుండాలి. ఇఫ్‌లు, బట్‌లు వుండకూడదు.

**మీ జీవితంలో మిస్టర్ పర్‌ఫెక్ట్ ఉన్నారా?**

ప్రస్తుతం లేడు. బుర్రలో అయితే ఉన్నాడు.

**మగవాడిలో మీకు ఆకర్షించేది ఏంటి?**

అతను నవ్వే తీరు.

**ఎక్కువ సెక్స్ అప్పీల్ దేనిలో ఉందంటారు?**

నా మనస్సులో, బుర్రలో, మేధావితనానికి మించి మరేదీ సెక్సీగా వుండదేమో!

**మరువలేని క్షణాలున్నాయా?**

నా మొదటి చిత్రం 'దమ్‌లగా'. విడుదల అయిన సందర్భం, దానికి ఫిల్మ్‌ఫేర్ ట్రోఫీ అందుకున్న సందర్భం, మా నాన్నగారితో గడిపిన ప్రతిక్షణం- అంటూ ముగించింది భూమిపడ్నేకర్.

**అయినపూరి సుజాత**

# మనిషిలో మనిషి

రాజావారంటే అతడికి ఎంతో గౌరవం, భక్తి. సంజనా ఇలా ప్రవర్తించటం సరికాదనిపించింది. రాజావారు చాలా జాగ్రత్తమనిషి. పెద్దవయసుగాబట్టి కాస్త చాదస్తమూ ఉంటుంది. ఓపిగ్గా సమాధానాలు చెప్పాలిగాని ఇలా పెడసరంగా ప్రవర్తించటం తనను ఇరుకునపెట్టినట్టుంది.

"సంజూ ప్లీజ్...! రాజావారి ముందు ఇలా ప్రవర్తించకూడదు. కూర్చో" అర్థించాలి. "ఇంక ఎలా ప్రవర్తించాలి? నావల్లకాదు... వెళుతున్నానంతే..." అంటూ నాలుగు అడుగులు వేసింది సంజన.

అంతలో రాజావారు కల్పించుకుంటూ "ఆగమ్మాయ్" అంటూ లేచి దగ్గరకు వచ్చి వాత్సల్యంగా చూశారు. "నీ కోపం చూస్తూవుంటే మా అమ్మాయి గుర్తుకొస్తోంది. డోన్ట్‌వర్రీ ఇక నిన్ను ఇబ్బందిపెట్టను. మా ప్యాలెస్ నువ్వెప్పుడూ చూసుండవ్. వెళ్ళిచూసిరా. ఈలోపల మేంమాట్లాడుకుంటూవుంటాం" అంటూ ఇంటర్‌కమ్ ఆన్‌చేసి "వర్మా" అంటూ పిలిచాడు.



E-mail: Suryadevaranovelist@gmail.com

"చెప్పండి బావగారూ!" అవతలి నుంచి అడిగాడు సూర్యప్రకాశవర్మ.

"సంజనా బైటికి వస్తోంది. ఆ అమ్మాయికి మన ప్యాలెస్ తిప్పి చూపించే ఏర్పాటుచేయండి" అన్నారు రాజావారు.

"అలాగే బావగారూ! కాని ఈ సంజనా ఎవరు?"

"ఇప్పుడేగా లోనకు పంపించారు... కార్తికేయ సెక్రటరీ..."

"ఓకే! పంపించండి"

ఇంటర్‌కమ్ స్విచాఫ్ చేసి సంజనా వంక చూశారు రాజావారు. సంజనా విసవిసా వెళ్ళి డోర్ తీసుకుని బయటికి నడిచింది. వెనక్కివచ్చి తన సీట్లో కూర్చున్నారు రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్.

"క్షమించండి సార్...! సంజనా అలా ప్రవర్తించకూడదు. ఆమె తరుపున నేను క్షమాపణ కోరుతున్నాను" అన్నాడు నొచ్చుకుంటూ కార్తికేయ.

సూర్యదేవర రామ్‌మోహనరావు

## జరిగిన కథ 5

సౌందర్యానందసహనాదేవి జాతకాన్ని పరిశీలించి రానున్నది ఆమెకు గడ్డుకాలమని, ఆమె కోమాలోకెళ్ళి తనువు చాలించే అవకాశం ఉందని చెపుతాడు మున్నలూరు కృష్ణశాస్త్రి. ఇరవైనాలుగేళ్ళ వయసులోపే సహనా దేవికి పెళ్ళిచేస్తే ఆ గండం గడిచే అవకాశం వుందని తెలియజేస్తాడు కృష్ణశాస్త్రి.

వికాస్‌చంద్ర వివాహానికి అటెండ్ అవుతారు కార్తికేయ, సంజనా. దారిలో వారికి సిద్ధయోగి మణిసిద్ధుడు తారసపడతాడు. రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్ ఎస్టేట్స్‌లో కార్తికేయ సూపర్‌వైజర్‌గాపని చేస్తున్నాడని తెలుసుకుంటుంది సంజనా.

రాజావారు తనకిచ్చిన డాబా ఇంట్లో సంజనాతో ఓ రాత్రి గడుపుతాడు. మరుసటి రోజు సంజనాతో రాజావార్ని కలుస్తాడు.బయోటెక్నాలజీలో జీనియస్ అని, తన సెక్రటరీ అని ఆమెను పరిచయం చేస్తాడు రాజావారికి.

రాజావారు తనని అనుమానించేసరికి అవమానంతో లేచి వెళ్ళిపోవాలని ప్రయత్నిస్తుంది. ఇక తర్వాత జరిగేది చదవండి.









"ఇట్సాల్‌రైట్! కాస్త స్వాభిమానం ఎక్కువనుకుంటాను. ఇది సారీ చెప్పాల్సినంత విషయం ఏమీ కాదుగాని నాకో సంగతి చెప్పు. మీ ఇద్దర్నీ చూస్తుంటే చాలా దగ్గరైనట్టుంది. యామై రైట్?" రాజావారు సూటిగా అడిగేసరికి కాస్త సిగ్గుపడ్డాడు కార్తికేయ.

"మీ దగ్గర ఏదీ దాచలేను సర్. మేమిద్దరం ఒకరి నొకరు గాఢంగా ఇష్టపడుతున్నమాట నిజమే కాని... ఇప్పట్లో పెళ్ళిచేసుకునే ఆలోచనలేదు.లక్ష్యాన్ని సాధించాకే ఏదయినా" అన్నాడు కార్తికేయ.

"వెరీగుడ్! ఇక మన విషయానికొద్దాం. నీ ప్రయోగాలు ఎంతవరకొచ్చాయి?'కార్తికేయ ఎఫెక్ట్' ఏ దశలో ఉంది?" అడిగారు రాజావారు.

"రెండు ప్రయోగాలు విజయవంతంగా ముగిశాయి సార్. మూడో ప్రయోగం చివరిదశ టెస్టింగ్‌లో ఉంది. ఇంకో నెలరోజుల్లో అదీ సక్సెసవుతుంది"

"వెరీగుడ్! మీకు అక్కడ ల్యాబ్‌లో అసౌకర్యాలు ఏమీలేవు గదా?"

"తమ దయ మాకు ఎలాంటి సమస్యలూ, అసౌకర్యాలూ లేవు సార్. ఇప్పుడు కూడా బయటికొచ్చేవాడ్ని కాదు. ఒక ఫ్రెండ్ మ్యారేజ్ రిసెప్షన్‌కి బొబ్బిలివెళ్ళాల్సి వచ్చింది. మీరు వచ్చిన సంగతే నాకు తెలీదు. అనుకోకుండా నిన్న మీకు ఎదురయ్యాను"

"పనుల ఒత్తిడితో ఇక్కడికి రాగానే నీకు ఫోన్ చేయలేకపోయాను కార్తీ. అన్నట్టు నీకీ విషయం తెలుసా? ప్రపంచవ్యాప్తంగా ప్రజలు కార్తికేయ ఎఫెక్ట్ కోసం ఎదురుచూస్తున్నారు.

అనేక దేశాలు మద్దతు పలుకుతున్నాయి. మన ప్రధాని రెండురోజుల క్రితమే ప్రకటించారు. ఎంత



## ఒక్కగంటలో నిర్ణయం

**త**మిళం నుంచి తెలుగులోకి దూకేసింది మధురైలో పుట్టిపెరిగిన నివేదా పెతురాజ్. 'మెంటల్ మదిలో' సినిమాలో స్వేచ్ఛగా ప్రేక్షకులను మెప్పించింది.

"సినిమాలో స్వేచ్ఛమాదిరే నిజజీవితంలోనూ స్వేచ్ఛగా నిర్ణయాలు తీసుకుంటాను. ఈ చిత్రం చేయాలా? వద్దా? అన్న విషయంలో ఒక్క గంట లోనే నిర్ణయం తీసుకున్నాను.

తమిళంలో ఓ నాలుగు సినిమాలు చేశా.తెలుగు లోనూ అవకాశాలు వస్తున్నాయి. కథలు విని మంచి చిత్రాలు అంగీకరిస్తా. మరో మూడు తమిళ సిని మాలు ఒప్పుకోబోతున్నాను" అంటూ విషయాలు ఏకరువుపెట్టింది నివేదా పెతురాజ్.



ఖర్చయినా సరే ఆరోజువస్తే కార్తికేయ ఎఫెక్ట్‌ని భారత దేశం ముందుగా వినియోగించుకుంటుందని"

"అవున్సార్. న్యూస్‌పేపర్స్‌లో చదివాను. మరో విశేషం ఉంది సార్! ఈ ఉదయం అమెరికన్ న్యూస్ ఛానల్స్ చూశాను. కొలంబియా అడవుల్లో స్మగ్లర్ ముఠాలు మూడు వందలమంది పోలీసుల్ని హత మార్చాయట. మాఫియా కింగ్ పాబ్లో ఎస్కోబార్ హస్తం ఈ మారణకాండ వెనక వుందని అనుమానిస్తు న్నారు. అందుక్కారణం ఉంది.

కార్తికేయ ఎఫెక్ట్ ఆరంభమయితే స్మగ్లర్స్‌కు ఉత్పన్నమయ్యే సమస్యలమీద చర్చిం చటం కోసం పాబ్లో అటవీ ప్రాంతంలో ఎక్కడో ఒక అంతర్జాతీయ సమావేశాన్ని నిర్వహించాడు. దీన్ని భగ్నంచేసేందుకు పోలీసు బలగాలు వెళ్తొండగా ఆ మారణకాండ చోటుచేసుకుంది. ఏ అమెరికన్ న్యూస్‌ఛానల్ చూసినా ఇదే ప్రముఖ వార్త"

"సో... నువ్వెవరో తెలీకుండానే రక్తపాతం ఆరంభ మైంది. తెలిస్తే ఇంకెంత జరుగుతుందో ఊహించు కోవచ్చును. మనం ల్యాబ్ విషయంలో మరింత భద్రతా చర్యలు చేపట్టాలి. తప్పదు"

రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్ మాటల్లో ఆవగింజంత కూడా అసత్యం లేదు. ఎందుకంటే పర్లాకిమిడి నుండి వంద కిలోమీటర్ల దూరంలో ఉంది కార్తికేయ లేబొరేటరీ.

అది లోతట్టు దట్టమైన అటవీ ప్రాంతం. క్రూర మృగాలకు విషపురుగులకు నిలయం. పులులు, చిరుతలు, ఏనుగులు, ఎలుగ్గొడ్లు, తోడేళ్ళు, అడవి దున్నలు గుంపులు గుంపులుగా సంచరిస్తుంటాయి. ఆ ప్రాంతానికి ఒంటరిగా పోవడానికి ఆటవికులేభయ పడతారు. అలాంటి ప్రమాదకరమైనచోట - ఓ కొండ వాగు చెంత యాభై ఎకరాల స్థలాన్నిచుట్టి కోటగోడలా ఎత్తయిన రాతిగోడ ఉంది. లోన వేసవి విడిదికోసం నిర్మించుకున్న రాతికట్టడ దుర్గం ఉంది.

అది రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్‌గారి తండ్రిగారు రాజా రామచంద్ర గజపతి మహదేవ్‌వారి హయాంలో నిర్మించబడిన వేసవి విడిది దుర్గం.

ఆయన మృగయా వినోదప్రియుడు. అడవికి వేటకొచ్చినప్పుడు తమకు, తమ పరివారానికి విడిది కోసం నిర్మించింది. చుట్టూ ఎత్తయిన గోడకారణంగా క్రూరమృగాలు లోన ప్రవేశించే అవకాశం లేదు.

ఇక్కడ మరో విశేషం కూడా ఉంది. తాము వేట కొచ్చిన సమయం కనిపెట్టి శత్రువులు ముట్టడిస్తే తప్పించుకుని పర్లాకిమిడి కోటకు చేరుకోడానికిఅను వుగా దుర్గం నుంచి సొరంగమార్గం నిర్మించబడింది. మూడేళ్ళ క్రితం కార్తికేయ తన లక్ష్యం గురించి, చేయాల్సిన ప్రయోగాల గురించి వివరించినప్పుడు రాజా విష్ణుచంద్ర మహదేవ్ ముగ్ధుడైపోయాడు.

కార్తికేయ రహస్యంగా తన ప్రయోగాలు నిర్వహిం చేందుకు వీలుగా తమ వేసవి విడిది దుర్గాన్ని ల్యాబ్‌గా మార్చుకోడానికి అనుమతిచ్చారు. స్వయంగా తీసు కెళ్ళి చూపించారు. క్రూరమృగాల సంచార ప్రాంతం గాబట్టి అటుగా ఎవరూ రారు.

ల్యాబ్ నుంచి బయటి ప్రపంచానికి తెలిసే అవ కాశం లేదు. అప్పట్నుంచీ కార్తికేయకు తన లేబొ రేటరీయే ప్రపంచం అయిపోయింది. ఆపైన సొరంగ మార్గం ఒక ప్లస్ పాయింటయింది.

ఒక బస్సు సులు వుగా ప్రయాణించగల విశాలమయిన సొరంగ మార్గం అది. ప్రస్తుతం ల్యాబ్‌కి కార్తికేయ రాక పోకలు సాగించేది ఆ మార్గం గుండానే.

ఒక కొండగుట్టపాదంనుండి ఈ సొరంగంఆరంభ మవుతోంది. అందులోకి ఎవరూ ప్రవేశించకుండా కొండలో కలిసిపోయేట్టు ఆటోమేటిక్ డోర్స్ ఏర్పాటు చేసుకున్నాడు కార్తికేయ. కాబట్టి అడవిలో ఎక్కడికెళ్తు న్నాడు, ఎక్కడ్నుంచొస్తున్నాడన్నది ఎవరికీ తెలీదు.

హెలికాప్టర్‌లో ఆకాశం నుంచి చూసినా అది ఒక పురాతన రాతిదుర్గంలాగే కన్పిస్తుందిగాని అక్కడొక ల్యాబ్ ఉన్న సంగతే తెలీదు.

"సో... వాట్ నెక్స్ట్...?" రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్‌గారి ప్రశ్నతో ఆలోచనలనుంచి బయటపడ్డాడు కార్తికేయ.

"సార్... కార్తికేయ ఎఫెక్ట్ ప్రయోగదశ, పరిశీలన దశలు పూర్తికాగానే ఉత్పత్తిదశ ఆరంభం కావాలి. అందుకుటైమ్‌పడుతుంది"బదులిచ్చాడు కార్తికేయ. రాజావారు సాలోచనగా చూశారు-

"అర్థమవుతోంది కార్తీ. మొత్తం భూగోళాన్ని శుద్ధి చేసే కార్యక్రమం ఇది. దానికి సంబంధించిన కెమి కల్స్ నిర్విరామంగా ఉత్పత్తి చేసి ప్రపంచ దేశాలకు సరఫరా చేయగలిగితేనే అది సాధ్యపడుతుంది.

పంట నాశనం చేసే క్రిమికీటకాల నిర్మూలనకు ఏ ఒక్క రైతో నడుం బిగిస్తే చాలదు గదా. క్రిమికీట కాలు పక్కచేలనుంచి వచ్చిపడతాయి.

కాబట్టి ఒక ప్రాంతం రైతులంతా ఒకేసారి నిర్మూ లనకు నడుం బిగిస్తారు. అదేవిధంగా ప్రపంచదేశాలన్నీ ఏకకాలంలోనే కార్తికేయ ఎఫెక్ట్‌కోసం నడుం బిగిం చాలి. ఇదలా ఉంచితే అంత భారీ ఎత్తున ఉత్పత్తి సాధ్యమా?" సందేహాన్ని బైటపెట్టారు రాజావారు.

"సాధ్యమే సార్" అన్నాడు స్థిరంగా కార్తికేయ.

"ఎలా?"

"కెమికల్స్ తయారుచేసే కర్మాగారాలు మూడు అవసరమవుతాయి. వాటిని స్వల్పమార్పులతో ఈ మూడు విధాలయిన కెమికల్స్ ఉత్పత్తి చేయవచ్చు. ముడిసరుకులకు విదేశాలమీద ఆధారపడాల్సిన అవసరంలేదు. ఇక్కడే పుష్కలంగా లభిస్తాయి.

కాదంటే భారీగా ఫండ్స్ అవసరమవుతాయి. అలాగే మేన్‌పవర్ కావాలి. పర్లాకిమిడి పరిసర యువ తకు శిక్షణఇచ్చి ఉద్యోగావకాశాలు కల్పించవచ్చు"

"సుమారు ఎంత ఖర్చవుతుంది?"

"ఐదు వందలకోట్ల వరకు అవసరం ఉంటుంది సార్. ఇది ఉత్పత్తి దశవరకు మాత్రమే"

"అంటే ఉత్పత్తికోసం మరో ఐదువందల కోట్లు అవసరం అను కుందాము. అంటే మొత్తం వెయ్యి



**యు.పి.ఎ. హయాంలో సాధించిన వృద్ధిరేటును ఎన్.డి.ఎ ఎన్నటికీ సాధించలేదు.**

-మన్మోహన్‌సింగ్, మాజీ ప్రధాని

కోట్లు అవసరం. అంతేగా!"

"ఇంకా ఎక్కువే కావాలి సర్. కాని మనం ఏ దేశానికీ ఫ్రీగా సప్లయ్ చేయం. ఆ యా దేశాలు ఖర్చులు భరించాలి. ఖర్చులు భరించినా పాకిస్తాన్‌లాంటి ఉగ్రవాద దేశానికి ఏమాత్రం అందించం"

"నీ ప్లానేమిటో చెప్పు"

"ముందుగా మన ప్రభుత్వాన్నుంచి సాయం కోరాలనుకుంటున్నాను. అలాగే ఇతరదేశాలనుంచీ అప్పుగా స్వీకరించి ఆ మొత్తానికి సరుకు పంపించి అప్పు తీర్చేయొచ్చు. మరో విషయం ఏమంటే రక్షణ వ్యవహారం. ఇంత భారీ ప్రాజెక్ట్‌ను కాపాడుకోవాలంటే ప్రభుత్వమే ముందుకొచ్చి రక్షణ కల్పించాలి. ఈ విషయంకూడా ప్రధానంగా చర్చించవలసిఉంది"

"అది సరి. ఇప్పుడు ల్యాబ్ ఉన్నది యాభై ఎకరాల స్థలంలోనే. కర్మాగారాల నిర్మాణానికి ఆ స్థలం చాలదు గదా" అన్నారు రాజావారు.

"అవున్సార్. ఒరిస్సా ప్రభుత్వంతో సంప్రదించి అక్కడే కనీసం అయిదువందల ఎకరాల అటవీ ప్రాంతాన్ని కర్మాగారాలు, గోడౌన్లు ఇతర అవసరాలకోసం తీసుకోవాలి"

కార్తికేయ మాటలు విని -

కొద్దిక్షణాలు మౌనంగా ఉన్నారు రాజావారు.

ఏదో గుర్తుకువచ్చి తలెత్తి చూశారు. "ఓకే! అసలు ఈ ప్యూరిఫికేషన్ కెమికల్స్ ప్రయోగించటం ఎలా?" అని అడిగారు రాజావారు.

"వెరీ సింపుల్ సర్" అన్నాడు కార్తికేయ.

"చెప్పు. ఏ విధంగా?" ఆసక్తిగా అడిగారు రాజా విష్ణుచంద్ర గజపతి మహాదేవ్.

"పంటలకు రసాయన ఎరువులు, పురుగుల మందులు స్ప్రే చేసే విమానాలుగాని, హెలికాప్టర్లుగాని ఇందుకోసం ఉపయోగించవచ్చు. మన కెమికల్స్ మూడింటిని వాటర్‌లో కలిపి ద్రవరూపం ఇచ్చి వాడాల్సివుంటుంది. నేలకు అయిదారు కిలోమీటర్ల ఎత్తునుంచి స్ప్రే చేసుకుంటూపోవాలి.

ముందుగా భూమి ప్రక్షాళన చేసేందుకు చేసిన కెమికల్‌ను స్ప్రే చేయాలి. పదిరోజుల వ్యవధి తర్వాత నీటిని శుద్ధీకరించే కెమికల్ స్ప్రే చేయాలి. ఇంకో పది దినాల పిమ్మట చివరిగా గాలిని ప్రక్షాళనచేసే కెమికల్ ప్రయోగించాలి. అంటే నెలరోజుల్లో ఈ కార్యక్రమమంతా ముగించాల్సివుంటుంది.

తద్వారా భూమి, నీరు, గాలి శుద్ధి చెందుతాయి. రసాయనచర్య కారణంగా భూసారం పెరుగుతుంది. జలకాలుష్యంతొలగుతుంది. గాలి శుద్ధీకరించబడుతుంది. ముఖ్యంగా వాతావరణ కాలుష్యానికి కారణం అవుతున్న ఉద్గారాల శాతం గణనీయంగా తరిగిపోవటం చేత భూ ఉష్ణతాపంతగ్గిపోతుంది.

పైన తరిగిపోతున్న ఓజోన్ పొర క్రమంగా యథాపూర్వస్థితికి చేరుకుంటుంది. మంచి మార్పులు ఆరంభమవుతాయి. ఇలా ప్రతి ఐదేళ్ళకు ఓసారి చొప్పున ఐదుసార్లు ప్రయోగించవలసివుంటుంది.

## ఆ పాత్ర సులువైంది

**పం**జాబ్ పిల్ల మెహరీన్‌కు నటి కావాలన్న కోరిక మొదటినుంచీ లేదట. పై చదువులకోసం న్యూయార్క్ వెళ్ళినప్పుడు 'సౌత్ ఏసియా కెనడా' పోటీల్లో సరదాగా పాల్గొని టైటిల్ గెల్చుకున్నాక నటించాలన్న కోరిక కలిగిందట.

"ఓ యాడ్‌లో నన్ను చూసి 'కృష్ణగాడి వీర ప్రేమ గాథ' ఛాన్స్ ఇచ్చారు. అప్పటికే మహాలక్ష్మి పాత్ర కోసం నాలుగొందలమందిని ఆడిషన్ చేశారు.

నాతో కొన్ని డైలాగులు చెప్పించి, స్క్రీన్ టెస్ట్ చేసి హీరోయిన్‌గా ఎంపికచేశారు. నిజజీవితంలో నేనూ మహాలక్ష్మిలాగే వుంటాను కాబట్టి ఆ పాత్ర చెయ్యడం సులువైంది" అని తెలిపింది.



తద్వారా గాలి, నీరు, భూమితోబాటు ఆకాశం, అగ్ని కూడా పూర్తిగా శుద్ధిగావించబడి క్రీస్తుపూర్వం నాటి అంటే సుమారు మూడువేల సంవత్సరాల క్రితం భూగోళ వాతావరణపరిస్థితులు ఎంతచక్కగా ఉండేవో ఆ పరిస్థితులు ఏర్పడతాయి.

అప్పుడు అంతరించిన అరుదైన వృక్షజాతులు, జీవజాలం తిరిగి ఆవిర్భవిస్తాయి. ఈ రోజు వాతావరణ కాలుష్యంతో వృద్ధిచెందుతున్న విషవృక్షాలు, వింతజీవులు గణనీయంగా తరిగిపోతాయి.

స్వచ్ఛమయిన వాతావరణం, సకాలంలో కురిసే వర్షాలు, ఇక మానవుల స్వభావాలు ధర్మానుగుణంగా మారి లోకకళ్యాణం జరుగుతుంది" అంటూ కార్తికేయ వివరిస్తుంటే ఆసక్తిగా వింటూండిపోయారు రాజావారు. పాబ్లో ఎస్కోబార్‌వంటి మాఫియాకింగ్ ఎందుకు ఆందోళన చెందుతున్నాడో అర్థమైంది.

మెచ్చుకోలుగా కార్తికేయను వీక్షించారు.

"ఇది చాలా లాంగ్‌ప్రాసెస్. అలాగే డబ్బుకూడా ఖర్చవుతుంది. అయినా సరే ప్రపంచదేశాలు నడుం బిగిస్తే కష్టమేమీకాదు. ఆ స్టేజికి ఈ ప్రాజెక్ట్‌ను తీసుకెళ్ళాలంటే మనముందు చాలా సమస్యలే ఉన్నాయి. వాటిని అధిగమిస్తూ ముందుకు వెళ్ళాలి.

ఓకే! ఇక్కడ పనులు ముగించుకుని రెండుమాసాల్లో తిరిగి లండన్ వెళ్ళిపోదామనుకున్నాను. అవసరమైతే నీకోసం కొంతకాలం ఆగుతాను. ముందు నీ ప్రయోగాలు ముగించి సక్సెస్ చేస్తే నేను ప్రధానితో అపాయింట్‌మెంట్ తీసుకుంటాను.

ఇద్దరం ఢిల్లీ వెళ్ళి ప్రధానిని కలిసి ఈ ప్రాజెక్ట్ గురించి వివరిద్దాం. చర్చిద్దాం.

ఈ విషయంలో ప్రభుత్వ సహాయసహకారాలు ఎంతవరకు ఉంటాయో చూసి అవసరమైతే మన సంస్థానం కూడా కొంత పెట్టుబడి పెడుతుంది. నీ కృషి ఫలించే మంచిరోజు కోసం ఎదురుచూస్తోంది ప్రపంచం. మేమూ ఎదురుచూస్తాం" అంటూ తన మనసులో మాట బయటపెట్టారు రాజావారు.

"కృతజ్ఞుడ్ని సార్. థాంక్యూ..." అన్నాడు వినమ్రంగా కార్తికేయ.

చాలాసేపు ఈ విషయంగా చర్చిస్తూ కూర్చున్నారు ఇద్దరూ. టైమ్ గడిచిందే తెలీలేదు.

ఈలోపల ప్యాలెస్‌ను చుట్టి చూసిన సంజనా అక్కడికి చేరుకుంది. అప్పటికి మధ్యాహ్నం ఒంటి గంట దాటింది. భోజన సమయమది.

"సార్! ఇక మేం బయలుదేరతాం..." అంటూ లేచాడు కార్తికేయ.

"నో నో... వెళ్ళటానికి తొందరేమిటి? ఈ పూట ప్యాలెస్‌లో మాతోపాటు మీరుకూడా భోంచేస్తున్నారు"

"అది కాదు సార్..."

"ఇంకేం చెప్పకు కార్తీ. కాసేపట్లో డైనింగ్ హాల్‌కి వెళదాం... రామ్మా సంజనా.... కూర్చో... ప్యాలెస్ తిరిగి చూశావా? ఎలా ఉంది?"

"చూశాను సార్. చాలా బాగుంది. నాకీ అవకాశం కల్పించినందుకు థాంక్స్..." అంటూ కార్తికేయ పక్కన



రాహుల్‌గాంధీ ఎప్పటినుండో శివపూజలు చేస్తున్నారు... కాని అమిత్‌షా జైన్ అయివుండి హిందువునని చెప్పుకుంటున్నాడు.

-రాజ్‌బబ్బర్, కాంగ్రెస్ నేత



## మూడేళ్ళుగా మరింత సంతృప్తి

**త**నకోసం దర్శకులు పాత్రలు రెడీ చేశారంటే ఎంత ఆనందమో చెప్పనక్కర్లేదు కదా. అదే ఆనం దాన్ని కొన్నేళ్ళుగా తాను అనుభవిస్తున్నాను అంటు న్నది కాజల్ అగర్వాల్.

"సినిమాల ఎంపిక విషయంలో ఒక్కోసారి ఒక్కో విషయానికి ప్రాధాన్యమిస్తుంటాం. కానీ, ఈమధ్య కాలంలో పాత్రలు నన్ను ఎక్కువగా ప్రభావితం చేస్తున్నాయి. మంచి పాత్ర గురించి విన్నప్పుడు మిగతా విషయాలేవీ పట్టించుకోకుండా ఆ పాత్ర కోసం సినిమా చేయాలనిపిస్తోంది. అలా విభిన్న పాత్రలను చేయగులుగుతున్నాను. గతంతో పోల్చితే నా సినీప్రయాణం మూడేళ్ళుగా మరింత సంతృప్తిగా సాగుతున్నది" అని వివరించింది.





కూర్చుంది సంజనా.రాజావారు కార్తికేయవంక చూసి నవ్వారు. "ఈ అమ్మాయి చాలా ముక్కోపిలా ఉంది. ఎలా భరిస్తున్నావయ్యా కార్తీ. పైగా లవ్ చేశానంటు న్నావ్" అన్నారు పరిహాసంగా.

సంజనా తిరిగి రుసరుసలాడబోతుంటే -

చేతిని అదిమి వారించాడు కార్తికేయ.

"మీరన్నది నిజమేగాని స్వతహాగా చాలా మంచిది సార్. చాలా తెలివైనది. ల్యాబ్‌లో నా తర్వాతి స్థానం తనదేనంటే నమ్మండి. ఇక పెళ్ళేవద్దనుకున్న నన్ను ముగ్గులోకి దించటం సాధారణ విషయమా. సార్! మీరు మాకో సాయం చేయాలి" అన్నాడు.

"చెప్పు. ఏం చేయాలి?"

"యు.కె.నుంచి సంజనా పేరెంట్స్ ఎప్పుడయినా రావచ్చు. వెనకా ముందు ఎవరూ లేని నాకు మీరే పెద్దదిక్కు. వాళ్ళతో మాట్లాడి మా పెళ్ళి జరిపించాల్సిన బాధ్యత మీదే" అంటూ అర్థించాడు కార్తికేయ.

"ష్యూర్! తప్పకుండా మాట్లాడతాను. పెళ్ళి అంటే మామూలు విషయం కాదుగదా. ఆస్తిపాస్తులు, అంతస్తులు, కులం గోత్రం, కట్నకానుకలు ఇలా ఒకటా రెండా అన్నీ సవ్యంగా ఉంటేనే పెళ్ళి.

కాని మీ విషయంలో నేను పెద్దగా వ్యవహరించి సెటిల్ చేసి పెళ్ళి జరిపిస్తాను. ఓకేనా! ఇకలేవండి" అంటూ లేచారు రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్. ఆయన ఇచ్చిన హామీ ఆ జంటకు తృప్తినిచ్చింది.రాజావారి వెంట డైనింగ్‌హాల్‌కి బయలుదేరారు. ఆ సమయంలో -

మున్నలూరు నుంచి వచ్చిన రాజగురువు కృష్ణ శాస్త్రి ప్యాలెస్‌లో లేడు. ఉంటే సంజనా కార్తికేయల జాతకబలాల్ని రాజావారు పరిశీలింపజేసేవారేమో! కాని కృష్ణశాస్త్రి తన మేనల్లుడు వేదాచారిని ఊరికి పంపించడానికి తన కార్లో స్టేషన్‌కు తీసుకెళ్ళాడు.

వేదాచారిని రైలెక్కించి పనిమీద పక్క ఊరికెళ్ళి ప్యాలెస్‌కి తిరిగివచ్చేసరికి ఆ రోజు సాయంకాల మయింది. ఈ లోపల - భోజనానంతరం రాజావారి వద్ద సెలవు తీసుకుని తమ వ్యాన్‌లో ఇంటికి తిరిగి వచ్చారు కార్తికేయ సంజనాలు.

చీకటిపడకముందే ల్యాబ్‌కు చేరుకునే ఉద్దేశంతో వెంటనే అడవికి బయలుదేరారు.

**అ**దేరోజు రాత్రి - ఎనిమిదిగంటలకు రాజావారి ఫోన్ మోగింది. చూస్తే... అది తమిళ నాడు పీఠాధిపతి స్వామి సత్యానంద ఫోన్‌కాల్. ఇది రాజావారు ఊహించని ఫోన్‌కాల్.

ప్యాలెస్‌కు వచ్చిన రోజే స్వామీజీకి ఫోన్‌చేసి చాలా విషయాలు మాట్లాడారు. అయిదు రోజులకే ఆయన ఫోన్ చేస్తున్నారంటే ఏదో విశేషమే ఉంటుంది.

ఆలోచిస్తూనే ఫోన్ లిఫ్ట్ చేశారు రాజావారు.

"వణక్కం గురూజీ!" అంటూ పలకరించారు.

"నల్లదు రాజా అవర్‌గళే. క్షేమందానే... ఎలా ఉన్నారు?"అవతలినుంచి స్వామి సత్యానంద గొంతు గరగరలాడింది. "క్షేమమే స్వామీ... అనుకోకుండా ఫోన్‌చేశారు. ఏమిటి విశేషం?"

అడిగారు రాజావారు.

"విశేషం వుంది రాజావారు. చాలా ముఖ్యవిషయం" అన్నాడు తమిళ పీఠాధిపతి స్వామి సత్యానంద.

"చెప్పండి స్వామీ. ఏమిటది?"

"ఫోన్‌లో చెప్పటం వీలుకాదు. ఇది యువరాణీవారి భవిష్యత్తుకు సంబంధించిన విషయం. నేను రేపు బయలుదేరి పర్లాకిమిడి రావాలనుకుంటున్నాను"

"మీరాక మాకూ సంతోషమేగా స్వామీ. అవశ్యం బయలుదేరి రండి" అన్నారు రాజావారు.

"రేపు ఉదయం ఫ్లైట్‌కి బయలుదేరి మా ఇద్దరు శిష్యులతో భువనేశ్వర్ చేరుకుంటాము. అక్కడినుండి రోడ్డుమార్గంగా సాయంత్రానికి పర్లాకిమిడివస్తాం"

"భువనేశ్వర్ ఎయిర్‌పోర్ట్‌కి కారు పంపిస్తాను స్వామీ" అన్నారు రాజావారు.

"వద్దు. భువనేశ్వర్‌లో మా శిష్యులున్నారు. ఏదో ఒక కారులో మేమే ప్యాలెస్‌కు చేరుకుంటాం. ఉంటాను" అంటూ అవతల లైన్ కట్ చేశాడు తమిళ పీఠాధిపతి స్వామి సత్యానంద.

స్వామివారి రాక విషయం తెలీగానే -

రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్ ఆలోచనల్లో కూరుకుపోయారు. యువరాణి భవిష్యత్తుకు సంబంధించిన విషయమంటే ఏమై ఉంటుంది? తమ క్షేమం కోరేవారిలో స్వామి సత్యానంద ఒకరు.

తమ తనూజ గురించి రాజగురువు కృష్ణశాస్త్రి చెప్పిన భవిష్య విషయాలే స్వామి సత్యానంద కూడా గతంలో చెప్పారు. మరి ఇప్పుడు చెప్పబోయే కొత్త విషయం ఏమై ఉంటుంది? కృష్ణశాస్త్రి గారు చెప్పినట్టే గండం గడిచేందుకు వేగిరం వివాహం జరిపించాలంటారా? దీర్ఘంగా ఆలోచిస్తున్నారు.

**కు**మార శక్తిపీఠం - పళని... మహాశక్తి సంపన్నుడైన సుబ్రమణ్యేశ్వరుని గాథల్ని, మహిమల్ని, భక్తిమార్గాలను, జ్ఞానమార్గాన్ని ప్రబోధించి ప్రచారంచేసే పీఠం.

సుమారు మూడువందల ఎకరాల స్థలం, లెక్కకు మించి ఆశ్రమాలు, ప్రాంగణాలు, సభావేదికలు ఉన్నాయి. అత్యంత సుందరమైన స్కందుడి ఆలయం కూడా వుంది. నిరంతరం ఇక్కడికి భక్తులు, శిష్యులు వచ్చిపోతూనే ఉంటారు. నిత్యం ఏదో ఒక భక్తి కార్యక్రమం జరుగుతూనే ఉంటుంది.

ఆశ్రమవాటికలో అడుగుపెడితే నిత్యకళ్యాణం పచ్చతోరణంలా కన్పిస్తుంది. ఎంతో ప్రశాంతంగా మనసుకు ఆహ్లాదం కల్గుతుంది.భక్తిభావం ఉప్పొంగుతుంది. ఈ కుమారశక్తిపీఠం వెలసి ఎంతకాలమైందో తెలీదుగాని ప్రస్తుత పీఠాధిపతి అయిన శ్రీ సత్యానందస్వామి పన్నెండో పీఠాధిపతి.మూడుతరాలుగా పర్లాకిమిడి రాజవంశానికి కుమారశక్తి పీఠంతో అనుబంధం ఉంది.

ప్రతిఏటా పళని వేలాయుధుని దర్శించి అర్చించుకుని అటునుంచిఆశ్రమానికి వెళ్ళి పీఠాధిపతిని దర్శించటం ఆనవాయితీ.

ఇంకా ఉంది

నా ఉద్దేశంలో క్రీడారంగం కూడా వాణిజ్య ప్రయోజనాలతో కూడుకున్నదే.

-పుల్లెల గోపీచంద్, షటిల్ కోచ్



# గోవా విమోచన వేళ

భారతదేశం ఆగష్టు15, 1947న స్వతంత్ర దేశంగా అవతరించింది. ఐతే నాడున్న భారతదేశం నేడు మనంచూస్తున్నటువంటి భారతదేశం పటం ఒక్కటికాదు. అప్పటికి ఎన్నెన్నో స్వదేశీ సంస్థానాలు మనదేశంలో ఉన్నాయి.

వాటితోపాటుగా వలసపాలకులయిన ఐరోపా ఖండాలవారు పాలించే ప్రాంతాలూ ఉన్నాయి. వరుసగా ఒక్కొక్క స్వదేశీ సంస్థానాన్ని భారత్‌లో విలీనం చెయ్యటానికి సంవత్సరంపైన పట్టింది. ఈలోగా కొంత కాశ్మీర్ భూభాగం పాకిస్తాన్ ఆక్రమించింది. అది వేరే సంగతి.

నాటికి ఫ్రెంచ్ పాలకుల చేతిలో వున్న పాండిచ్చేరి, పోర్చుగీసు పాలకుల చేతిలో వున్న గోవా ప్రాంతాలు భారతదేశంలో విలీనం కాలేదు.

ఆ యా ప్రదేశాలలో నివసించే భారతీయులు విదేశీ పాలకులకు వ్యతిరేకంగా ప్రజా ఉద్యమాలు చేసినా అవి అణిచివేతకు గురయ్యాయి.

పాండిచ్చేరిలో అంతర్భాగంగా వున్న యానాంతో సహా మిగిలిన భాగాలను ఫ్రెంచ్ ప్రభుత్వంతో ఒక విధమైన ఒప్పందం కుదుర్చుకుని భారత్‌లో అంతర్భాగం చెయ్యగలిగారు. కాని పోర్చుగీసువారు మొండికేశారు. గోవా ప్రాంతానికి వున్న తీర ప్రాముఖ్యత దృష్ట్యా దానిని తాము వదులుకోదలచుకోలేదని తెగించి చెప్పారు విదేశీ పాలకులు.

చారిత్రాత్మకంగా భారత్‌లో అంతర్భాగమైన గోవామీద పోర్చుగీసుల పెత్తనం ఏమిటన్నది భారత ప్రభుత్వ ప్రశ్న! నాటి ప్రధాని నెహ్రూ పోర్చుగీసువారితో చర్చలు జరిపారు. అయినా అవి ఫలించలేదు.

చివరికి పోర్చుగీసులతో భారత్ దౌత్య సంబంధాలను రద్దుచేసుకుంది. అయితే అంతర్గతంగా గోవాలో పోర్చుగీసు పాలనకు వ్యతిరేకంగా పోరాటం పలుదశాబ్దాలుగా సాగుతూనేవుంది.

పోర్చుగీసులు బలవంతంగా మత మార్పిడులు చేసి హిందువులను క్రైస్తవులుగా మార్చారు. క్రమంగా గోవాను క్రైస్తవ ఆధిక్య ప్రాంతంగా మార్చటంలో పోర్చుగీసువారు దాదాపుగా సఫలీకృతులయ్యారు.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చి, గోవా పరాయిపాలనలో వుండటం నచ్చని స్థానికులు విప్లవ మార్గం ఎంచుకున్నారు. 'అజాద్ గోమంతక్ దళ్'ని ఏర్పాటు చేసి పోరాటం చేశారు. ఆ దళ్ నేతలను నిర్బంధించి పోర్చుగల్, అంగోలా జైళ్ళకు తరలించారు.

మరోవైపు జనసంఘ్, ప్రజా సోషలిస్ట్ పార్టీలు ప్రశాంతంగా నిరసన ఉద్యమాలను కర్ణాటక, మహారాష్ట్రాలనుండి గోవావైపుకు నడిపించారు.

అలా సత్యాగ్రహం చేస్తున్నవారిపై ఆగష్టు 15, 1954న పోర్చుగీసు పోలీసులు కాల్పులు జరపగా



పలువురు మరణించారు.

తాము చేస్తున్న శాసనోల్లంఘన ఉద్యమానికి భారత ప్రభుత్వం నుండి మద్దతు వస్తుందని గోవాలోని పోరాటవీరులు భావించారు. కాని నెహ్రూ ప్రభుత్వం సత్యాగ్రహులకు వ్యతిరేకంగా మాట్లాడింది.

పోర్చుగల్ 'నాటో'లో సభ్యత్వం కలిగివుంది కాబట్టి, 'నాటో'లోని ఇతర దేశాలు గోవా అంశంలో పోర్చుగల్‌కి మద్దతుగా వస్తే తట్టుకోలేమన్నది జవహర్‌లాల్ నెహ్రూ భయం. ఈలోగా తమ రాజ్యంమీద భారతదేశం దండయాత్ర చేస్తున్నదని పోర్చుగల్ అంతర్జాతీయ న్యాయస్థానానికి వెళ్ళింది.

ఆ న్యాయస్థానం భారత్‌ని వేచి చూడవలసిందిగా సూచనచేసింది. ఈలోగా పోర్చుగల్ అధీనంలో వున్న దాద్రా, నాగర్ హవేలీ ద్వీపాలవంటివాటిని గుజరాత్‌నుండి లభించిన మద్దతుతో ప్రజలు సొంతం చేసుకుని స్వతంత్రం ప్రకటించారు.

అయినా ఆ ప్రాంతాలను వెంటనే భారత్‌లో భాగంగా ప్రకటించలేదు నెహ్రూ. కొద్దికాలం అవి స్వతంత్ర ప్రాంతాలుగా చలామణి అయ్యాయి.

అలా దాదాపుగా దశాబ్దాలపాటు గోవా అంశంలో తాత్సారం చేసిన జవహర్‌లాల్ నెహ్రూ ఒక నిర్ణయానికి రాక తప్పలేదు.

గోవాలో అనుసరిస్తున్న అణిచివేత చర్యల్ని పోర్చుగీసు ఆపాలని, ప్రశాంత వాతావరణంలో భారత్‌లో విలీనానికి అంగీకరించాలని కోరారు. లేనిపక్షంలో భారత్ తన శక్తిని ప్రయోగించి గోవాను సొంతంచేసుకుంటుందని భారత ప్రభుత్వం స్పష్టం చేసింది.

పోర్చుగీసులు సక్రమంగా స్పందించనందున భారత్ తన సైనికదళాలను దాడికి సిద్ధం కమ్మని చెప్పింది. 1961 ఆగష్టులో సైనిక సన్నద్ధత మొదలైంది. గోవాలో అణిచివేత మరింత పెంచింది పోర్చుగీసు. గోవాలో పోర్చుగీసు వ్యతిరేక సంస్థలు పెరిగాయి. అజాద్ గోమంతక్ దళ్‌తోపాటుగా యునైటెడ్ ఫ్రంట్ ఆఫ్ గోవన్స్, గోవన్ పీపుల్స్ పార్టీ, గోవా లిబరేషన్ ఆర్మీ, క్విట్ గోవా ఆర్గనైజేషన్ వంటివి చురుకుగా పనిచేస్తున్నాయి.

'ఆపరేషన్ విజయ్' పేరుతో గోవామీద సైనిక చర్యకు డిశంబర్1, 1961న నెహ్రూ ప్రభుత్వం ఉత్తర్వులు ఇచ్చింది. భారతీయ నౌకాదళం గోవా తీరంలోకి వెళ్ళి నిలబడ్డాయి. సముద్రంమీద గస్తీ కాయటం నౌకాదళాలకు అదే తొలి అనుభవం.

ఆ విధంగా భారత సైనికదళాలు అన్నివైపుల నుండి రంగంలోకి దిగాయి. కేవలం రెండు రోజుల్లో గోవాలోని పోర్చుగీసు ప్రభుత్వం లొంగిపోయింది.

డిశంబర్ 19న గోవాని పోర్చుగల్ పాలననుండి విముక్తి చెయ్యగలిగింది భారత్. ఎంతగానో బెదిరించిన పోర్చుగల్ భారత్ సైనికదళాలు ప్రవేశించగానే స్థానిక పాలకుడు లొంగిపోయి, తమ హక్కులను వదులుకుంటూ సంతకం చేశాడు.

కాని పోర్చుగల్ మాత్రం గోవాని భారత్ సొంతం చేసుకోవటాన్ని 1974 వరకు అంగీకరించలేదు. గోవాని భారత్‌లో అంతర్భాగంగా గుర్తించలేదు.

కాని భారత్‌మాత్రం అంతా చట్టబద్ధంగా నిర్వహించింది. గోవాని వలసపాలకులనుండి సొంతం చేసుకుని సైనికాధికారి పాలన కింద పెట్టింది. మేజర్ జనరల్ కె.పి.కాండెత్‌ని మిలిటరీ గవర్నర్‌గా నియమించింది. 1962లో పంచాయత్, అసెంబ్లీ ఎన్నికలు నిర్వహించింది. 1963లో 12వ రాజ్యాంగసవరణ ద్వారా గోవాని భారత్‌లో భాగంగా తీసుకుంది.

1967లో నిర్వహించిన రిఫరెండంలో గోవా ప్రజలు మహారాష్ట్రతో కలిసేందుకు ఇష్టపడనందున దానిని కేంద్రపాలిత ప్రాంతం చేశారు.

1987లో గోవాని పూర్తిస్థాయి రాష్ట్రంగా ప్రకటించారు. నేడు మనం చూస్తున్న సుందర గోవా వెనకున్న గాథ ఇది. పర్యాటక కేంద్రంగా లక్షలాదిమందిని ఆకట్టుకుంటున్న గోవా ప్రశాంత ప్రదేశం.

గోవా విమోచన అంశాన్ని తీసుకుని నిర్మించిన సినిమాలు సాత్ హిందుస్తానీ, పుకార్.

# కదిలే బొమ్మల కబుర్లు

Review

## ఒక్కసారి రావా?

నేపథ్య సంగీతం సున్నితంగా గుండెల్ని మీటేస్తూ వుంటుంది. కెమెరా అలా స్మూత్‌గా కదులుతూ, మనల్ని అక్కడకి తీసుకెళ్ళే ప్రయత్నం చేస్తుంటుంది. బలమైన సీన్ ఇది అని దర్శకుడు మనకు మరింత బలంగా... సారీ... బలవంతంగా చెప్పే ప్రయత్నంచేస్తూ వుంటాడు. కానీ అక్కడ నటిస్తున్న హీరో హీరోయిన్లు ఇద్దరూ అలా కళ్ళు అప్పగించి చూస్తుంటారు.

వాళ్ళ ఫేసుల్లో ఫీలింగ్స్, సంతలో తప్పిపోయిన పిల్లాడిలా ఏదోలా కనిపిస్తుంటాయి. ప్రేక్షకుడికి ఇలాంటి టైమ్‌లో ఎమోషన్ కనెక్ట్‌కాక చేతిలో వున్న స్మార్ట్‌ఫోన్‌లోకి వెళ్ళిపోతాడు. ఇంకేముంది... ఖేల్ ఖతమ్... దుకాణ్ బంద్. టైమ్ బాబూ... టైమ్...

మార్నింగ్ మాంచి ఫిల్టర్ కాఫీనే తాగాలి. సాయంత్రం ఇరానీ చాయ్‌నే బాగుంటుంది. ఇప్పుడు సాఫ్ట్‌వేర్ టైమ్ నడుస్తోంది. పేరుకే కానీ, అదేమంత సాఫ్ట్ కాదు. కానీ సాఫ్ట్ అనుకుని ఇలాంటి సాఫ్ట్ సినిమాలు తీస్తే ఎవరు చూస్తారు? మళ్ళీ రావా? కాదు. ఒక్కసారి రావా? అన్నా ఎవ్వరూ రారు.




ఈ వారం విడుదలైన 'మళ్ళీ రావా' సినిమాసంగతే ఇదంతా. 'మళ్ళీ రావా' ఓ పొయిటిక్ ఫిల్మ్. దీంట్లో చెప్పడానికి పెద్దగా కథేమీ వుండదు. తొమ్మిదో తరగతిలో ప్రేమ, పెద్దయ్యాక పెళ్ళిగా మారే టైమ్‌లో భయం, ఆ తరువాత మళ్ళీ కలిసినప్పుడు, ఇంకోసారి విడిపోయే అన్న సంకోచం. ఇదీ సినిమా.

కార్తీక్ (సుమంత్), అంజలి (ఆకాంక్ష సింగ్) తొమ్మిదో తరగతి క్లాస్‌మేట్స్. అక్కడ ఇద్దరికీ ఒకరంటే ఒకరికి ఇష్టం. కట్‌చేస్తే వేరైపోయి మళ్ళీ సాఫ్ట్‌వేర్ ఉద్యోగులుగా కలుస్తారు.

పెళ్ళిదాకా వెళ్ళిన ప్రేమ ఒక్కసారిగా ఆగిపోతుంది. కారణం, కార్తీక్ వైఖరితో అంజలికి ఏదో తెలియని భయం. మళ్ళీ కట్‌చేస్తే రెండు రోజుల్లో



## భలే అవకాశాలు

తెలుగునాట అచ్చిరాలేదనుకుందేమో కోలీవుడ్, శాండల్ ఉడ్ చెక్కేసిన అంజలి తనకు దర్శక నిర్మాతలు మంచి అవకాశాలు ఇస్తున్నారు అంటూ కృతజ్ఞతలు చెప్పుకుంటున్నది.

"నన్ను మంచి నటిగా గుర్తిస్తున్న దర్శకులను నేను ఏనాడూ విస్మరించను. గ్లామర్ పాత్రలు ఎవరైనా చెయ్యగలరు. కాని నటనలో మెప్పించగలగాలి. నాకు అదృష్టవశాత్తూ మంచి పాత్రలే లభిస్తున్నాయి.

కథకు ఎంతవరకు న్యాయం చెయ్యగలను, ఎంత వరకు నటించగలను అనేది ముఖ్యం. నేనో మంచి నటినని అందరూ చెప్పుకుంటే చాలు" అంటున్న అంజలి ఇప్పటి తమిళ, మలయాళ పరిశ్రమలో ఆరేడు సినిమాలతో బిజీ. ◆

అంజలి పెళ్ళి వుందనగా కలుస్తారు. అప్పుడేం జరిగిందన్నది మిగిలిన సినిమా.

'మళ్ళీ రావా...' అన్నది మంచి టైటిల్. అందులో సందేహంలేదు. కొత్త దర్శకుడు గౌతమ్ తిన్ననూరి దగ్గర విషయం వుంది. కాంటెంపరరీ క్లాస్ ఫన్ పండించగల సత్తా వుంది.

అయితే 'మళ్ళీ రావా...' సినిమాకు రెండే కీలక సమస్యలు. అయితే ఫ్రెష్ ఫేస్‌లు వుండాలి లేదా కాస్త అనుభవం కలిగిన యంగ్ పెయిర్ వుండాలి.

క్లియర్‌గా చెప్పాలంటే 'మళ్ళీ మళ్ళీ ఇది రాని రోజు' సినిమాలో మాదిరిగా నిత్యామీనన్, శర్వానంద్ మాదిరిగా వుండాలి. అంటే ఫర్‌ఫెక్ట్ కాస్టింగ్ లేకపోవడం అన్నది ఓ సమస్య.

రెండవ సమస్య స్లయిసింగ్ స్క్రీన్‌ప్లే. అంటే ముక్కలు ముక్కలుగా చూపించడం. ప్రేక్షకుడు ఓ ముక్కను ఆస్వాదించేలోగానే, అది కట్‌చేసి మరోటి కళ్ళముందుకు తేవడం.

మామూలు సినిమాలకు లేదా థ్రిల్లర్ సినిమాలకు ఇలాంటి స్క్రీన్‌ప్లే సెట్ అవుతుందేమోకానీ, అనుభవించి పలవరించాల్సిన సినిమాలకు కాదు. ఇది రెండో సమస్య. ఈ రెండు సమస్యలకు తోడు ఇలాంటి సినిమాలకు కథ పెద్దగా వుండదు. కథనమే ప్రాధాన్యత వహిస్తుంది.

అందుకోసం దర్శకులు స్లోనెరేషన్‌ను ఎంచుకుంటారు. ఇది అన్ని తరహాల ప్రేక్షకులకు నప్పదు.

'మళ్ళీ రావా...' సినిమా ఎత్తుగడ, నడక ఓకె. కానీ విశ్రాంతికి ముందు పదేపదే మూడు ముక్కలుగా కథను అటు మార్చి, ఇటు మార్చి చెబుతూ వుంటే ఆసక్తి అంతగా కలగదు. దానికితోడు సన్నివేశాలు ఏమంత బలంగా వుండవు.జస్ట్ కథను అలా ముందుకు తోయడానికితప్ప.

పైగా లీడ్ పెయిర్ ఫేసుల్లో మరీ అద్భుతమయిన ఫీలింగ్స్ ఏమీ పలకవు. దీంతో సన్నివేశానికి సమకూరాల్సిన బలం సమకూరదు. పైగా సన్నివేశాలు అన్నీ కథను పెద్దగా మలుపు తిప్పేవిగానో, కథను ముందుకు తీసుకెళ్ళేవిగానో వుండవు.

దాంతో సినిమా సాగదీసినట్లు అనిపిస్తుంది తప్ప, సహజంగా కదులుతున్నట్లు అనిపించదు.

అయితే సినిమాలో ప్లస్ ఏమిటంటే సినిమా టేకింగ్ చాలా సహజంగా వుండడం, అలాగే అక్కడక్కడ సహజమైన ఫన్ పండడం. దీనికి తోడు సంగీత దర్శకుడు శ్రవణ్ భరద్వాజ్ నేపథ్య సంగీతం మూడ్‌ను ఎలివేట్ చేసేలా సాగడం. అందువల్ల సినిమాను అక్కడక్కడ చూడాలనిపిస్తుంది.

సినిమా ముగింపు అర్థవంతంగా వుంది. ఒకసారి విడిపోవడాన్ని భరించగలిగాను... మరోసారి విడిపోవడాన్ని భరించలేను... అందువల్ల కలవడంకన్నా ఇలాగే వుండడం బాగుంటుందేమో అని కథానాయకుడు అనుకోవడం అర్థవంతమైన ముగింపు. దానికి కథానాయిక సమాధానం కూడా బాగుంది.



## అంతా అదృష్టం

అందాలన్నీ ఉన్నా, నటనలో ఆరితేరినాఅదృష్టం కలిసిరాని తారల్లో రెజీనా కెసెండ్రా ముందుంటుంది. ఎన్ని సినిమాలు చేసినా పాపం అదేంటోకాని, ఒక్క హిట్టూ దక్కలేదు. ఒకటీ, అరా ఉన్నా అవి హీరోల క్రెడిట్‌లోకి వెళ్ళిపోయాయి.

ఈ మధ్య వచ్చిన 'బాలకృష్ణుడు' సినిమాపై రెజీనా పెట్టుకున్న ఆశలన్నీ అడియాసలయ్యాయి. ప్రస్తుతం 'అ'లో మరో ఇద్దరు టాప్ తారలమధ్య నటిస్తుంది. కాబట్టి సినిమా హిట్టయినా రెజీనా ఖాతాలోకి వస్తుందో లేదో డౌటే. ◆

సుమంత్ ఈ పాత్రకు సరిగ్గా సరిపోయినట్లుంటుంది. ఎప్పుడో ఏదో పోగొట్టుకున్నట్లు ఫేస్ పెట్టడంలో సుమంత్ ఎక్స్‌పర్ట్. కాబట్టి ఈ సినిమాలో కొసనుంచి కొసకీ అలాగే కనిపిస్తాడు.

హీరోయిన్‌గా నటించిన ఆకాంక్ష సింగ్‌కన్నా తొమ్మిదో తరగతిలో హీరోయిన్‌గా కనిపించిన బేబీ ప్రీతీ అస్రానీ బాగా నటించింది. ఆమె కళ్ళలో మంచి ఫీలింగ్స్ పండాయి. సాంకేతిక విలువలు బాగున్నాయి. కానీ ఏవో కాసిన్ని సన్నివేశాలు బాగున్నాయి.

అక్కడక్కడ ఫన్ పండింది. అలాగే మాటలు బాగున్నాయి. చిత్రీకరణ హార్ట్ టచింగ్‌గా వుంది కాని ఈ రెండుగంటల సాగదీతను జనం భరించడం కొంచెం కష్టమే అనుకోవాలి.

**ప్లస్‌పాయింట్స్...**
సంగీతం, కెమెరా

**మైనస్‌పాయింట్స్...**
కథనం, స్క్రీన్‌ప్లే

**పంచ్‌లైన్**
ఒక్కసారికే కష్టం... మళ్ళీనా? ◆

## ఎలా ఆడుతున్నాయి?

- బాక్సాఫీస్ డల్‌గా వుంది.థియేటర్ ఖర్చులు పోను, ఏదో అలా అలా కాస్త షేర్ తెచ్చుకుంటున్నాయి తప్ప, అద్భుతమైన కలెక్షన్లు ఏవీ కళ్ళ చూడడం లేదు విడుదలైన సినిమాలు ఏవీ కూడా.
- 'జవాన్' సినిమా తొలి మూడురోజుల తరువాత డల్ అయింది. మార్కెట్‌లో అదే రేంజ్ సినిమాలు లెక్కకు మిక్కిలిగా వుండడం, సీజన్ సరిగ్గా లేకపోవడం అన్నది మైనస్‌గా మారింది.
- దాదాపు థియేటర్లు అన్నింటిలో చిన్న సినిమాలే వున్నాయి. అవన్నీ థియేటర్ల ఫీడింగ్‌కు పనికివస్తున్నాయి తప్ప, నిర్మాతలకు పెద్దగా ఉపయోగం వుండడంలేదు. ◆

Review

# చెట్టుకింద ప్లీడరు

సబ్జెక్ట్ చూసి సూపర్ అంటే సూపర్ అని అనేసుకోవడం వేరు, అదే సబ్జెక్ట్‌తో తాము సినిమా చేయడం వేరు. సినిమా బాగుందో లేదో చెప్పడానికి అభిరుచి వుంటే చాలు. కానీ అదే సినిమాను హీరోగా తనే చేసేయాలంటే మాత్రం చాలా కావాలి.

ముఖ్యంగా తెలుగు హీరోలు ఐతే, తమ కాళ్ళు, చేతులు కథలో పెట్టడంమానేయాలి.కానీ ఇది జరిగే పని కాదు. అందుకే చాలా మంచి రీమేక్ సినిమాలు బాక్సాఫీస్ దగ్గర బకెట్ తన్నేస్తుంటాయి. లేటెస్ట్‌గా ఆ జాబితాలో చేరిన సినిమా 'సప్తగిరి ఎల్‌ఎల్‌బి'.

హిందీలో మాంచి హిట్ అయిన 'జాలీ ఎల్‌ఎల్‌బి'ని తెలుగులోకి తెచ్చే ప్రయత్నం. నిజానికి ఈ సినిమా కథేమీ కొత్తది కాదు. మన దగ్గర సీనియర్ డైరెక్టర్ వంశీ ఎప్పుడో తీసిన 'చెట్టుకిందప్లీడరు' సినిమాటైపే. ఓ చోటా మోటా లాయర్ ఓ కాకలు తీరిన బడా లాయర్‌ను ఢీకొని కోర్టులో గెలవడం.

'చెట్టుకింద ప్లీడరు'లో ఒక హత్య కేసు డీల్‌చేస్తే, ఇక్కడ ఓ ప్రమాదం కేసును డీల్ చేస్తారు.

చెట్టుకింద ప్లీడరుతో పోలికలు వున్న 'సప్తగిరి ఎల్‌ఎల్‌బి' సినిమా కథేంటంటే... సప్తగిరి (సప్తగిరి) ఓ చిన్న ఊరిలో లాయర్. కానీ సరైన పేరు, డబ్బు వస్తేతప్ప ప్రేమించిన మరదలుపిల్ల దక్కదు. అందుకే ఛలో హైదరాబాద్ అంటాడు.

ఇదిలా వుంటే ధనవంతుడైన నవాబ్‌గారి మన వడు తాగి పేవ్‌మెంట్‌మీద పడుకున్నవారిపై నుంచి కారు పోనిస్తాడు. దాంతో ఆరుగురు మరణిస్తారు.

ఆ కేసును టేకప్ చేస్తాడు టాప్ లాయర్ రాజ్‌పాల్ (సాయికుమార్). తన క్లయింట్ నిర్దోషి అని వాదించి గెలుస్తాడు. కానీ అక్కడ ఓ లూప్ హోల్ కనిపించి, ఆ కేసును టేకప్ చేస్తాడు సప్తగిరి.

మళ్ళీ రీఓపెన్ చేయిస్తాడు. దాంతో రాజ్‌పాల్‌కు, సప్తగిరికి ఢీ అంటే ఢీ. ఆ న్యాయపోరాటం చివరకు ఎలా ముగిసిందీ అన్నది మిగిలిన సినిమా.ఒక సినిమా హిట్ అయిందంటే దానికి చాలా కారణాలుంటాయి. కేవలం సినిమాను పట్టుకుని రీమేక్ చేయకుండా ఆ కారణాలుకూడా తెలుసుకుని రీమేక్ చేయాలి.

కానీ మనవాళ్ళు ఈ విషయం పక్కాగా విస్మరిస్తారు. అక్కడే అసలు సమస్య వస్తుంది.

హిందీలో 'జాలీ ఎల్‌ఎల్‌బి' హిట్ అయింది అంటే అందులో నటించిన హేమాహేమీలు.

ఎక్కడ ఫన్ వుండాలో, ఎక్కడ సీరియస్‌నెస్ వుండాలో అన్నదానిపై దర్శకుడికి వున్న అవగాహన. అంతకుమించిఅందులో పెద్దగా కనిపించని హీరో చిత కార్యక్రమాలు. కానీ 'సప్తగిరి ఎల్‌ఎల్‌బి' సినిమా సంగతి వేరు. ఇక్కడ హీరో కావాలనుకుంటున్న కమెడియన్ సప్తగిరి వున్నాడు. అతగాడికి పాటలు కావాలి. ఫైట్లు కావాలి. ఇంట్రడక్షన్ సీన్ కావాలి.

మళ్ళీ పొరపాటున జనం తన నుంచి కామెడీనే కోరుకుంటారేమో అన్న అనుమానం. అందుకే నేల బారు కామెడీ కావాలి. వీటన్నింటికి తోడు మాతృకలో వుండే విషయం ఇందులోనూ వుండాలి.

ఇవన్నీ గొంతెమ్మ కోర్కెలు కాదా? సాధ్యమయ్యేదేనా? అవుతుందేమో? అనుభవం పండిన దర్శకుడు వుండి వుంటే. కానీ ఇక్కడ వున్నది తొలిసారి మెగాఫోన్ పట్టిన చరణ్ లక్కాకుల. ఇంకేం సాధ్యం అవుతుంది. అందుకే బండి గాడి తప్పేసింది.

సినిమా ప్రారంభమైన ఇరవై నిమిషాలకే తెలిసిపోతుంది సినిమా రాంగ్ ట్రాక్‌లో వెళ్తోందని. పంచాయతీలో హీరో తెలివితేటలు, ఆపై ఇంట్రడక్షన్‌సాంగ్, ఆ తరువాత ఫన్‌కోసం చొప్పించిన దండు పాళ్యం సీన్ జనాలను తలపట్టుకునేలా చేస్తాయి.




ఆ తరువాత కోర్టులో జరిగే సీన్లు కొన్ని జబర్దస్త్ లాంటి చౌకబారు హాస్యాన్ని తలపింపచేస్తాడు.

సరే మొత్తానికి ఏ విధమైన రుచీపచీ లేకుండానే సినిమా విశ్రాంతికి చేరుతుంది.

విశ్రాంతి తరువాత సినిమా కాస్త సీరియస్‌నెస్‌ను సంతరించుకుంటుంది. అయితే అవసరంలేకున్నా చొప్పించిన పాటలు, హీరోయిన్, కథతో సంబంధం లేకుండా ఇమేజ్ బిల్డింగ్ కోసం అన్నట్లుగా, రైతులు, రైతులు అంటూ రంకెలు కథను పక్కదారి పట్టిస్తాయి. అయితే మాతృకనుంచి దూరంగా జరగకుండా చేసిన మంచి పని క్లైమాక్స్.

అక్కడ మాత్రం డైలాగులతో సహా మాతృకమీదే ఆధారపడ్డారు. దాంతో చివరి ఇరవైనిమిషాలసేపు ప్రేక్షకుల్ని ఆకట్టుకుంటాయి. ఇలాంటి సినిమాలో కీలకమయినవి మూడు క్యారెక్టర్లు.

సప్తగిరి, సాయికుమార్, ఎన్.శివప్రసాద్. సాయి కుమార్ తన శక్తిమేరకు చేయగలిగారు. శివప్రసాద్ కూడా ఓకె.సప్తగిరి సీరియస్ సీన్లు సెటిల్డ్‌గానే చేశాడు. పాటలు, డ్యాన్స్‌లు, ఫైట్లు అతని అభిరుచి, దానితో ప్రేక్షకులకు సంబంధంలేదు. స్పందనా వుండదు.

సాంకేతికంగా సినిమా ఏమీ అద్భుతాలు చేయలేదు. బుల్గానిన్ సంగీతం ఏమిటోలా వుంది.ఓ పాట కాస్త నయం.పరుచూరి మాటలు బాగున్నాయి కానీ, సందర్భం లేకపోయినా రైతులు... రైతులు అనడం ఏమిటో అర్థం కాదు. సినిమాటోగ్రఫీ ఓకె.

నిర్మాణ విలువలు బాగున్నాయి.

**ప్లస్‌పాయింట్స్...**

కథ

**మైనస్‌పాయింట్స్...**

కథనం, హీరో

**పంచ్‌లైన్**

కేసు ఓడిపోయింది



## చిన్ననాటి కల

ఢిల్లీ పిల్ల, మోడలింగ్ నుంచి సినిమాల్లోకి వచ్చిన కషిష్ వోహ్రా 'సప్తగిరి ఎల్‌ఎల్‌బి'లో సందడి చేసింది. నటన తన చిన్ననాటి కలంటూ ఉత్సాహపడుతున్నది. "నా నిర్ణయానికి నా కుటుంబసభ్యులుకూడా మద్దతిచ్చారు. చదువు పూర్తయ్యాక ముంబయి వెళ్ళిపోయా. అక్కడ అనేక కమర్షియల్స్ చేశాను.

'సప్తగిరి ఎల్‌ఎల్‌బి' సందేశాన్ని ఇచ్చిన చిత్రం. హాస్యం, డ్రామా మిళితం అయ్యాయి.

కెమెరాకు కొత్తకాకపోయినా తొలిషాట్‌లో కొంచెం నెర్వస్‌గా ఫీలయ్యాను" అని చెప్పింది. ◆

హీరో భగవాన్ పేరు ఈ తరంవారికి తెలిసే అవకాశం లేదు. అయితే ఈ తరం బాగా నచ్చిన, మెచ్చిన హీరో అమితాబ్ బచ్చన్ గురించి ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. సినిమాలలో అమితాబ్ చేసే డ్యాన్స్‌లు ప్రత్యేకంగా వుంటాయి.

ఒక చెయ్యి నడుముమీద, మరో చెయ్యి తల పక్కనపెట్టి పక్కకు తిరిగివేసే స్టెప్‌లు ఎంతో ప్రసిద్ధి చెందినవి. అయితే ఆ స్టెప్‌లు అమితాబ్ సొంతానివి కావని తనకన్నా ఎంతో ముందుగా అలాంటి డ్యాన్స్‌లు చేసిన భగవాన్‌ని చూసి అనుకరించినవని చాలామందికి తెలియదు.

ఒక దశాబ్దంపాటు చక్కని హిట్‌లుకొట్టిన హీరో ఆ తర్వాత తెరమరుగవటమే ఒక చిత్రం. భగవాన్ పూర్తి పేరు 'భగవాన్ అధీజీ పలావ్'. పుట్టింది బట్టల మిల్లులో కూలీగా పనిచేస్తున్న తండ్రికి.

నాటి ముంబయిలో మిల్లు కార్మికులకోసం వరుసగా వుండే సత్రం, వంట ఇళ్ళు వుండేవి. ముందు వరండా, మధ్యలో ఒక గది, వెనక వంట ఇల్లు.

వీటిని వారు 'ఛాల్స్' అనేవారు. అటువంటిచోట 1913లో పుట్టిన భగవాన్‌కి సినిమాల పిచ్చి.

చదువు ఒంటపట్టలేదు. తండ్రితో కూలీకి వెళ్ళేవాడు. కాని సినిమాలు పిచ్చిపిచ్చిగా చూసేవాడు. దాదర్‌లో మకాం వుంటూ, మూగ సినిమాల కాలంలో స్టూడియోల చుట్టూ తిరుగుతూ, చిన్నా చితకా పాత్రలు వేస్తూ సినిమాలలోకి ప్రవేశించగలిగానని సంతోషించేవాడు. అలా సహాయదర్శకుడు, సహ నిర్మాతలాంటి పనులు చాలా చేశాడు.




సినిమా చూసేందుకు అణా లేక, ఎలాగా అని సినిమాహాలు ముందు ఎదురుచూసిన భగవాన్, తన సినిమాలు అదే థియేటర్‌లో ఆడుతుంటే కారులో వచ్చిచూసేవాడు. దాదర్‌లో తన 'ఛాల్'లో వున్న రెండు గదుల ఇంటిని మాత్రం అమ్మలేదు భగవాన్.

సాధారణంగా ఎవరికైనా తొలి సినిమాలో నటన ద్వారా గుర్తింపువస్తుంది.కాని భగవాన్‌కి నటన చెయ్యలేకపోవటం గుర్తింపు తెచ్చింది. అతగాడికి 1942లో తొలిసారిగా హీరో అవకాశం వచ్చింది. హీరోయిన్ లలిత పవార్. అప్పటికే గుర్తింపు వున్న నటి ఆమె.

ఆ సినిమాలో లలిత పవార్‌ని చెంపదెబ్బ కొట్టాల్సిన సీన్‌లో చెంపదెబ్బ కొట్టినట్టు నటించటం చేతకాక నిజంగానే చాచి ఆమె చెంపమీద దెబ్బకొట్టాడు.


మాస్టర్ భగవాన్
(1913-2002)

ఆ దెబ్బకు ఆమె కన్ను దాదాపుగా పోయింది. ఆమె కెరీర్ నాశనం అయింది. అది భగవాన్‌కి తొలి సినిమాలో వచ్చిన గుర్తింపు. ఆ తర్వాత అతనితో నటించేందుకు హీరోయిన్‌లు భయపడ్డారు. ఐనా తట్టుకుని నిలబడ్డాడు. రాజ్‌కపూర్ అతడిని ప్రోత్సహించాడు.

భగవాన్‌కి క్రమంగాహిట్స్ వచ్చాయి.1952లో ఆయన స్వయంగా నిర్మించి, నటించిన 'అల్బేలా' సూపర్ డూపర్ హిట్. భగవాన్ తన ఆదాయంతో జుహులో 25 గదులు ఉన్న ఒక పెద్ద బంగళాని సముద్రముఖంగా నిర్మించుకున్నాడు. అతని ఇంటి ముందు ఏడు కార్లు, అన్నీ విలాసవంతమైనవి, భిన్న కంపెనీలు తయారుచేసినవి వుండేవి.

వారంలో ఒక్కొక్కరోజు ఒక్కో కార్‌లో షూటింగ్‌లకు వెళ్ళేవాడు. గీతాబాలి హీరోయిన్‌గా తాను హీరోయిన్‌గా చేసిన 'అల్బేలా' హిట్‌తో అతని జీవితం తారాస్థాయికి చేరింది. దాదర్‌లో సత్రంలో రెండు గదుల ఇంటిలో ఐదారుగురితో కలిసి బతికిన భగవాన్ ఇప్పుడు అతిపెద్ద బంగళాకి అధిపతి.

సినిమా చూసేందుకు అణా లేక, ఎలాగా అని సినిమాహాలుముందు ఎదురుచూసిన భగవాన్, తన సినిమాలు అదే థియేటర్‌లో ఆడుతుంటే కారులో వచ్చిచూసేవాడు. దాదర్‌లో తన 'ఛాల్'లో వున్నరెండు గదుల ఇంటినిమాత్రం అమ్మలేదు భగవాన్.

పిల్లవాడిగా తాను వాడిన వస్తువులన్నీ అలాగే ఆ ఇంట్లోవుంచాడు. తమ కుటుంబం మంచం అలాగే వుంచాడు. అప్పుడప్పుడు వచ్చి ఆ ఇంటిని చూసుకునివెళ్ళేవాడు. ఆ 'ఛాల్' నిర్వహణకోసం ప్రత్యేకంగా పనివాళ్ళని నియమించాడు.

హిందీ సినిమాలలో మొదటి డ్యాన్సింగ్ స్టార్ భగవాన్. రంబ, సాంబ, డిస్కో, రాక్ అండ్ రోల్‌వంటి డ్యాన్స్‌లన్నీ హిందీ సినిమాలలో తొలిసారిగా చేసింది అతనే.భగవాన్ కమెడియన్‌గా కూడా మెప్పించాడు. దాదాపు వంద సినిమాలలో నటించాడు.

'అల్బేలా' హిట్‌తో తాను ఏమి చేసినా హిట్ అవుతుందనుకున్నాడు. అదే మోస్తరు ఫార్ములాతో మరో సినిమా తీశాడు. అది అట్టర్ ఫ్లాప్.

పోయినచోటునే వెతుక్కోవాలని అనుకున్న భగవాన్ మళ్ళీ మళ్ళీ సినిమాలు తీశాడు. భారీగా నష్టపోయాడు. సినిమాలు ఆడలేదు. సినిమాలకోసం చేసిన అప్పులు, వాటిమీద వడ్డీలు పెరిగాయి.

నాటివరకు భగవాన్ వెంట నడిచిన చాలామంది స్నేహితులు నెమ్మదిగా వెనక్కి వెళ్ళిపోయారు.

ముంబయిలో బతికేందుకు భగవాన్ ముందున్న మార్గం ఒక్కటే. వున్నవి అమ్ముకోవటం.

ఒక్కొక్క కారే అమ్ముకున్నాడు. ఎవరు ఏ పాత్ర ఇచ్చినా చేస్తానంటూ నిర్మాతల వెంటపడ్డాడు.

'చోరి చోరి', 'జనక్ జనక్ పాయల్ బాజే' వంటి రెండు సినిమాలలో తప్పించి మిగిలిన సినిమాలలో ఏవీ చెప్పుకోదగ్గ పాత్రలు దొరకలేదు. అయినా ఒక నిమిషం, అరనిమిషం పాత్రలు అంగీకరించాడు.

ఈలోగా పాతిక గదుల బంగళా అమ్మేయాల్సి వచ్చింది. డ్రెస్‌లు పోయాయి. ముఖంలో కళ పోయింది. పేదరికం వెంటాడింది. విలాస జీవితం గడిపిన భగవాన్ తిరిగి దాదర్‌లోని తన రెండు గదుల సత్రం గదిలోకి మకాం మార్చుకున్నాడు. నడిచివెళ్ళేవాడు షూటింగ్‌లకి.

కొన్ని సందర్భాలలో చెప్పులు వుండేవి కాదట. ఎంతోమంది ఒకనాడు అతనికి స్నేహితులు. కాని చివరికి సత్రంలో మంచంలో పడున్న భగవాన్‌ని చూసేందుకు సంగీత దర్శకుడు సి.రామచంద్ర, పాటల రచయిత రాజేందర్ కిషన్, నటుడు ఓం ప్రకాష్ మాత్రం అప్పుడప్పుడు వచ్చేవారు.వారే కొద్దో గొప్పో ఆర్థికంగా ఆదుకునేవారు.

అయినా భగవాన్ మానసిక ఇబ్బందిని ఎవరు తొలగించగలరు. అలా ఆ సత్రం గదిలో రెండు దశాబ్దాలపాటు ఎటువంటి గుర్తింపులేక ఒంటరి జీవితం గడిపాడు. ఎక్కడ ప్రారంభమయిందో జీవితం తిరిగి అక్కడికే చేరింది.

ఎటువంటి పేదరికంలో తొలినాళ్ళ జీవితం గడిచిందో తిరిగి అదే పేదరికంలోకి నెట్టబడ్డాడు. ఆ చిత్రమయిన జీవితచక్రం 2002 ఫిబ్రవరి 4న భగవాన్‌కి గుండెపోటు రావటంతో ముగిసింది.

భగవాన్ జీవితంమీద 'ఏక్ అల్బేలా' పేరుతో మరాఠీ సినిమాని నిర్మించారు ఇటీవల.

# ఈ శీర్షిక మీదే

## ఉత్తమ ప్రశ్న-సమాధానం

* ఎల్.లక్ష్మీనాయుడు సింహాచలం
**సెల్ఫీ కామెంట్ ప్లీజ్?**
ఎవరి ఫొటోకి వారే దండవేసుకునే కొత్త ప్రక్రియ.

* ఆర్.ప్రశాంతి, విజయనగరం
**దేవునికి 'తల' నీలాలెందుకిస్తారు?**
'చిక్కులు' పోగొట్టినందుకు.

* కె.వి.ఎస్.ఎస్.ఎల్.ఎన్.నగేష్, విశాఖపట్నం
**ముసలితనం వచ్చిందనడానికి బండ గుర్తు?**
భార్య అనుమానంగా చూడడం మానివేయడం.

* ఎల్.శ్రీనివాసరావు, జగదేవిపేట
**వి.ఐ.పి. అంటే?**
విలేకర్లని ఇంటికి పిలిపించుకునేవాడు.

ఉత్తమ ప్రశ్నకు ₹ 500
ప్రతి ప్రశ్నకు ₹ 300 బహుమతి

* కె.నాగ వెంకట ఆంజనేయులు, అగనంపూడి
**తీయని తలుపులు ఉండేదెక్కడ?**
తీయని తలుపుల వెనుక.

* బి.మున్నీబాయి, గుత్తికొండ
**అసలైన రాజకీయ నాయకుడి కొడుకు?**
'జో'కొట్టటానికి బదులుగా 'బై'కొడితే నిద్ర పోయేవాడు.

* ఆర్.ప్రశాంతి, విజయనగరం
**ఒన్‌సైడ్ లవర్స్ ఎవరు?**
ప్రకృతి ప్రేమికులు.

* ఆర్.ప్రశాంతి, విజయనగరం
**మనసుకి ఎప్పుడు 'నొప్పి' పుడుతుంది?**
ఎదుటివారు దెప్పి 'పొడిచి'నప్పుడు.

* డి.వి.చంద్రశేఖర్, కర్నూలు
**నాయకుల విగ్రహాలు రోడ్డు మధ్యలో వుంటాయెందుకు?**
బతికివున్నప్పుడు వాళ్ళు చేసిన రాస్తారోకోలకు గుర్తుగా.



## ఈ కార్టూన్ మీదే







"మమ్మీ ఎందుకో నాన్న కళ్ళ వెంట నీళ్ళు ఆగటం లేదే..." "నేవాడిన క్రెడిట్ కార్డు తాలూకు బిల్లు వచ్చివుంటుంది లేదా బేటా..."

"ఏంటే, అలా మాత్ర అంచులు కత్తిరిస్తున్నావు... మింగకుండా..." అన్నాడు భార్యతో రాము.

"ఈ మాత్రలవల్ల 'సైడ్ ఎఫెక్ట్' రాకుండా వుండాలని...." అంది భార్య రమణి.

రైలు కంపార్ట్‌మెంట్‌లోకి అందరినీ అవతలికి నెట్టి ఎక్కటానికి ప్రయత్నంచేస్తున్న కాంతారావుని "ఏమిటిది" అని నిలదీసింది ఒక మహిళ.

"నేను పులిబిడ్డను... నా ఇష్టం" అన్నాడు కాంతారావు తడుముకోకుండా.

"అదేంటి... మీ అమ్మ అడవిలోకెళ్ళి కాపురం చేసిందా?" అని ఆమె అడిగేసరికి తుస్సుమన్నాడు పులిబిడ్డ కాంతారావు.

కొత్తగా కాలేజీలో లెక్చరర్‌గా చేరిన వాసు వచ్చి తన ఎదురుగా కుర్చీలో కూర్చోవటం ప్రిన్సిపాల్ అజరయ్యకి నచ్చలేదు.

అతడిని ఎలాగైనా అవమానించాలని "నీలాంటి కోన్‌కిస్కాగాళ్ళతో నేను మాట్లాడను పో" అన్నాడు.

"నేనూ అంతేనండీ... వస్తా..." అంటూ వెళ్ళిపోయాడు లెక్చరర్ వాసు.

భార్యాభర్తలు పోట్లాడుకున్నారు.

భర్తని భార్య కొట్టింది. కేసు కోర్టుకు వచ్చింది.

"సాక్షిగా పక్కింటి అబ్బాయిని పిలిచి ఆ విషయం మీద నువ్వు ఏం చెప్పాలనుకుంటున్నావు" అని అడిగాడు జడ్జి.

"ప్రాణంపోయినా పెళ్ళిచేసుకోదలచుకోకూడదనుకున్నా సార్"చెప్పాడు సాక్షిగా వచ్చిన కుర్రాడు.

"అప్సరసలు స్వర్గంలోనే వుంటారన్నావుకదా మమ్మీ..." అని అడిగాడు వేణు.

"అవున్రా"

"మరి నాన్న అప్సరసలా ఉన్నావని చెప్పే పక్కింటి ఆంటీ ఈ లోకంలో ఎందుకుందమ్మా..."

"మనిద్దరం డిన్నర్ కలిసి చేద్దాం సరేనా" అంది కాంచన కొలీగ్ శంకర్‌తో.

"అయితే నన్ను ఎన్నింటికి మీ ఇంటికి రమ్మంటావు డిన్నర్‌కి" అన్నది శంకర్ ప్రశ్న.

"మా అల్లుడి కాలికి దెబ్బ తగిలింది" అంటూ వచ్చాడు డాక్టర్ దగ్గరికి.

"అదేంటండీ... అల్లుడిని అంత దెబ్బ ఎందుకు కొట్టారు" అని అడిగాడు డాక్టర్.

"ఆ దెబ్బలు అల్లుడు కాకముందు కొట్టినవి డాక్టర్" అన్నాడు.

56 YEARS of Excellence SINCE 1962
A UNIT OF The Chennai Silks
SWATI SAPARIVARA PATRIKA PRINTED AT ANIL SWATI PRESS AUTONAGAR VIJAYAWADA
RNI 38008 / 1984 REGD NO VJ / 025 / 2015-17 L.NO.PMG/VJA/PWPP/2/2015-17

# భారతదేశ వ్యాప్తంగా నేటితరం మహిళలు ఇష్టపడే వివిధ ఫ్యాషనబుల్ డిజైన్‌లలో వినూత్నంగా తీర్చిదిద్దబడిన విస్తృత శ్రేణి గాజులు మీ కోసం మరింత ప్రత్యేకం!!

| | | | | |
|---|---|---|---|---|
| ఆంటిక్ బ్యాంగిల్స్ | జిగ్‌జాగ్ బ్యాంగిల్స్ | టీనేజ్ బ్యాంగిల్స్ | బెంగాల్ బ్యాంగిల్స్ | కోరల్ బ్యాంగిల్స్ |
| వెడ్డింగ్ సెట్ బ్యాంగిల్స్ | ఫ్యాన్సీ బ్యాంగిల్స్ | రియల్ స్టోన్ బ్యాంగిల్స్ | జిర్కాన్ బ్యాంగిల్స్ | పెరల్ బ్యాంగిల్స్ |
| బాంబే బ్యాంగిల్స్ | రెగ్యులర్ యూజ్ బ్యాంగిల్స్ | నాగాస్ బ్యాంగిల్స్ | కెంప్ బ్యాంగిల్స్ | కేరళ బ్యాంగిల్స్ |

'వెయిట్'లో మరియు 'సైజ్'లో కావలసిన అన్ని క్యాటగిరీల బ్యాంగిల్ సెట్‌ల విస్తృత శ్రేణి










Y - Junction, Kukatpally, Hyderabad. Ph: +91 40 2371 6888.
వై-జంక్షన్, కూకట్‌పల్లి, హైదరాబాద్, ఫోన్: + 91 40 2371 6888.



జ్యుయలరీ షాపింగ్ అనుభూతి అద్భుతం, ఆనందప్రదం!

## శ్రీ కుమరన్
తంగమాలిగై
గోల్డ్ • డైమండ్స్
'ది చెన్నై సిల్క్స్' బిల్డింగ్

తెలంగాణ • ఆంధ్రప్రదేశ్ • తమిళనాడు • కేరళ